Reg. No. M. 2284

శ్రీ

శివాయ గురవేనమః.

# శైవరహస్యబోధిని.



ఇది

శ్రీ దేవిడీ సంస్థానాధిపతులగు ఇజ్జితాసార్

శ్రీ కందుకూరి బాలసూర్యప్రసాద భూపాలుని

సాహాయ్యమున వెలువడుచు

శైవధర్మములను, వాని ప్రామాణ్యమును దెలుపు

ద్విమాసపత్రిక.


| సంపుటము 7 | ప్రమోదూతనామ సంవత్సర జ్యేష్ఠాషాఢ మాసములు. | సంచిక 2 |
| --- | --- | --- |


సంపాదకుడు:—బ్ర॥శ్రీ॥ మహోపాధ్యాయ,

ముదిగొండ నాగలింగశాస్త్రి.

శ్లో॥ అనుష్ఠితాచార పరత్వసాధినీ ।
విరుద్ధవాదౌఘనితాన్త బాధినీ ।
అశేషశంకామయపంకశోధినీ ।
జయత్వియం శైవరహస్యబోధినీ ॥

తెనాలి రజత ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.

చందా సం॥ రు 2—0—0.

1930

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దానింబట్టి రావణుని గుట్టెల్ల దెలిసికొని శ్రీరామచంద్రుఁడు రావణుని గెల్చినట్లె భావించి విభీషణుడు తనయందు దృఢవిశ్వాసము గలిగి జరుగబోవు సంగ్రామమున దనకుఁ దగు సాహాయ్యకము సేయుటకై ముందుగనే యాతనిని లంకారాజ్యమునకు నభిషిక్తుని గావించెను. ఇందు గనఁబరిచిన వచనములంబట్టి విభీషణుడు రాజ్యార్థి యేయని విశదమగుచుండ నతఁడు మోక్షార్థియనియు నాతని శరణాగతి ముఖ్యమనియు వచించుట నిర్మూలము.

వెనుకజెప్పిన రామాయణ వచనములంబట్టి శ్రీరామచంద్రునకు పరమేశ్వరునందు భక్త్యతిశయ మున్నట్లు స్పష్టమైనది. దీనింబట్టి పరమేశ్వరుండె పరాత్పరుండను సర్వవేద సిద్ధ సిద్ధాంతమే శ్రీవాల్మీకి రామాయణమునకుఁ బ్రధాన ప్రతిపాద్యమగు వ్యంగ్యమనియు— దానంజేసియే యీ గ్రంథము శ్రుతి సమ్మతమనియు నేర్పడియెను.

అన్నం— ఆచార్యులవారూ! విమర్శించు నెడ కొనకు వాల్మీకి రామాయణముగూడఁ మీ మతమునకు ననుకూలము గాదనియె యేర్పడియె గదా?

ప్రతి— అదియేల?

అన్నం— ఉత్తర కాండమున శ్రీరామచంద్రుఁ డశ్వమేధము నీశ్వర ప్రీతికై చేసి నట్లును, నారాయణమూర్తి భృగు శాపమున దశావతారముల నెత్తినట్లును గలదుగాన నాకాండము వాల్మీకి కృతము గాదనిచెప్పి ప్రమాణము గాదని యంగీకరించు చున్నారుగదా?

ప్రతి— ఉత్తరకాండము ప్రమాణము గాదు నిజమే.

అన్నం— పూర్వ రామాయణమున నైనను ఆదిత్య హృదయము నంగీకరింతురా?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రతి—అది ప్రక్షిప్తము.అనగా ఇతరులు చేసి కలిపినదే.

అన్నం—కడమ చోట్లనైనను దిద్దకుండ రామాయణమును గ్రహించితిరా?

ప్రతి—ఎక్కడ దిద్దితిమి.

అన్నం—అయోధ్యా కాండమున 'రుద్రస్సవిష్ణుః' అనుచోట 'రుద్రస్సనందీ' అని దిద్దవలసి వచ్చెనుగదా?

ప్రతి—మతాంతరులె 'రుద్రస్సవిష్ణుః' అని దిద్దినందున దానిని మాయాచార్యులవారు సవరించిరి.

అన్నం—అదిగాక—కడమచోట్ల నపార్థములు చెప్పితిరి గదా?

ప్రతి—అది యెక్కడ?

అన్నం—మహాతేదేవతాయాజ్యం, అనుచోటను, 'అత్రపూర్వం మహాదేవః' అను చోటను గ్రంథకర్త పరమేశ్వరుని మహాదేవ పదముతో గ్రహించి యాపదమునఁ దనకుగల యభిరుచిని వెల్లడించియుండ నాపదమునకు నగ్నియని యొకచోటను, అమ్మహాదేవః, అనిఛేదించి దానికి సముద్రుఁడని వేరొక చోటను నిట్టి యపార్థమును చెప్పితిరి గదా?

ప్రతి—సదర్థములె.

అన్నం---సదర్థము లెంతమాత్రముగావు. ఇవి పెడర్థములేయని విను వారికి విశదమగుచునె యున్నది.

ఇట్లు కొంత గ్రంథము వాల్మీకి చేయనే లేదనియు మఱి కొంత ప్రక్షిప్తమనియు మఱికొంత యసంగ తార్థమనియు, మఱికొంత క్లిష్టార్థమనియు, వాల్మీకి చేసిన యాదికావ్యమును బీభత్సముసేయుక మొదలేయిది శివపురాణములవోలె మాకుఁ బ్రమాణము గాదనిననో యెంత బాగుండును? మీకథ యుండనిండు. ఇపుడిచట నారాధ్యులవారిని కుతుక పిసుకవలసియున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆరాధ్యులవారూ! మీరు శ్రీమద్రామాయణమునుబట్టి పరమేశ్వరు మహిమను నధికముగా గనఁబఱచినను శ్రీరామచంద్రుఁడు పరమేశ్వరుని కన్న నధికుఁడని యొప్పుకొనక తప్పదు.

పండి—మీరు చెప్పిన కారణమున నేగదా? అట్లొప్పవలయును? మీరు వాల్మీకికన్న నధికు లగుదురేని శ్రీరాముడు శివభక్తుడని వాల్మీకి చెప్పినదాని బోఁవిడిచి శివుఁడే రామభక్తుఁడను మీ సిద్ధాంతమును విశ్వసింతుము.

అన్నం—నా మాటను బట్టిగాదు. తగిన కారణములను బట్టియే.

పండి—ఉన్నచో నట్టికారణ మొక్కటి సెలవిండు.

అన్నం—అవధానముతో వినుడు. శ్రీరామచంద్రుఁడు శివునికన్న నధికుడు గాకున్నను శివుడు శ్రీరామ భక్తుడుగాకున్నను కేవలము తన పత్నియగు పార్వతికి రామతారకమేల యుపదేశించును? తన శివ మంత్రమునే యుపదేశించుకొనగూడదా? ఈయొక్క ప్రమాణమె శివుఁడు రామభక్తుఁడనుటకు పరమ సాధన మగును.

పండి—పరమేశ్వరుఁడు పార్వతీదేవికి రామతారకము నుపదేశించెనని దేనిని బట్టి విశ్వసింపవలయు.

అన్నం—అధ్యాత్మ రామాయణమునుబట్టి,

పండి—అధ్యాత్మ రామాయణము రచించిన వారెవ్వరు?

అన్నం—విశ్వామిత్రుఁడు.

పండి—ఇది నిజమనియే దలంచితిరా?

అన్నం—ఇదియననేమి?

పండి—విశ్వామిత్ర కర్తృత్వము.

అన్నం—ఇదియేల నిజముగాదు?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పండి—అధ్యాత్మరామాయణము ముద్రణమునకు వచ్చినప్పుడు ఈ గ్రంథము కర్తృనష్టముగానుండిన కతన నప్పటి పండితులు యోజించి యీ గ్రంథము విశ్వామిత్ర సృష్టిగా నడుమ నేర్పడియె నని గ్రహించి బుద్ధిమంతులీ రహస్యముగనిపెట్టుదురని భావించి యిది విశ్వామిత్ర కృతమని ప్రచురించిరి. అది మొదలుకొని తమవాదమునకు ననుకూల ముగానున్న కారణమున నిది నిజముగా విశ్వామిత్ర కృతమేయని కొందఱు విశ్వసించు చున్నారు. ఈరహస్యమును శ్రీకాళహస్తి నగర వాస్తవ్యులును తత్సమాస్థాన మహా పండితులునగు బ్రహ్మశ్రీ లక్ష్మినృసింహ శాస్త్రిలవారు సెలవిచ్చి యుండిరి. ఇట్లు వ్యాసప్రోక్త ముగాక విశ్వామిత్ర సృష్టిగా నేర్పడిన గ్రంథమునుబట్టి పరమేశ్వరుడు పార్వతీదేవికి రామతారకము నుపదేశించెననుట యెట్లు విశ్వాసార్హ మగును?

అన్నం—ఆరాధ్యులవారూ! మీవాదమంతయు విపరీతమే. అధ్యాత్మ రామాయణము విశ్వామిత్ర సృష్టిగా నేర్పడియెనని మీరు సాధించు కొనగలరా?

పండి—అట్లుగాక, ఇది యార్షమేయని మీరు సాధించుడు.

అన్నం—ఇది యార్షముగాదని మీరెట్లు సాధింతురు?

పండి—మహాభారతమును వేదవ్యాసుఁడు రచించెనని బహు గ్రంథ ములయందు గలదు. అట్లే శ్రీమద్రామాయణమును వాల్మీకి రచించినట్లును పెక్కుచోట్ల నుడువఁబడియున్నది. ఇట్లె యధ్యాత్మరామాణమును విశ్వామిత్రుడు రచించెనని ఆర్ష గ్రంథములలో నొక్కచోనైనను నుడువఁబడియుండలేదు. అం దానంజేసి యిది విశ్వామిత్రకృత మనుట విశ్వాసార్హము గాదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అన్నం—గ్రంథాంతరములందు బ్రస్తావింపఁబడిన మాత్రన విశ్వామిత్ర కృతము గాదననగునా ?

పండి—అంతమాత్రముననే గాక ఈ గ్రంథము పరస్పరవిరుద్ధముగా నున్న కతనను ఇది యార్ష మని యంగీకరింప నర్హముగాదు.

అన్నం—అది యెట్లు ?

పండి—శివుఁడు శ్రీరామమంత్రమును పార్వతికి బోధించినట్లును శ్రీరాముడు రావణుని వధించి తన్మూలమగు బ్రహ్మహత్య నివర్తింప శివలింగమును బ్రతిష్ఠించినట్లును నా గ్రంథమునందు గలదు. ఇది పరస్పరవిరుద్ధము. ఇదిగాక రామేశ్వరపదమునకు నర్థమేమని యింద్రాదులు మహావిష్ణు నడుగగా, రామస్యేశ్వరః= రామునకుఁ బ్రభువు శివుడని చెప్పెననియు శివుని నడుగగా రామః ఈశ్వరోయస్య నాకు రాముఁడే ప్రభువని చెప్పెననియు బ్రహ్మదేవుని నడుగగా రాముడు శివుడు నీ యిద్దఱును ప్రభువులే యని చెప్పెననియు నీ గ్రంథమున నున్నది. ఇంతకన్న విరుద్ధవాదము లెందును లేవు. రాముఁడె నాకు దేవుడని శివుఁడును శివుఁడె నాకు దేవుఁడని రాముడును చెప్పినట్లు లోకక్క గ్రంథముననె యుండుట వాఙ్మయమున నెందును లేదు, ఇట్టి విరుద్ధవాదము విష్ణుపురాణములయందుగాని, శివపురాణములయందుగాని, భారతమునగాని, భాగవతమునగాని, శ్రీమద్రామాయణమునగాని యెందును గనబడదు. ఇట్టి విరుద్ధ గ్రంథమార్ష మనినచో తత్కర్తయగు ఋషియైన యావ్యక్తతహాసావహము గాకుండదు. కావున నిది యార్ష మన నెంత మాత్రము జెల్లదు.

అన్నం—ఆర్షముగానిచో దీని నెవ్వరు రచించిరి ?

పండి—పురుషులలో నెవ్వరో రచించిరి. గాన నిది పౌరుషేయము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అన్నం—పౌరుషేయమైనచో నంగీకారార్హముగాదా?

పండి—పౌరుషేయమైనను పరస్పరవిరోధము లేకున్నను యుక్తి యుక్తముగానైన యున్నను నంగీకరింపనగును.

అన్నం—అధ్యాత్మరామాయణము యుక్తియుక్త మేల కాదు?

పండి—శివుడు పార్వతికి రామమంత్రము నుపదేశించె ననుట యుక్తి విరుద్ధము.

అన్నం—అది యెట్లు?

పండి—పరమేశ్వరుని పత్నియగు పార్వతి యే కాలమునాటిది? శ్రీరాము డేకాలమునాటివాఁడు? గ్రుడ్డు వచ్చి పిల్లను వెక్కిరించె ననునట్లు శ్రీరాము డవతరించుదనుక పార్వతీదేవి మంత్రోపదేశము నొందక యేయున్నదా? పార్వతీదేవి మాత్రమునె యెఱుంగక పరమేశ్వరు నుద్దేశించి తపమెట్లు చేసెను? దీనింబట్టి పార్వతీదేవి రామమంత్రము నుపదేశము నొందెననుట యుక్తియుక్తముగాదు.

అన్నం—ఆరాధ్యులవారూ! రామమంత్ర ప్రతిపాద్యుఁడు దశరథ రాముఁడేయని తలంచుచున్నారు గాబోలు? అట్లుగాదునుడీ?

పండి—రామమంత్ర ప్రతి పాద్యుఁడు దశరథరాముడుగాక మఱి యెవ్వరు? పరశు రాముడా? లేక, బలరాముఁడా?

అన్నం—శ్రీరామావతారమునకు మూలరూపమగు పరంబ్రహ్మము.

పండి—శ్రీరామావతారమునకు మూలమైనవాడు మహావిష్ణువు. ఆయనకు శ్రీరాముడను నామములేదు. ఆయనకు బ్రతిపాదకమైనది నారాయణాష్టాక్షరము, అట్లుండ రామమంత్రము మహావిష్ణు నెట్లు బోధించును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అన్నం... రామమంత్రమునకు ప్రతిపాద్యము విష్ణువని చెప్పితినా? అట్లుగాదు. విష్ణునకుగూడ మూలమైన పరబ్రహ్మతత్వమె రామ మంత్రప్రతిపాద్యము.

పండి... అటులేని సీతమ్మ దశరథరాముని పత్నియా? లేక మూల మైన పరబ్రహ్మము పత్నియా? లక్ష్మణుడు దశరథరాముని తమ్ముడా లేక పరబ్రహ్మము తమ్ముడా? వనవాసముచేసినది రావణుని బరి మార్చినది దశరథరాముడా? లేక పరబ్రహ్మతత్త్వమా? అధ్యాత్మ రామాయణమున దశరథరాముని చరిత్రము గన్పట్టుచుండ నది యంతయు పరబ్రహ్మము చరిత మనుట యెట్లు?

అన్నం... చరిత్రము దశరథరామునిదే. అయినను నారామునకు మూల మైనది బ్రహ్మతత్వమే గావున రామమంత్రమునకు బ్రతిపాద్యము బ్రహ్మతత్వమే యగును.

పండి—పరబ్రహ్మ తత్వము శ్రీరామునకు మాత్రమే మూలమగుగాని కడమ వారైన పరశు రామాదులకుగాని బ్రహ్మ విష్ణ్వాదులకుగాని మూలమెట్లుగాదు? అందఱకు మూలమైనచో దశరథరామ వాచక మగు రామ మంత్రమే పరబ్రహ్మ ప్రతిపాదక మగుగాని తక్కువ నవతారములకు వాచకములైన మంత్రములుగాని బ్రహ్మాది వాచకము లగు మంత్రములుగాని, దశరథరామునకును మూలమైన విష్ణువును దెల్పు నారాయణమంత్రముగాని పరబ్రహ్మ ప్రతిపాదకము గాదని గ్రహించి పరమేశ్వరుఁడు పార్వతికి రామమంత్రమునే యుపదేశింప వలసి వచ్చిన కారణమేమి?

అన్నం—మాకు హేతువాదములో పనిలేదు. అధ్యాత్మ రామా యణము ప్రమాణము. దానియందట్లు కలదుగాన మేమువిశ్వసింతుము.

పండి... మీరు బాగుగా విశ్వసించుడు. దానికి మాయభ్యంతరము లేదు గాని విమర్శించినచో నిది మాత్రము ప్రమాణ సమ్మతముగాదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అన్నం—అదియేల?

పండి—సర్వప్రమాణ విరుద్ధమైనందున,

అన్నం—అదియెట్లు?

పండి—వెనుక జెప్పిన విధమున పరమేశ్వరుఁడె సర్వాధికుఁడని సర్వవేద సిద్ధమైయుండగా నాపరమేశ్వరుఁడు తనకన్న రాముఁడధికుఁడని యెంచి తన భార్యకు రామమంత్రము నుపదేశించెనని యీగ్రంథమున నున్నది. గాన నిది సర్వవేద విరుద్ధము.

మఱియు, మహాభారతమునందు నాదివిష్ణువే, పరమేశ్వరు నుద్దేశించి పలుమారు ఘోరతపము నేసెనని చెప్పియుండగా నావిష్ణువవతారమైన శ్రీరాముని బరమేశ్వరుఁడె కొలిచెనని యిందు గలమగాన నీగ్రంథము మహాభారత విరుద్ధము.

ఇదిగాక, వాల్మీకి కృతమై శ్రుతిసమ్మతమైన శ్రీమద్రామాయణమునందు, శ్రీరాముఁడశ్వమేధముచే శివునారాధించి నట్లును, శ్లో॥ అత్రపూర్వం మహాదేవః ప్రసాద మకరోద్విభుః॥ అను వచనమును బట్టి శివానుగ్రహమును బొంది యున్నట్లును, నుండగా నీగ్రంథమునందు పరమేశ్వరుఁడు శ్రీరామునిఁ దనకంటె నధికునిగా భావించెనని యున్నదిగాన నీగ్రంథము శ్రీమద్రామాయణ విరుద్ధము.

మఱియు, శ్లో॥ నరకాన్త కయాస్యసి॥ అను శ్రీమద్రామాయణ వచనమునుబట్టి భృగుశాపవశమున సంభవించిన శ్రీవిష్ణుని దశావతారములలో నొక్కటి శ్రీరామావతారమని యుండగా నీశ్రీరాముడు కడమ యవతారముల కంటెను, త్రిమూర్తుల కంటెను కొనకు పరమేశ్వరునికంటెను నధికునిగా నీ గ్రంథమునఁ జెప్పఁబడియున్నది. గాన నీ యధ్యాత్మ రామాయణము శ్రీమద్రామాయణమునకు పరమ విరుద్ధము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇట్లు సర్వప్రమాణ విరుద్ధమగు నీ యధ్యాత్మ రామాయణ మునుబట్టి శివుఁడు పార్వతీదేవికి రామమంత్రము నుపదేశించె ననుట ప్రామాణికులకు విశ్వాసార్హముగాదు.

అన్నం...రామమంత్రము తారకమని ప్రసిద్ధికలదు. దానింబట్టియే పరమేశ్వరుఁడు పార్వతికి నీమంత్రము నుపదేశించెనని నమ్మదగి యున్నది.

పండి... రామమంత్రము తారకమని యెందుగలదు?

అన్నం...అధ్యాత్మ రామాయణమున గలదు.

ప్రతి... మృత ప్రాయమైన యాగ్రంథమునే తిరుగ నుదహరింపనేల?

అన్నం... అట్లని—కలిసంతరణోపనిషత్తునందు॥

హరేరామ హరేరామ రామరామ హరేహరే|

హరే కృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే॥

అని చెప్పఁ బడియున్నది. రామనామము తారకము గానిచో రామ కృష్ణాది నామములు స్మరింపఁదగినవని యుపనిషత్తునందేల చెప్పఁ బడును.

పండి... రామకృష్ణాది నామములు తారకము లైనచో శివుడు పార్వతికి కృష్ణతారకము నేలచెప్పలేదు. ఇదిగాక నీయుపనిషత్తు నందు॥ హరేరామ అని మొదలుగా జెప్పిన తరువాత

ఏతత్షోడశకం నామ్నాం కలికల్మషనాశనం॥ అని యున్నది. దానికి ఈ పదునారు నామములు కలికల్మషమును బోగొట్టునని యర్థము. దాననే యీయుపనిషత్తునకు కలిసంతరణోపనిషత్తు అనిపేరు

మహాపురుషుల నామస్మరణము కలికల్మష నాశకమనుట వింతకాదు. ఎట్లన,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ కార్కోటకస్యనాగస్య దమయంత్యానలస్యచ।

ఋతుపర్ణస్య రాజర్షేః కీర్తనం కలినాశనం॥

కర్కోటక నాగము దమయన్తి నలుడు రాజర్షియగు ఋతుపర్ణుఁడు ననువారిని గీర్తించునెడ కలి నశించునని యర్థము. కలినశించుననగా కలి కలుషము నశించు ననియె భావము.

తారకమను సంజ్ఞమైనన్నో మోక్షప్రదమైనదానికేగాని యింకొకదానికి సంభవింపదు. మోక్షమన సంసారమును దరించుట. సంసారమునుండి తరింపఁ జేయుదానికే తారకమని పేరు.

ఈసంజ్ఞ శివనామములకే చెల్లును. ఎట్లన

అవిముక్త జాబాలమను నుపనిషత్తునందు ॥

శ్రు॥ కింజప్యేనా మృతత్వం నోబ్రూహి॥ ఏనామములను జపము చేసినచో ముక్తిగలుగునో చెప్పుమని యాజ్ఞవల్క్య నుద్దేశించి బ్రహ్మచారులడుగగా యాజ్ఞవల్క్యుడు

శ్రు॥ శతరుద్రీ యేణేతి॥ శతరుద్రీయముననగా నమకమును జపింతురేని ముక్తి గలుగునని చెప్పి వేదమున నెన్నియో పన్నములుఁడ నీయొక శతరుద్రీయమును జపించిననే మోక్షము గలుగుననుట యెట్లనిశంకించి,

శ్రు॥ అమృతస్య హావా నామధేయాని॥ నమకమునందు భవాయచ రుద్రాయచ, అనిమొదలుగా వినఁబడినవి యమృతుని నామధేయములు అమృతుఁడనగా మృతిలేనివాఁడు మృత్యుంజయుఁడను ప్రసిద్ధ పరమేశ్వరునకేగాని యన్యులకు లేదు. ఈ నమకాధ్యాయములోనివి పరమేశ్వరుని నామధేయములు గాన వీనికి మోక్షప్రదత్వము కలదు, అనినుడివి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పరమేశ్వరుని నామధేయములె గాక ఇతర దేవతల నామధేయములు ముక్తిప్రదము లేలకానేరవు? అని శంకించి,

శ్రు॥ ఏతైర్వా అమృతో భవతి

మీరు అమృతత్వమెట్లు గలుగునని నన్నడిగితిరి. అమృతుని నామధేయముల నుచ్చరించిననే యమృతత్వము గలుగుగాని యితరుల నామములను స్మరింపగా నదియెట్లు లభించును. అమృతుడను నామము శివునకు దప్ప యన్యులకులేదు. అమృతుడనగా మృతిలేనివాడని యర్థము. ఇట్టిపరమేశ్వరుని నామముల స్మరించిననే యమృతత్వము—మృతిలేకపోవుట. అనగా మోక్షముగలుగు గాని యిది యితర నామములచే నెట్లు గలుగునని నుడువబడియెను.

ఇదిగాక నమకమునందు నమస్తారాయ అనుటచే తారకసంజ్ఞ శివనామములకే కలదని విశదీకరింపబడియెను, ఈ వాక్యమునుబట్టి తారమను పేరు శివునకే గలదనియు వ్యక్తమగుచున్నది. కావుననే అథర్వశిరమునందు మహేశ్వర మహాదేవాదినామములతోబాటు తారప్రణవాది పదములును శివవాచకములని నిర్వచనము సేయబడియెను. ప్రణవము శివవాచకమని లోగడ నిరూపింపబడియెను. తారకమను సంజ్ఞ ప్రణవమునకు గలదని కొన్నిచోట్ల నున్నను తారకప్రణవాది పదములు పరమేశ్వర వాచకములని యుపనిషత్తులందు స్పష్టీకరింపబడి యుండుటచే తారకసంజ్ఞ శివునకు నిర్వివాదమైనది. ఇట్లు తారకసంజ్ఞ శివునకు నున్నట్లు ప్రమాణసిద్ధమగుటచే శివనామములకే తారకమను పేరు న్యాయ్యమని యేర్పడుచున్నది. ఇట్టి సర్వప్రమాణసిద్ధమగు పరమసిద్ధాంతము నాదరింపక నిరాధారముగా రామనామమునకే తారకసంజ్ఞ కలదని మీరంగీకరించినమాత్రన బహుప్రమాణ సమ్మతమగుటచే ప్రబలమైన శైవసిద్ధాంతమునకు గొరంత యేనంతయు నుండదు.

అన్నం...ఆరాధ్యులవారూ! మీరు చెప్పిన యీ యుపన్యాసమును

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బట్టి శివనామమునకు తారకమని సంజ్ఞకలదని తేలుచున్నదిగాని
రామ నామము తారకము గాదని తేలుట లేదు. ఇఁక నీయుపన్యాస
మంతయు దేనికి?

పండి...మీ సిద్ధాంతమును సాంతము సేయనే.

అన్నం...రామనామము తారకముఁ గాదని తేలనప్పుడు మా సిద్ధాం
తెట్లు సాంతమగును?

పండి... మీరు రామనామము తారకమనుటకు శ్రుతి ప్రమాణమ
నొక్కదాని నైన గనఁబరుపఁజాలరైతిరి. శివనామమే తారకమనుట
కెక్కు శ్రుతిప్రమాణములు మాచే నిందు నుదహరింపఁ బడియెగదా
దీనింబట్టి రామనామము తారకమనుట శ్రుతి విరుద్ధమని తేర్ప
లేదా? ఇంకేమిగావలయు?

అన్నం...రామనామమహిమము మీకేమి తెలియును?

శ్లో॥ సహస్రనామతత్తుల్యం రామనామవరాననే ॥

రామనామము సహస్రనామతుల్యమని శివుడు జెప్పెనుగదా

పండి...అట్లుచెప్పెనని యెందున్నది?

అన్నం...అధ్యాత్మరామాయణమునందు

ప్రతి...ఈయధ్యాత్మరామాయణముకన్న మీకు వేరొకగతియే లేద
ఇది సర్వవిరుద్ధమని పలుమారు ఖండించినను దీనినేయుదాహరింపనే

అన్నం...అట్లేని నది యుండనిండు. రామనామము తారకమనుట
నింకొక గొప్పకారణము దెలిపెదను వినుడు.

పండి...బాగుగ వినిమెద సెలవిండు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అన్నం—ఆచార్యులవారూ! ఇటు చూడుడు.

ప్రతి—మీపంకనే చూచుచుందును. చెప్పుడు.

అన్నం—నారాయణాష్టాక్షరములోని 'రా' అను వర్ణమును శైవపంచాక్షరములోని "మ" అను వర్ణమును గూడి "రామ" అను నామమేర్పడియెను. ఇట్లు రెండును చేరుటచే రామనామము శివకేశవుల నామములకంటె నధికమని తెలియుచున్నది.

నమో నారాయణాయ-అను మంత్రమున 'రా' అను నక్షరము తీసివేయుచో 'నాయనాయ' అని యగును. అప్పుడు ఈ మంత్రము 'అయనాయ=మోక్షము కొఱకు, న=ఉపయోగింపదని యర్థమగును.

నమశ్శివాయ, అను శైవమంత్రమున 'మ' అను నక్కరము తీసివేయునెడ 'నశివాయ' అని యగును. అప్పుడీమంత్రము 'శివాయ= మంగళముకొఱకు 'న= ఉపయోగింపదని యర్థమగును.

దీనింబట్టి నారాయణ మంత్రమున రా అను నక్షరంబును, శివమంత్రమునందు మ అను నక్కరంబును ముఖ్యములైనవని తెలియుచున్నది.

ఇట్లు శివవిష్ణు మంత్రములలో ముఖ్యములైన యక్షరములచే నేర్పడినదిగాన రామమంత్రము శైవవైష్ణవ మంత్రములకన్న నధికమనియు, దానంజేసి యిదియె తారకమనియు ధ్రువమగుచున్నది.

ప్రతి—ఆరాధ్యులవారూ! దీనికి దగిన సమాధానము సెలవిండు.

వండి—ఆచార్యులవారూ! భట్టాచార్యులవారు చెప్పిన యంశము మీరంగీకరింతురా?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రతి—రామమంత్రము గొప్పదియనుట నంగీకరింతుము. ఇంతియగాని నారాయణ మంత్రముకన్న రామమంత్ర మధికమనుట నెట్లంగీకరింతుము? నారాయణ మంత్రము మూలవిష్ణువును బోధించును. రామ మంత్రమైననో ఆదివిష్ణు నవతారమైన దశరధరాముని బోధించును. మూలరూపమునకు నవతారమునకుగల యంతరమీ రెండుమంత్రములకు న్యాయసిద్ధము. ఇట్లుండ నారాయణ మంత్రము కన్న రామమంత్ర మధికమనుటయెట్లు ప్రమాణ సమ్మతమగును? ఇది గాక, నారాయణ మంత్రములోని రా అనునది, యింకొక మంత్రము లోని మ అనునది చేరి రామమంత్రమయ్యెననుట చమత్కార కరమైన కల్పనా కథగాని యీరెండు మంత్రములలోని రెండక్షరములు గూడి రామమంత్ర మయ్యెననుట విశ్వాసార్హముగాదు.

అన్నం—ఆచార్యులవారూ! విశ్వాసార్హమేల కాదు? రామమంత్రము ప్రేమపాత్రమెగాని దానియందు శైవపంచాక్షరములోని మకారము వచ్చి కలసినదనగానే ఆయక్షరము మీగొంతుపట్టుకొని నందున మీకు విశ్వాసార్హముకాదయ్యె కాబోలు? దాననేకదా శివపంచాక్షర ములోని మని యననొల్లక యింకొక మంత్రములోనియని పలికితిరి.

ప్రతి... మీకుఁ దగిన సమాధానము నారాధ్యులవారే చెప్పుదురు. నాకేమి?

పండి—భట్టాచార్యులవారూ! శైవవైష్ణవ మంత్రములలోని యక్షరము లుచేరి రామమంత్రమయ్యెననుట కవికల్పనముగాక నిజమేయని మీకు నమ్మకము గలదా?

అన్నం— ఇందుమాకు నమ్మకము లేకేమి? గాని మీకు నమ్మకము గలుగమికి కారణము గలదు.

పండి... ఏమది?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

న్నం... ఇది నమ్మినచో మీ మీ మంత్రములకు ప్రాశస్త్యము గ్గునని.

ండి...మీరుచెప్పినది ధ్రువపరచు కుందు రేని మీ రామమంత్రమునే మును గ్రహింతుము, ఇఁక మా మంత్రములకుఁ బ్రాశస్త్యము తగ్గిన మి?

న్నం—అట్లేని తప్పక ధ్రువపరుతును.

ండి—నారాయణ మంత్రములోని రా అనునది శైవమంత్రములోని అనునది యీ రెండువర్ణంబులును వానియంతన నవియె కూడెనా? క వాని రెంటిని నెవరైనఁ గూర్చిరా?

న్నం—ఎట్లయిననేమి?

ండి—ఈ రెండును నసంభవములే.

న్నం—అది యెట్లు?

ండి—అక్షరము లచేతనములుగాన నవి వాని యంతనగూడవు.

న్నం—వాని నెవరైనఁ గూర్పఁగూడదా?

ండి—బాగుగా గూర్పవచ్చుగాని యొల్లెవఁడైన నక్కరములనుగూర్చి మ అని నామకరణము గావించియున్నచో నట్లు రామునకు నామ ణము గావించినవాఁడే రామునికన్న నధికుఁడగును.

లోకమున నెవనికైన నామకరణము గావించునపుడు వెంకటే రుని పేరు, రామునిపేరు, కృష్ణునిపేరు చేర్చి వెంకటరామకృష్ణయ్య పేరుపెట్టుట సంభవించును. గాని యంతమాత్రమున నీతడు వెంకట మకృష్ణులకన్న నధికుఁడు గాజాలడు. వీని పేరొక్కొక మహానీయుని రుకన్న చదువుటకుఁ బెద్దదేమైనను వెంకట రామ కృష్ణులను నామ లకన్న నధికఫలప్రదము గాజాలదు. అదిగాక, రామ కృష్ణాది

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పదము లాయా సుహాసీయుల జెప్పునపుడు సార్థకములగుగాని వాని వ
గొన్నిటి జేర్చి యన్యులకు బేరుపెట్టినప్పుడు సంజ్ఞావాచకములై యుగ
గాని యన్వర్థము లెన్నటికి గానేరవు. అట్లై శైవ వైష్ణవ మంత్రములలోని
యక్షరముల నొక్కొకదానింగూర్చి వేరొకనికి నామకరణము జేసిన
తన నీ నామధారి శివవిష్ణులకన్న నధికుఁడనిగాని యీ నామము శి
విష్ణు నామములకన్న నధిక ఫలప్రదమనిగాని నుడువజెల్లదు. మఱియు
నారాయణ అను వర్ణ సముదాయమునకు నర్థము కలదుగాని దానియం
దున్న రా అను వర్ణమునకు నర్థమే లేదు. అట్లే నమఃపదములోని
మకారంబును నిరర్థకమే. ఇట్లు నిరర్థకములైన యక్షరముల జేర్చిన
తన దీనికి మహార్థ మెట్లు సంభవించును? ఎట్లును సంభవింపదు.

ఇదిగాక, లోక వేదములందు గల పదములు వ్యుత్పన్నములుగనో
లేక అవ్యుత్పన్నములుగనో వాని యంతన సహజసిద్ధములై నిత్యము
గానున్నవి. ఇట్లుండ శైవవైష్ణవమంత్రములలోని రెండక్షరముల
చేరి రామమంత్రమయ్యెననుట యెట్లు? ఈ సిద్ధాంతము నంగీకరించు
శైవ వైష్ణవమంత్రము లనాదిసిద్ధములనియు రామమంత్రము నడుమ
నేర్పడిన కృత్రిమమంత్రమనియు తేలునుగదా? ఎట్లైన తేలనిండు. ఈపద్ధ
నేల యంగీకరింపగూడదనిన, యుక్తాయుక్తముగానందున నంగీకరి
గూడదు.

అన్నం— ఇది యేల యుక్తాయుక్తము గాదు?

పండి— నారాయణమంత్రములోని రా అను నక్షరమును దీసికొని
వాడు శివమంత్రములోని శికారమునో లేక వకారమునో తీసికొన
లయుగాని మకారము దీసికొనుట యుచితముగాదు. ఏలన-
మంత్రములోని మకారము నమఃపదములోనిదిగాని, దేవతావాచకప
లోనిది గానేరదు.

ఆదిగాక, నారాయణమంత్రములోని రా అనునది తీసికొని
ప్పుడు మకారమందు లేనియెడ గదా శివమంత్రములో వెదకికొ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వలయు. నమో నారాయణాయ అనుదానిలో మకారముగూడ యుండి నప్పుడు దానినే యేల తీసికొనగూడదు.

ఇదిగాక, నమః అను పదము సకలమంత్రములలో నుండుగాన నీ మకారము కడమ మంత్రములలోనిదిగా దన నేమి ప్రమాణము కలదు?

మఱియు, ఈ రెండక్షరములు శివ విష్ణు మంత్రములలోనివే గాని రాక్షస క్షామదేవతల మంత్రములలోనివి గావని యెట్లు నిర్ణయింపనగును?

అట్లుగాక, అభ్యుపేత్యవాదమున నీరెండక్షరములు శివవిష్ణు మంత్రములలోనివే యని యొప్పినను నీ సిద్ధాంతమునుబట్టి రావణనామము దీనికన్న నెక్కుడని యొప్పక తప్పదు. ఎట్లన-

రామనామమునందు నారాయణమంత్రములోని రా అను నక్షరమొక్కటియే చేరెనుగాని రావణనామమునందు నారాయణనామములోని రా ణ అను రెండక్షరములు చేరియున్నవి. మఱియు, రామనామమునందు శివమంత్రములోనిదగు నమఃపదములోని నిరర్థకమగు మకారము చేరియున్నదిగాని రావణనామమున నైననో అట్టి మకారముకన్న శ్రేయమైనదియు, నమృతబీజమైనదియు, శివనామములోనిదియు నగు వకారము చేరియున్నది. మీరుచెప్పిన మార్గమునిజమని గ్రహించునెడ రావణనామమే యత్యుత్తమము గాకమానదు.

రామనామమునందు సహజముగా గల యుత్కర్షము మాకు పరమ సమ్మతమే. అయినను మీ రానామము దగు నుత్కర్షము సాధింప నంగీకరించిన పద్ధతి యనుచితమని తెల్లముసేయనే రావణాది నామము లుదాహరింపఁబడియెను. మీరు యథార్థపద్ధతి నవలంబించి శ్రీరామునందు గల సత్వగుణాతిశయము ధర్మవిగ్రహత్వము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మున్న గునుత్తమగుణములనుబట్టి యమ్మహనీయునామము పరమపావన
మని బలుకుచో నీ నిర్ణయమును శిరసావహింపని వారుండరు.

అట్లుగాక శివకేశవులకంటెను నీ మహాపురుషుని నధికునిగా
సాధించు కుతుకంబున మీరు కల్పించిన యీ కల్పన మమ్మహనీయు
యుత్కర్షసాధనమునకుఁ బనికిరాకపోగా నికర్షమునకే యుపయోగింప
డినని తెలుపక తప్పినదిగాదు.

అన్నం—అట్లని శ్రీశంకరాచార్యాదులు రామనామము శివకేశవమం
ములలోని యక్షరములతో గూడిన దని యేల చెప్పిరి ?

పండి—రామనామమును బ్రశంసింప నీ యుల్లేఖమును చెప్పిరి. గా
యీ నామ మీ రెండక్షరములచేతనే కల్పితమని వారి యాశయ
గాదు.

అన్నం...రామనామము శివవిష్ణుమంత్రములలోని యక్షరములచేత
యేర్పడియె ననుటకుఁ బెద్దకారణము గలదు. అది యెద్దియనిన వినుడు

హరిహరు లిద్దరును జేరి రామావతారము నొందినట్లు గొన్ని
ప్రమాణములయందు గలదు. దానిఁబట్టి రామనామము హరిహర
మంత్రములలోని యక్షరములచేతనే యేర్పడియెననుట సమ్మత
యున్నది.

పం—కల్పవిశేషములయందు రామావతారములు కొన్ని
రుద్రాంశములుగను కొన్ని శక్త్యంశములు గను, మఱికొన్ని
నారాయణాంశములుగను, సంభవించినట్లు ప్రమాణముల య
దుగలదు. ఇంతియగాని యొకప్పుడే హరి హరులయిద్దఱ యం
ములచే రామావతారము గల్గినట్లు ప్రామాణికగ్రంథములయందు
నెందునులేదు. ఇట్లుండ రామనామము హరిహరుల మంత్రగతాక్ష
ములచే నిర్మితమని యెట్లు గ్రహింపనగును?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అన్నం—కొన్ని సంహితలయందు రామ రహస్యాద్యుపనిషత్తులందును నొకప్పుడే రామావతారము హరి హరుల యంశములచే నేర్పడినట్లు చెప్పఁబడి యున్నది.

పండి—ఆసంహితలు నా యుపనిషత్తులును నధ్యాత్మ రామాయణము కోలె విశ్వామిత్ర సృష్టిలోని వేయని నమ్మవలయు.

అన్నం—ఏ కారణమున?

పండి...స్మార్త సంఘమునకు దేవుని సాధింప నేర్పడినవిగాన.

అన్నం...స్మార్తసంఘమునకు క్రొత్తగ దేవునినేల యేర్పరుప వలసి వచ్చెను.

పండి...అద్వైత మూలాచార్యులవారు శైవ వైష్ణవాది సంఘములలో గొందఱను జయించి స్వమతమున జేర్చిన పదంపడి యా సంఘమునకు బూజనీయమగు దేవతను నిర్ణయింప నెంచి శివవిష్ణ్వాదుల న్నిన్న నితర దేవత యప్రసిద్ధమగుటను, శివవిష్ణ్వాదులొక్కొక మత దేవతలుగా నున్నకతన సర్వమత సముదాయమునకు వీరిలో నేదొక్క దేవతను బూజింపుమన్నను నందు పలువుర కసమ్మతమగునని యోజించి సర్వమత దేవతలైన శివవిష్ణ్వాదుల నొక్కచోఁజేర్చి పూజింపుడని పంచాయతనము నేర్పరచిరి.

అట్టులేర్పరచియు, స్మార్తమునకు నుపాస్యమగు దేవతయేది? అని ప్రశ్నవచ్చినప్పుడు అయిదుగురు దేవతలు నుపాస్యులని యుత్తరము చెప్పుట సరిగా నుండలేదనియెంచి ప్రశ్నోత్తర మాలికయందు 'కో దేవః' దేవుఁడెవరు అను ప్రశ్నమునకు హరిహర రూపుడొక్కడె దేవుఁడని యుత్తరము చెప్పియుండిరి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అంతకన్న నేమి చెప్పవలయు? హరి యొక్కడే దేవుడనినచో శైవమతమునుండి వచ్చి కలసినవారు మెచ్చరు. హరుడొక్కడే దేవుడనినచో వైష్ణవ సంఘమునుండి వచ్చి కలసినవారు వప్పుకొనరు. అంతయు నొక్కటేయని యద్వైతమును సిద్ధాంతముసేసి దేవు లెదుగురని బదులు సెప్పనెడ నగుబాటగును. కాబట్టి యీ యేగురలో ప్రధానదేవత లిద్దఱిని గ్రహించి యిద్దఱు దేవత లుపాస్యులన్నను సంతృప్తి కరముగాదని యెంచి వారిద్దఱ నొక్కటిచే శంకరనారాయణ రూపుడొక్కడే దేవుడని బదులు చెప్పెను.

అన్నం...హరి హరుల నిద్దఱ నొక్కటి చేసినిది మా యాచార్యులవారేయగునా?

ప్రతి- పౌరోహిత్యము మొదటినుండి మీకుగులవృత్తియేగాన మీయాచార్యులవారు హరిహరులయిద్దఱకు బ్రహ్మ ముడులుపెట్టిరి కావలయు.

అన్నం...అట్లుగాదు అంతకు మున్నె హరిహరులిద్దఱు నొక్కటిగా యున్నారు.

పండి...అంతకు మున్ననగా, నారాయణమూర్తి మోహినీరూపము నొందినప్పు డనియేకదా మీయాశయము.

అన్నం—ఆచార్యులవారూ! వీరేమనుచున్నారో వినుచుంటిరిగదా?

ప్రతి—ఈయుల్లికుట్టి మాటలతోనేమి? తొలుత మీ సిద్ధాంతము నిలుపుకొనుడు. తరువాత సంగతి చూతము.

అన్నం—మాయాచార్యులవారు హరిహర రూపుడొక్కడె దేవుడని చెప్పినమాట నిజమే, అట్లుచెప్పిన నేమి?

పండి—హరిహరరూపు నొక్కని సాధింపనే శ్రీరాము నట్టివాని వివరింపవలసివచ్చెను. ఏలన హరిహరరూపు డొక్కడని మాట నను హరిహరులిద్ద ఱనుట సుప్రసిద్ధముగాన నా మాట విరుద్ధము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దోపకమానదు. దానంజేసి హరిహరాత్మకు నొక్కని నేర్పరుపవలసి యుండెను. అప్పని దీర్పనే శ్రీరాముఁడు హరిహరుల యిద్దఱి యవతారమనియు శివవిష్ణుమంత్రములలోని యక్షరములుచేరి రామనామ మేర్పడియెననియు వచించుచు నీయర్థమును నిలుపుకొననే వీరిచే నెన్నో సంహితలు అధ్యాత్మరామాయణాదీతిహాసములు రామరహస్యోపనిషత్తులు విశ్వామిత్రసృష్టిగా సంఘటింపఁబడియెను.

శైవులు శ్రు॥శివమద్వైతంచతుర్థంమన్యన్తే” శ్రు“బ్రహ్మావిష్ణురుద్రేంద్రాస్సంప్రమాయన్తే” ఈ మొదలగు శ్రుతిప్రమాణములనుబట్టి మూర్తిత్రయాతీతమై త్రిమూర్తి కారణమైనశివతత్త్వమె పరబ్రహ్మమని నిర్ణయించి యదియె యుపాస్యమని గ్రహించిరి.

వైష్ణవులైననో శ్రు॥ నారాయణాద్బ్రహ్మజాయతే నారాయణాద్రుద్రోజాయతే” ఈ మొదలగు శ్రుతిప్రమాణములనుబట్టి మూర్తిత్రయాన్తర్భూతమై ద్విమూర్తి కారణమైన విష్ణుతత్త్వమే పరబ్రహ్మమని నిర్ణయించి యదియె యుపాస్యమని గ్రహించిరి.

మీరైననో శివ విష్ణ్వాదులలో నొక్కని నుపాస్యముగా నంగీకరించునెడ శైవాది మతములలోననె చేరునని యెంచి శ్రీరామునినే పరబ్రహ్మముగా నంగీకరించితిరి.

శైవులు విష్ణుని శివభక్తునిగాను వైష్ణవులు శివుని విష్ణుభక్తునిగాను నెంచుదానికి బదులుగా శివుని రామభక్తునిగా బ్రకటించితిరి. దానింబట్టి శివమత విష్ణుమతములవోలె మీది రామమతమని తెల్లమయ్యెను.

శ్రోత్రి—ఆరాధ్యులవారూ! వీరి సిద్ధాంతమున చీమదోమయు పరబ్రహ్మమే. అట్టియెడ వీరు రామచంద్ర పరబ్రహ్మణేనమః అనుచు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రీరాముని పరబ్రహ్మముగా నెంచిన మాత్రన యామ్మహనీయునకు
వచ్చిన యతిశయ మేమి?

పండి—వీరు శ్రీరాముని నంతరిక్షమునకు గొనిపోయినది యా యక్షు
ఘుని మహిమాతిశయమును నిలువనేయని యెంచుచుంటిరా? అట్లు
కాదు. దేని కనిన, శివుడు రామతారకము నుపదేశించెనని చెప్పినట్టి
శివమహిమమును గ్రుంగజేయనే, శివ మహిమ యొక్కని యత్నమున
గ్రుంగునది కాదు. యథేచ్ఛముగా శివమహిమమును నణప యత్నిక
తురుగాక. శ్రీరాముని నున్నత స్థానమున నుండనిచ్చినను నదియొ
మేలెగదా?

అన్నం—అట్లుండనీయక మేమేమి చేసితిమి?

ప్రతి—దిగువకుఁ బడద్రోసితిరి.

అన్నం—ఎట్లు?

ప్రతి—రావణవధ మూలమగు బ్రహ్మహత్యవారించుకొన నెంచి శ్రీరా
ముడు శివలింగ ప్రతిష్ఠ చేసెననియుఁ జెప్పితిరి గదా? శ్రీరా
చంద్రు గౌరవము నేమి నిలిపితిరి? దీనింబట్టి మీకల్పనా కథల
నర్థము లేదని తెలియుచున్నది.

అన్నం—భేదవాదముల యెడ నభిమానము వహించి ఇట్లు మీ రెల్లపు
కొట్టుకొనుచుండుడు. అభేద వాదులమగు మాకు నీయభిమానము లేదు
గాన శివుడు రాముని గొల్చినను, రాముడు శివుని గెల్చినను, మా
కెట్టి బాధకంబును లేదు.

ప్రతి—కావుననే మీవాదమంతయు నద్వైతముగానే యున్నది.

అన్నం—అట్లుండుట మాకు నలంకారమే.

ఇప్పుడు మధ్యాహ్నమయ్యెనుగాన చర్చముగింతము.

షష్ఠాహ్నికము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# భూమిక.

ఉపమన్యుమహాముని వ్యాఘ్రపాదుని కుమారుఁడు. వసిష్ఠ మహామునికి మేనల్లుఁడునగును. ఈ మునీంద్రుఁడు శైశవమునందు మేనమామయింట కామధేనువు పాలుఁద్రావుచుండెను. ఆయభ్యాసవశంబున తండ్రియింటికిఁ బోయిన పదంపడియు పాలకై మొఱవెట్టుచుండెను. అప్పుడు క్షీరము లలభ్యములగుటంజేసి యా యనఘునితల్లి శోకిల్లియు, క్కేమియునదిలేక బియ్యపుపిండి నీరునందు గలిపి యిచ్చెనట. పాలవలె తెల్లనగు నాసీరముం గాంచి యా మునిసూనుఁడవిదుగ్ధములేయని వానిం ద్రావఁబోయి యందు మాధుర్యము లేమింజేసి యవి క్షీరములు గావని గ్రహించి యా నీరపాత్రము దొరలించి యేడ్చుచుండ నమ్ముని మాత వగచి నిజతనయు నోదార్చుచు, కుమారా! మనము తొలిజన్మమున శివునిఁ బూజింపమైతిమి. అట్టి మనకు క్షీరము లెట్లులభించును. అవి మనకు నలభ్యములుగాన వానిం గోరకుమని బోధించెను. ఆమ్మాట వినగనే మహర్షినందనుఁడు 'తల్లీ! శివునిబూజించునెడ పాలు దొరకునా? అని యడిగెను. నావుకు నిస్సంశయముగా దొరకునని పలికెను. ఆ మునితనయుండు బహుజన్మసంచిత సుకృత పరిపాకముతుండుగాన తల్లిమాట వినగనె యందు దృఢవిశ్వాసంబు నొందెను. సమయంబునకై వేచి జనని జలంబునకై పోవ నత్తఱి యిల్లువెడలి పోవుచుండెను. వ్యాఘ్రపాదు నాశ్రమము చిదంబరక్షేత్ర సమీపమున నె కలదు. దానికి చేరువనె శ్రీ వేదారణ్యక్షేత్రంబు గలదు. అందు వేదములు వృక్షరూపములుగా నున్నవని స్కాందము తెలుపుచున్నది. ఆ మునికుమారుఁ డా క్షేత్రమను జేరి నలుదిశలు పరికించెను. అందు నెటజూచినను శివలింగములు, జలపూరితంబులగు తటాకంబులు, ఫలపుష్ప శోభితంబులగు వృక్షంబులు మొదలుగా గన్పట్టెను. ఈ క్షేత్రము శివునిబూజింప ననుకూలమని యెంచి యా యనఘుండందుగల మహాలింగమును నిర్మలజలములచే నభిషేకించుచు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పత్రపుష్పాదులచే బూజించుచును నిట్లుతదేకాయత్తచిత్తుండై శివారా
నంబు సేయుచుండ గొంతకాలమునకు భవానీవల్లభుండు మునిసూ
నెడ సుప్రసన్నుండయ్యు నా దృఢచిత్తుc బరీక్షింపనెంచి మహేం
రూపంబున నేతెంచి వరము గోరుమనుటయు నతండు 'నీవెవ్వరవ
తెల్పుమని యడుగ నద్దేవుండు నేను దేవేంద్రుడనని తెలుప
మునిపుత్రుc డద్దేవు నుద్దేశించి యేను శివునిదప్ప నింకొక్కని వరం
వేడను. నిన్నెవరు బిలిచిరి? నీదారింబొమ్మనియెను. అప్పు డుప
న్యునకు నింద్రరూపుడగు పరమేశ్వరునకును జరిగిన సంవాదము మ
భారతమున నానుశాసనిక పర్వమునందు నెంతో యధికముగ వర్ణిం
బడియున్నది. కొనకు నీకు వరమునీకుండ నేను బోనేరనని యింద్రుడ
వలుకగా నమ్మునిసూనుండు మహేంద్రు నవలోకించి నీవు నా తపం
భంగంబు సేయ నేతెంచితివిగాన శపింతునని నుడువ నాలించి పరమే
రుం డమ్మునికుమారు నెడ పరమహర్షంబు నొంది నిజరూపంబుదా
నేను పరమేశ్వరుడను. నిన్ను బరీక్షింప నింద్రరూపంబు దాల్చి
నీయెడ మెచ్చితి- వరంబు వేడుమనిన నతండు ప్రహర్షపరవశుం
స్తుతించి నాకు క్షీరము నిమ్మని యడిగెను. అంత నుమాకాంతుడ
యనఘునకు పాలసముద్రంబు నొసగెనని యీచరిత్రమంతయుం ద
శిష్యుడగు శ్రీ కృష్ణునకు నుపమన్యుండు తెలిపినట్లు మహాభారత
ననె కలదు. దీనింబట్టి యుపమన్యు మునీంద్రుండు శ్రీకృష్ణునకు దీక్ష
గురువని తెలియుచున్నది. ఈ మహాత్ముడు గావించిన శివస్తుతి చ
త్కారార్థబంధురముగా నున్నకతన దీని నిట ప్రచురించితి. మహా
లీ స్తోత్రంబును పఠించుచు పరమేశ్వరు ననుగ్రహంబున భోగమోక్ష
బులు వడయుదురుగాక.

ఇట్లు, వ॥ సం॥

——(o)——

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రీ శివాభ్యాంనమః

# ఉపమన్యుకృత పరమేశ్వరస్తవః

॥ జయశంకరపార్వతీపతే మృడశంభో శశిఖండమండన ।
మదనాంతక భక్తవత్సల ప్రియకైలాస దయాసుధాంబుధే ॥ ౧

తా॥ ఓ శంకరా ! ఓ పార్వతీపతీ ! శంభూ ! చంద్రఖండశిఖా
ణీ ! మదనాంతకా ! భక్తవత్సలా ! కైలాసవాసా ! కరుణామృత
గరా ! జయింపుము.

॥ సనుపాయ కథాస్వపండితో హృదయే దుఃఖశరేణఖండితః ।
శశిఖండశిఖండమండనం శరణంయామి శరణ్యమీశ్వరం ॥ ౨

తా॥ దుఃఖశరంబుచే హృదయంబున ఖండితుండనై సుఖో
యంబు నెఱుంగని యేను శశిఖండమండనుండగు పరమేశ్వరుని
రణు జొచ్చితి.

॥ మహతః పరతః ప్రసర్పత స్తమసో దర్శనభేదినోభిదే ।
దిననాథ ఇవ స్వతేజసా హృదయవ్యోమ్ని మనాగుదేహినః ॥ 3

తా॥ పరమేశ్వరా ! అపారమై యంతటను గ్రమ్ముచు దృష్టికి
ష్టికరమైన యజ్ఞానాంధకారమును భేదింప ప్రభాకరుని మాడ్కి నిజ
జంబుతో నాదు చిత్తాకాశంబున నుదయింపుము.

॥ నవయంతవ చర్మచక్షుసా పదవీమప్యుపవీక్షితుంక్షమాః ।
కృపయాఽభయదేన చక్షుసా సకలేనేశవిలోకయాశునః ॥ ౪

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా॥ స్వామీ ! మేము చర్మచక్షువుతో నీ యున్నతావు గనంజాలము. కావున నీవ శీఘ్రముగ నభయప్రదమగు కటాక్షమున మమ్ము విలోకింపుము.

శ్లో॥ త్వదనుస్మృతి రేవ పావనీ స్తుతియుక్తానహివక్తుమీశసా ।
మధురంహిపయస్స్వభావతో ననుకీదృక్సితశర్కరాన్వితం ॥

తా॥ అమృతమయూఖశేఖరా ! నీయనుచింతనమే పావనమైనది. ఇంకనది స్తోత్రయుక్తమైనచో నద్దాని నేమని వర్ణింపవలయు. ఎట్లనిన క్షీరంబులు స్వభావంబుననె మధురంబులు. ఇక వానియం జీని చక్కెరం జేర్పునెడ నవి యెట్లుండును ?

శ్లో॥ సవిషోప్యమృతాయతే భవాం ఛవముండాభరణోపి పావనః ।
భవఏవ భవాంతకస్సతాం సమదృష్టిర్విషమేక్షణోపిసర్ ॥

తా॥ దేవా ! నీవు విషము గలిగియున్నను నమృతమై యున్నాడవు. తలపుఱ్ఱెలం దొడవులుగా దాల్చియు పావనుఁడ యుంటివి. మఱియు భవుఁడవయ్యు సజ్జనుల భవము గూల్చువా డవు. విషమలోచనుఁడవయ్యు నెల్లరయందు సమదృష్టి గలిగియుంటి

శ్లో॥ అపిశూలధరో నిరామయో దృఢవైరాగ్యరతోపి రాగవాా।
అపిభైక్ష్యచరో మహేశ్వర శ్చరితం చిత్ర మిదంహి తేప్రభో ॥

తా॥ ఈశ్వరా ! శూలధరుఁడవయ్యు నారోగ్యయుతుండ (శూలమనగా త్రిశూలము. దీనికి శూలరోగ మని యర్థాంతర శూలరోగము గల వాఁడు వ్యాధిరహితుఁడనుట విరోధము.) దృఢ మగు వైరాగ్యము గలిగియు రాగవంతుఁడవు. కాముని జంపి గామిని నర్ధాంగమున దాల్చితివనుట.) మఱియు భిక్షావృత్తి జరి వాఁడవయ్యు మహేశ్వరుఁడవు, ప్రభూ ! నీ చరిత్ర మతిచిత్రము నున్నదిగదా ?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ వితరత్యభివాంఛితం దృశా పరిదృష్టః కిలకల్పపాదపః ।
హృదయే స్మృతఏవ ధీమతే నమతేఽభీష్టఫలప్రదోభవాన్ ॥ ౮

తా॥ కల్పవృక్షము తన్నుగంటితోఁ జూచిన వానికే కోర్కెల నొసగుచున్నది. ఇఁక నీవైననో నిన్ను దన డెందమున దలంచి నమస్కరించు బుద్ధిమంతునకు నభీష్టఫలము నొసఁగుచున్నాఁడవు. గాన కల్పవృక్షము నిన్నెట్లు పోలును ?

శ్లో॥ సహసైవ భుజంగపాశవా న్వినిగృహ్ణాతినయావదంతకః ।
అభయం కురు తావదాశుమే గతజీవస్య పునఃకి మౌషధైః ॥ ౯

తా॥ అంతకాంతకా ! అంతకుఁడు వచ్చి నన్ను నాగపాశముతో గట్టి నంతకుమున్న నీవు వచ్చి నాకు నభయంబొసంగుము. ఇంత తొందర యేమందువేని నూపిరి పోయిన వెనుక నౌషధంబులతో నేమి కార్యము?

శ్లో॥ సవిషైరివ భీమ పన్నగై ర్విషయైరేభిరలం పరిక్షతం ।
అమృతైరివ సంభ్రమేణమా మభిషించాశుదయావలోకనైః ॥ ౧౦

తా॥ ఆర్తత్రాణపరాయణా ! సవిషంబులగు భయంకర భుజగంబులంబోలు నీ విషయంబులచే మిగుల గాయంబుల నొంది సొమ్మసిలియున్న నన్ను వేగిరంబ యమృతంబులబోలు నీ దయావలోకనంబు లందడుపుము.

శ్లో॥ మునయో బహవోఽద్యధన్యతాంగమితాస్స్వాభిమతార్థదర్శినః
కరుణాకర యేనతేనమా మవసన్నం ననుపశ్య చక్షుషా ॥ ౧౧

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా॥ కరుణానిధీ! నీవేకంటితో జూచినంతన పెక్కురు మునీ
ద్రులు వాంఛితార్థముల గాంచి ధన్యతనొందిరో ఆకంటితో దీనుడన
నన్నిపుడు జూడుము.

శ్లో॥ ప్రణమామ్యథయామి చాపరం శరణం కం కృపణాభయప్రదం
విరహీవ విభో ప్రియామయం పరిపశ్యామి భవన్మయం జగత్ ॥

తా॥ దేవా! ఇంకెవనిం బ్రణమిల్లుదు? మఱి యెవ్వని శరణ
జొచ్చెదు? నీకన్న దీనార్తిహరుండెందుగలడు? విరహిజనునకు జగమె
ప్రియామయంబుగ గన్పడు చందంబున నాకు నీజగమంతయు నీరూ
బుగ గన్పట్టుచున్నది.

శ్లో॥ బహవో భవతాను కంపితాః కిమితీశాన నమానుకంపసే ।
దధతా కిముమందరాచలం పరమాణుః కమఠేన దుర్ధరః ।

తా॥ మహాదేవా! నీచేత నెందఱో రక్షింపబడిరిగదా? నన్నేల రక్షి
పవు? మందర నగేంద్రమును వహించిన కమఠరాజము పరమాణువు
వహింపజాలకుండునా?

శ్లో॥ అశుచిం యదిమా ఽ నుమన్యసే కిమిదం మూర్ధ్నికపాలదామ
ఉత శాఠ్య మసాధుసంగినం విషలక్ష్మాసిన కిం ద్విజిహ్మధృక్ ॥

తా॥ భూతపతీ! నన్నపవిత్రునిగా నెంచితివేమొ? అట్లే
నీశిరంబున నున్న తలపుఱ్ఱెల పేరు పవిత్రమైనదే యగునా? ఇక
నాయందు క్రూరతయున్న దనిశంకించెదేని నీయందు విషచిహ్నం
లేదె? మఱినన్ను దుర్జనసాంగత్యముగల వానిగా భావించెదేని నీ
ద్విజిహ్మంబుల ( పాములను, అసత్యవాదులనని యర్థాంతరము
దాల్పలేదా?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ క్వదృశంవిదధామి కింకరోమ్యనుతిష్ఠామి కథంభయాకులః ।
క్వనుతిష్ఠసిరక్షరక్షమామయి శంభో శరణాగతోఽస్మితే॥ ౧౫

తా॥ విశ్వేశ్వరా! ఎటుచూతును? ఏమి సేయుదును? భయవ్యాకులుఁడ నెట్లు వర్తింతును? హా శంభూ! నీవెందుంటివి? నీకు నేను శరణాగతుఁడను. వేగిరమ నన్ను రక్షింపుము.

శ్లో॥ విలుఠామ్యవనౌకిమాకులః కిమురోహన్మి శిరశ్ఛినద్మివా ।
కిమురోదిమి రారటీమికిం కృపణంమాం నయదీక్షసే ప్రభో॥ ౧౬

తా॥ మహాప్రభూ! దీనుఁడనగు నన్ను జూడవేమి? ఏను నేల ాదఁబడిపొర్లుదునా? గుండియలవియఁగొట్టుకొందునా? శిరము ద్రుంచి వేసికొందునా? ఏడ్చుదునా? మిగుల నఱచుదునా? ఏమిసేయుదు?

శ్లో॥ శివసర్వగశర్వశర్మద ప్రణతో దేవదయాం కురుష్వమే ।
నమఈశ్వర నాథదిక్పతే పునరేవేశ నమోనమోఽస్తుతే॥ ౧౭

తా॥ శివా! సర్వవ్యాపకా! శర్వా! సుఖప్రదా! దేవా! ణముడనైతిని. నన్ను గృపఁజూడుము. ఈశ్వరా! నాథా! ఈశా! కు పునః పునః ప్రణామంబు లాచరించుచున్నాఁడను.

శ్లో॥ శరణం తరుణేందుశేఖర శ్శరణం మే గిరిరాజకన్యకా ।
శరణం పునరేవతావుభౌ శరణం నాన్యదుపైమి దైవతం॥ ౧౮

తా॥ బాలశశాంకమౌళియె నాకు శరణము. (రక్షకుఁడు.) మగిరికన్యకయె నాకు శరణము. మఱియు వారలిర్వురె నాకు శరణగుదురు. గాన నే నింకొక దైవతమును శరణువేడను.

శ్లో॥ ఉపమన్యుకృతం స్తవోత్తమం జపతశ్శంభు మిహావర్తినః ।
అభివాంఛిత భాగ్యసంపదః పరమాయుః ప్రదదాతిశంకరః॥ ౧౯

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా॥ శివసాన్నిధ్యమున నుపమన్యుకృతమగు నీ స్తోత్రము మును జపించు వానికి శంకరుఁడు సకలవాంఛితములను భాగ్యములను పరమాయువును నొసఁగగలఁడు.

శ్లో॥ ఉపమన్యుకృతం స్తవోత్తమం ప్రజపేద్యస్తు శివస్యసన్నిధౌ ।
శివలోకమవాప్య సోఽచిరా త్సహ తేనైవ శివేన మోదతే ॥

తా॥ ఉపమన్యుమహర్షి విరచితమగు నీ స్తోత్రము నే జను శివుని సన్నిధియందు జదువునో ఆపుణ్యాత్ముడు శివలోకమును శివునితో గూడ నానందము నొందుచుండును.

ఇత్యుపమన్యుకృతం శివస్తోత్రం

స మా ప్తం.

శి వం

——(౦)——

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# శాశ్వత ప్రధాన పోషకులు

శ్రీ మల్లికార్జున పండితారాధ్యుల (ఘట్టేపల్లి) రాజలింగమయ్యవార్ల గారి కుమారు[లు]
నాగమల్లయ్య అయ్యవార్ల గారు, సిద్ధిపేట.

శాసనగొట్టు వీరన్నగారి రంగరాజం, రామన్నవగైరా, సిద్ధిపేట.

# ప్రధాన పోషకులు

మ. రా. శ్రీ ముదిగొండ లింగయ్యశాస్త్రులుగారు, సికింద్రాబాదు 12-0

,, శివలంక తాయన్నగారు, పోణంగి 10-0

,, శివపురపు రాజయ్యగారు, శికింద్రాబాదు 10-0

,, కొడిమేల భోగసోమలింగారాధ్యులుగారు, శ్రీగురుత్వ సంస్థానం వరంగల్ 10-0

మ. రా: శ్రీ శ్రీమల్లికార్జున పండితారాధ్యుల అంబయ్య సిద్ధాన్తిగారు, నిర్మల 10-0

,, ఆకారపు చెన్నయ్యగారు, వరంగల్ 12-0

,, ప్రొద్దుటూరి చినవీరన్న పెదవీరన్నగార్లు శికింద్రాబాదు 10-0

,, బెల్దె రామన్న కుమారుడు జగదీశ్వరయ్య ... 10-0

# పోషకులు

,, ముదిగొండ వీరభద్రశాస్త్రిగారు, మాదల 5-0

,, భూపతి రత్నంగారు, వరంగల్ 6-0

,, చీకటిమళ్ల సంగయ్యగారు, మద్రాసు 5-0

,, కోనసముద్రం మోహిరీలు అయ్యవారుగారు, ఆరమూరు 5-0

,, బీపేట విశ్వనాథశాస్త్రిగారు, సిద్ధిపేట 5-0

,, ముత్యంపేట మల్లయ్యగారు ,, 5-0

,, కొమరువెల్లి బాలరాజుగారు, వరంగల్ 5-0

,, రామిని మల్లయ్యగారు, వరంగల్ 6-0

,, రామగిరి రాజలింగయ్యగారు, సిద్ధిపేట 5-0

,, గ్రరపల్లి రామన్న వెంకటేశంగారు మిడిదొడ్డి 5-0

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రీ

శివాయ గురవేనమః

# శైవరహస్యబోధిని.

ఇది

శ్రీ దేవిడీ సంస్థానాధిపతులగు ఇజ్జితాసాక్
శ్రీ కందుకూరి బాలసూర్యప్రసాద భూపాలుని
సాహాయ్యమున వెలువడుచు,
శైవధర్మములను, వాని ప్రాముఖ్యమును దెలుపు
మాస పత్రిక.

| | | |
|---|---|---|
| సంపుటము 5. | విభవనామ సంవత్సర చైత్ర, వైశాఖములు. | సంచికలు 1, 2. |

సంపాదకుడు:- ముదిగొండ నాగలింగశాస్త్రి.

శ్లో॥ అనుశ్రుతాచార పరత్వసాధినీ।
విరుద్ధవాదౌఘనితాన్త బాధినీ।
అశేషశంకామయపంకశోధినీ।
జయత్వియం శైవరహస్యబోధినీ।

తెనాలి లలిత ముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె.

చందా సం॥ రు 2-0-0.

1928.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## శాశ్వత ప్రధాన పోషకులు.

శ్రీమల్లికార్జున పండితారాధ్యుల (ఘట్టేపల్లి) రాజలింగమయ్యవార్లగారి కుమా

నాగమల్లయ్య అయ్యవార్లగారు. సిద్దిపేట

కాసనగొట్టు వీరన్న గారి రంగరాజం, సిద్దిపేట

చందా రు 100 ల వల్ల వచ్చేవడ్డి రు 10 లు మాత్రం ప్రతిసంవత్సరము ఇవ్వ

నిర్ణయించుకొనినవారు

మ॥ రా॥ శ్రీ కామర్సు నాగేశ్వరరావుగారు, కరణం ముద్దాపురం.

### —: మహారాజపోషకులు :—

వేములపల్లి అగ్రహారికులు.

| | | |
|---|---|---|
| 1 | భండారు మల్లిఖార్జునరావుగారు | 60—0—0 |
| 2 | భండారు వీరభద్రరావుగారు | |
| 3 | భండారు వీరరాజుగారు | |
| 4 | భండారు వీరబసవరాజుగారు | |
| 5 | భండారు చెన్నబసవయ్యగారు | |
| 6 | భండారు చిన మల్లిఖార్జునుడుగారు | |

### —: ప్రధాన పోషకులు:—

| | | |
|---|---|---|
| ,, | ముదిగొండ లింగయ్యశాస్త్రిలుగారు సికింద్రాబాదు | 12— |
| ,, | ముత్యం పేట శంకరారాధ్యులుగారు, లచ్చుపేట | 10— |
| ,, | శివలంక తాయన్నగారు, పోణంగి | 10— |
| ,, | ముదిగొండ వీరభద్రయ్య అయ్యవారుగారు, ఈమని | 10— |
| ,, | శివపురపు రాజయ్యగారు, శికింద్రాబాదు | 10— |
| ,, | కొడిమేల భోగసోమలింగారాధ్యులుగారు. శ్రీగురుశ్వ సంస్థానం, వరంగల్ | 10— |
| ,, | శ్రీ మల్లికార్జున పండితారాధ్యుల అంబయ్య సిద్ధాన్తిగారు నిర్మల | 10— |
| ,, | కాశీనాధుని అల్లమయ్య అయ్యవారుగారు యలమర్రుఅగ్రహారం | 10— |
| ,, | శివలంక శంభులింగం అయ్యవారుగారు బెజవాడ | 10— |
| ,, | ఆకారపు చెన్నయ్యగారు, వరంగల్ | 12— |

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రీ శివాయ గురవేనమః.

## శైవరహస్యబోధినీ పత్రికా విజయము.

పాఠకమహాశయులారా!

ఈ పత్రికామతల్లి నాల్గవయేట కారణోత్తమను దివ్యాగమము పూర్తిగాఁ బ్రకటించెను. ఆహ్నికవిధిని శివధ్యానపద్ధతి మొదలుగా వైశ్యదేవము వఱకుఁ బ్రచురించెను. మహాశివపూజావిధిని వెల్లడించెను. షట్కాలశివపూజయెడ విమతులు గనఁబరిచిన యాక్షేపణాభాసముల వారించెను. శైవగణార్చనము నెడ పలువురకుగల సంశయముల నిరాకరించి సప్రమాణతను నతివిపులముగా వెలయించెను. మతవినోదచర్చయందు శివసాతమ్యాము ననేకవిధముల విశదీకరించెను. శైవపూర్వాచారనిందకులై తన్మూలమున నీపత్రికయెడను నసూయాగ్రస్తులై బైలువడిన విపశ్చితులఁ గొందఱ యాటోపము నాగెను. ఈవిధమున నీపత్రిక శైవసంఘమునకు నత్యుపకారకమైనను శైవసంఘమునకు నిండుఁ దగు నాదరణ లేకుంట శోచనీయము. ఈ కారణమున నీపత్రిక నాల్గవసంవత్సరము నారంభమున ద్విమాసపత్రికగా జరుగుటయె దుశ్శకమను స్థితికిరాగా శ్రీ దేవిడీ సంస్థానాధీశులగు శ్రీ రాజా ఇజ్జితాసాన్ కందుకూరు బాలసూర్యప్రసాదరావు బహద్దరు జమీందారువార లిద్దానిని మాసపత్రికగా జరుగునట్లు లనుగ్రహించి శ్రీపరమేశ్వరపారమేశ్వరానవధికానుగ్రహమునకు భాజనులైరి. ఏతన్మూలమునను నీపత్రిక సుస్థిరజీవనయగుటనె సర్వాంశముల యందు విజయము నొందఁగలుగుచున్నది. మీ యనుగ్రహమున నాల్గవవత్సరము నతిక్రమించి పంచమవార్షికోత్సవముగాంచి యీసంవత్సరారంభముననె, 'తెలుగునాటి యారాధ్యులు పూర్వకాలమున ంగధారులు గారు' అను వాదమును ఖండింప నుత్సాహమొందు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చున్నది. ఇట్లు శైవమహాజన ప్రతిష్ఠాప్రతిష్ఠాపకమైన యీపత్రి
రత్నమును, ఏతత్సంరక్షకులగు శ్రీదేవిడీ సంస్థానాధీశులను, నిం
పత్రికాపోషకులను పాఠకులను గూడ పరమేశ్వరుడు మనుచుగాత.

పా॥ సం॥

---

శ్రీశివాయగురవేనమః

# బసవపురాణ పీఠికా

## విమర్శనము.

శైవమహాజనులారా!

శ్రీపాల్కురికి సోమనాథుడు రచించిన బసవపురాణ
బ్ర॥ శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వ్రాసిన గొప్ప పీఠికతో గూ
మహారాజరాజశ్రీ దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు పంతు
గారిచే నాంధ్రపత్రికా కార్యాలయమున నతిరమణీయముగా ము
తమై ప్రకాశితమగుట పలువురెఱింగిన యంశమే.

పూర్వకాలమున బసవేశ్వరుని భక్తివైభవంబును, సోమనాథ
రచనాసామర్థ్యంబును నీగ్రంధముయొక్క ప్రచారమునకు గారణ
లైయుండెను. కాని వానియందు విశ్వాసము విరళమైన యికా
మునైనను శ్రీశాస్త్రిలవారి పీఠికానిర్మాణంబును, శ్రీపంతులవా
ప్రచురణంబును మాత్రమె యీగ్రంధముయొక్క యత్యంతవ్యా
నిదానములనుట యతిశయోక్తి గానేరదు.

బహుగ్రంధశోధకులును, రచనావిశారదులును నస్మత్ప్రి
మిత్రులు నగు బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిలవారు రచిం
బసవపురాణపీఠికయె వారి వైదుష్యమును వ్యక్తీకరించుచున్న
ఆపీఠికయందుగల సోమనాథుని చరిత్రము మొదలగు పెక్కంశము
ప్రశంసనీయములై

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విమర్శనావశ్యకత.

ప్ర॥ అస్లేని నీవిమర్శనోద్యమము దేనికి?

ఉ॥ కొద్దియంశములలో నభిప్రాయభేదమున్న కారణమున.

ప్ర॥ అంతమాత్రమున విమర్శనారంభము తగవులకు నిదానముకాదా?

ఉ॥ విజ్ఞులు పరిశోధింతురుగాక యని పీఠికాకర్తలు వచించినందున నట్లుకాదనియె నానమ్మకము. అట్లుగాక యింకొకవిధమున నైన నేమిచేయవలయు? ఈయెడ శ్రీశాస్త్రిలవారే వారిపీఠికయందు భావిఫలితమును దెలిపియున్నారు.

ప్ర॥ ఏమని?

ఉ॥ బసవపురాణపీఠిక 73 వ పేజీ, ఈవిషయము తగవులకు దానకమగునని నేనెఱుఁగుదును. అయినను నాకు వాస్తవముగాఁ దోఁచినదానిని దెలుపుచున్నాఁడను. అని తమకుగల జ్యోతిర్విద్యావైశద్యమునుగూడ వెలిబుచ్చియున్నారు.

ప్ర॥ వారికి వాస్తవముగాఁ దోఁచినదిగాన వారట్లు దెలిపిరి, మీకిందేమి యవసరము?

ఉ॥ నాకును వాస్తవముగా దోఁచినదిగాన నే దెలుప నవసరమయ్యెను.

ఇదిగాక అనావశ్యకములు, నపరిచితములు, దుర్విజ్ఞేయములునగు శైవమతప్రభేదములు మున్నగువానిని యథేచ్ఛముగా వారుపరిష్కరించుటంజేసి పాఠకులకు సంశయములు గలిగియున్నప్పుడువానిని యథామతి వారించుట నీప్రతికా కృత్యమైయుండగా నుపేక్షింప నెట్లగును?

ప్ర॥ బసవపురాణపీఠికయందు శైవమతప్రభేద నిరూపణము ఆవశ్యకము గాదా?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ॥ బసవపురాణపీఠికయందు బసవేశ్వరుని శైవమతమెట్టిదో తన్నిరూపణము మాత్ర మావశ్యకముగాని కడమమతముల నిరూపణ మంత యావశ్యకముగాఁ గన్పట్టదు.

ప్ర॥ ప్రసక్తానుప్రసక్తిచే కడమ శైవమతముల నిరూపణము మాత్రమావశ్యక మేలకాదు?

ఉ॥ ప్రసంగసంగతిచే కడమ మతములు ప్రస్తావగోచరము లైనను నవ్వియవి యపరిచితములు దుర్బోధము లగుటంజేసి వాని నిరూపింప నశక్యము.

ప్ర॥ అవ్వియవి యపరిచితములు దుర్బోధము లనుట యెట్లు?

ఉ॥ వీరు నిరూపించిన శైవమత ప్రభేదములలో నొక్కటి యేని వీరికి స్వీయమతముగాదు. దానంజేసి యిందొక్కదానియందైన వీరికి విశ్వాసము శూన్యము. ఇంక పాశ్చాత్యులు వేదములనుగూర్చి ఉత్పత్తి కాలాదులను వ్రాసినట్లు వీరును శైవమతవిశేషములనుగూర్చి విమర్శనము వ్రాసినను నీచరిత్రములు తత్తన్మతస్థులకు నుపాదేయము లెంతమాత్రముగా నేరవు.

శైవమతప్రభేదము లపరిచితములు దుర్బోధములు ననుటకు వారు వ్రాసిన పీఠిక 68 పేజీ పైశైవమతముల సూక్ష్మభేదములను స్పష్టముగా గనుగొనుటకు బలవత్తరములైన యాధారములు నేను దొరకకున్నవి. శైవగ్రంథములందుద్ధృతములైన యాగమతంత్రశ్లోకములను బట్టి యాయామతముల స్థూలస్వరూపముచు మాత్రము గనుగొన సాధ్యమగుచు. ఆకాలపు దంత్రగ్రంథములును, నాగమగ్రంథములును నాయామతములవారి యనుష్ఠాన నిబంధములును నేను పర్యాప్తముగా మనకు దొరుకుటలేదు. అని వ్రాసిన వాక్యములే నిదర్శనము లగును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## కాలాముఖ శైవపరిష్కార విమర్శనము.

ప్ర॥ ఆవాక్యములను బట్టి శైవమతముల సూక్ష్మభేదము దుర్బోధమని యేర్పడినను కొన్ని శ్లోకములనుబట్టి స్థూలస్వరూపము సుబోధమేయని తెలియుచున్నదిగాదా?

ఉ॥ అంతమాత్రముచే శైవమతముల స్థూలరూపము దెలిసె నని తాము మాత్రము సంతసపడవలయునెగాని దాని నెరులకు దెలుప ననువుపడదు. ఇట్లనుటకుఁ దార్కాణమేమనిన, వీరు కాలా ముఖమను శైవమతస్వరూపమును నిరూపించిన విధము చూడుడు.

పీఠిక 72 పేజీ.

వీరి సిద్ధాంతమేదో స్పష్టముగా దెలియరాదు. గాని వీరు శక్తి పూజనుగూడఁ జేయువారుగా గానవచ్చుచున్నారు. మండలార్చనా దులు శాక్తసాంప్రదాయములు వీరికి గొన్ని గలవు. లింగార్చనము శక్తిశివసంయోగ రూపమైనదే. శక్తి చిహ్నము పానవట్ట ము, శివచిహ్నము లింగము నగును. అని మొదలుగా వ్రాసియున్నారు.

వీరి సిద్ధాంతమేదో స్పష్టముగా దెలియరాదు. ఇదియు కాలా ముఖ శైవలక్షణమగునా? మొదల ఇటనుట యపరిచయమును బోధింపదా? తెలియని దానిం దెలుపుమని యెవ్వరు నిర్బంధించిరి? ఇది పోనిండు. తరువాతి వాక్యములంబట్టి కాలాముఖ శైవమునందు శక్త్యర్చనము విశేషమని తెలియుచున్నదిగదా. మీరు శక్తికి స్వాతం త్ర్యము నంగీకరించిరా? వారు శైవులే గాకపోదురు. పారతంత్ర్యము నొప్పి పూజించుట పాశుపతాదులయందును గలదు. పానవట్టము శక్తిచిహ్నమనుటయు - లింగము శివచిహ్నమనుటయు నన్ని శైవము లయందునున్న యంశమేగాన నిదియు కాలాముఖశైవ విశేషధర్మము గాదు. శ్లో॥ శివశ్శక్త్యాయుక్తోయది భవతి శక్తః ప్రభవితుం॥ అని ఈశాస్త్రులవారే కాలాముఖ శైవసిద్ధాంతమును శంకరాచార్యుల వారును ననువదించియున్నట్లు వ్రాసిరి. శ్రీశంకరాచార్యులవారు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాలాముఖశైవసంప్రదాయము వారని యంగీకరింపరుగదా? ఈ
నీ ధర్మములనుబట్టి కాలాముఖశైవవిశేషధర్మము నెట్లు గ్రహిం
వలయు?

ప్ర॥ ఇవిగాక మఱికొన్ని విశేషములను వ్రాసియుండలేదా

ఉ॥ వ్రాసిరిగాని యెట్లున్నవో చూడుడు. పీఠిక 73పేజీ కాలా
ముఖులు శక్త్యర్చనముగూడ గావింతురు. వారు నిత్య బ్రహ్మ
రులు. గార్హస్థ్యము వారికిఁ దగదు. అనియున్నది. శక్త్యర్చన
సాధకముగాదని తెలుపఁబడియెను. నిత్యబ్రహ్మచారులు అను
మాత్రము విశేషధర్మమేగాన సాధకమే అయియుండనగు
గార్హస్థ్యము వారికి దగదనుమాట నిత్యబ్రహ్మచారులన్నదా
వివరణముగానె కన్పట్టుచున్నది.

ప్ర॥ ఇఁక దీనింబట్టి కాలాముఖశైవమత విశేషధర్మము
నిస్సంశయముగా నేల గ్రహింపఁగూడదు?

ఉ॥ ఈలక్షణము కాలాముఖ శబ్దసార్థకతనే వ్యక్తీకరిం
చున్నదిగాన బాగుగనే గ్రహింపవచ్చును.

ప్ర॥ ఈలక్షణము కాలాముఖశబ్దమునకు నన్వర్థమనుటయెట్లు

ఉ॥ కాలాముఖమనఁగా కాలునకు నాముఖము సమ్ముఖ
యర్థము. ఆశైవమునకు నాతరముతోనె కాలము మూడు
భావము. ఈభావమునె నిత్యబ్రహ్మచారులు అనువిశేషణము స్పష్ట
చేయుచున్నది. వారు నిత్యబ్రహ్మచారులగుటంజేసి వారికి వి
హము లేదు. సంతానంబును లేదు. ఇఁక వారి మతము వారి
ముతో నంతరింపవలసినదె. గాక తరువాత నెట్లుండును?

ప్ర॥ నిత్యబ్రహ్మచారులన్నదానికి వివాహరహితులనియె యో
మగునా?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ॥ నిత్యబ్రహ్మచారులన్న దానికి నర్థాంతర మేదేనినున్నను గార్హస్థ్యము వారికిఁ దగదు. అను వాక్యమునకు నేమి యర్థమో గ్రహింపుడు. వారికి గార్హస్థ్యముతో పనిలేకయు సంతానప్రాప్తిసాధకమగు నేదేనొక యుపాయముండిన నేతక్క నా శైవము త్తరకాలమున నిలుచునా! ఎందైన గ్రహించినవారితోనె సమాప్తినొందునది మతమనిపించుకొనునా! కాలాముఖమనునది శైవమతప్రభేదముగా శాస్త్రులవారంగీకరించి దాని స్థూలస్వరూపము నీవిధముగా వివరించిరి గదా! దీనింబట్టి యా శైవముయొక్క స్థూలరూపమును వారేమి గ్రహించినట్లు వ్యక్తమగుచున్నదో ఎదిరివారేమని గ్రహింపవలయునో యోజించుడు.

ప్ర॥ కాలాముఖశైవులిప్పుడు లేరుగాన వారివిషయమైన విమర్శనము దేనికి?

ఉ॥ ఇది నిజమే వారెవ్వరు లేరుగాన శాస్త్రులవారు వారిని నిత్యబ్రహ్మచారులన్నను నింకొకరు ఘోటకబ్రహ్మచారులన్నను బాధకము లేదు. ఇఁక నిది దేనికందురేని శైవమతస్థూలరూపమును శాస్త్రులవారెట్లు గ్రహించి వివరించినదియు వెల్లడింపమాత్రమే యుదాహరింపఁబడియెను.

## పాశుపత పరిష్కార విమర్శము.

ప్ర॥ బసవపురాణ పీఠికయందు పాశుపతమును నిరూపించినది సప్రమాణముగా నుండలేదా?

ఉ॥ అది విమర్శించిన మీఁదగదా తేలును.

ప్ర॥ అందు విమర్శనీయ మేమికలదు?

ఉ॥ పీఠిక 71 పేజీ, పాశుపతము. ఈవ్రత మథర్వ శిర ఉపనిషత్తునందుఁ జెప్పఁబడినది. శ్రీకంఠ భాష్యము గూడ దానినే పేర్కొనుచున్నది. అని యారంభించి పాశుపతు లద్వైతమతమును

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మిక్కిలి గర్హించిరి. వారు జీవేశ్వరులకు భేదము చెప్పుదురు. పశు
లగు జీవులు పతియగు శ్రీగురుని యనుగ్రహముచే పాశమయిన సం
రము నుండి ముక్తులై మోక్షసుఖము ననుభవింతురు. జీవులకు పా
బంధము తొలగుచు గాని పశుత్వము తొలగదని మల్లికార్జున పం
తులు చెప్పెను. అని మొదలుగా వ్రాసినదంతయు విరుద్ధమే

ప్ర॥ అదియెట్లు?

ఉ॥ అద్వైతమును గర్హించువారును, జీవేశ్వరులకు భేద
చెప్పువారును పాశుపతులు మాత్రమే గాదు.

ప్ర॥ వీరికిదోడు మఱికొందఱు నట్టివారుందు రందురా?

ఉ॥ మఱికొందఱు మాత్రముగాదు వ్యాసతాత్పర్య నిర్ణ
మను గ్రంథ మొక్కటి గలదు. వ్యాససూత్రములకు పలువురు
విధముల భాష్యములు చేయుచుంటం బట్టి వ్యాసునకు నద్వైత
నందే తాత్పర్యమని నిర్ణయింప నెంచి యద్వైత మతస్థులే గ్రం
థము రచించి కొనిరి.

వ్యాసునకు నద్వైతమునందే భావముగల దనుటకు నా గ్ర
మున నొక్క ప్రబల యుక్తి చెప్పఁబడియున్నది.

ప్ర॥ ఏమని?

ఉ॥ వ్యాసుడు తనకు సాటివారైన ఋషులయొక్క మతమ
ఖండించును. గాన, తనకు సాటివారును కల్ప సూత్రకారులును
నాపస్తంబుడు మొదలగువారు చేసిన ద్వైత సిద్ధాంతమును ఖండి
అద్వైతమునె స్థాపనము చేసెనని దీనివలన విశదమగుచున్నది.
మొదలుగా నున్నది. ఈ యుక్తినిబట్టి వ్యాసుని తాత్పర్యము తేల
తేలకున్నను కడమ ఋషుల తాత్పర్యము స్పష్టముగా తేలినది. ఋ

ప్ర॥ ఏమని?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ॥ చాలవరకు ఋషులందఱు నద్వైతము ఖండించిన వారే యని. ఇట్లు బ్రాహ్మణ్యమునకు నిదానభూతులగు కల్ప సూత్రకారులు మున్నగు ఋషులందఱు ఖండించిన యద్వైతమును పాశుపతులు గర్హించి నంతన వీరికేమి ఘనతవచ్చును? అద్వైతమునకేమి న్యూనత వాటిల్లును?

ఇట్లు సర్వఋషి సాధారణమైన యద్వైత గర్హణ మను నేరమును పాశుపతుల తలమీదనే యారోపించి వారిలక్షణముగా జెప్పుట యుచితమెట్లగునో యోజించుడు.

ఇదిగాక, పశువులగు జీవులు పతియగు రుద్రుని యనుగ్రహముచే పాశమైన సంసారమునుండి ముక్తులై మోక్షసుఖము ననుభవింతురు. జీవులకుఁ బాశబంధము తొలఁగునుగాని పశుత్వముతొలగదని మల్లికార్జున పండితుడు చెప్పెను. అనియువ్రాసిరి. గాని యిది కేవల మసత్యము.

ప్ర॥ క॥ గోపతి కృతమున భవపా
శాపేతములైన పశువులట్టులు భవపా
శాపేతులైన పశువులు
ప్రాపింతురు మోక్షసుఖము పశుపతినీచే.

ఈపద్యమున పశుత్వము తొలగఁదను నర్థము లేదా?

ఉ॥ అట్టియర్థ మాపద్యమున నేమియు గాన వచ్చుటలేదు. పశువులనఁగా జీవులు. వారు మోక్షసుఖము నొందుదురని యున్నది. అంతియగాని పశుత్వము తొలగదని యెందున్నది?

సంసారవర్తిన స్సర్వేపశవః పరికీర్తితాః అను న్యాయమును బట్టి సంసారబంధ సంబంధవ్యపదిష్టమగు పశుత్వము సంసారబంధము తొలఁగిన తరువాత నెట్లు నిలుచును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రీకంఠ భాష్యము పాశుపత మతప్రతి పాదకము గానె శాస్త్ర వారంగీకరించిరిగదా? ఆభాష్యమున నెందైన బంధని వృత్తి యు నను పశుత్వము తొలగదని యున్నట్లు చూచియుండిరా? అట్లు చూ గలరా?

శ్రీకంఠ భాష్యము జన్మాద్యధికరణమున 'పశుపతి శబ్దవాచ్య పరంబ్రహ్మ॥ తథాహశ్రూయతే॥ ఏషామీశే పశుపతిః పశూనాంచ స్పదా యితచద్విపదామిత్యాది॥ పాశసంబంధేన పశుత్వవ్యవహా త్పశుగ్రహణాత్పశుపాశద్వయంచ గృహీతం భవతి॥ అనుటచే పా సంబంధముననె పశువులను వ్యవహార మేర్పడియెనని స్పష్టీకరింప యున్నది. ఇట్లుండగా సంసారపాశము తొలగినను జీవులకు ప త్వము నివర్తింపదని మల్లికార్జునపండితుఁ డెట్లు చెప్పును?

గోపతికృతమున అను పద్యమునందైన నట్టి యర్థముకలద లేదు. ఆపద్యము పశుత్వము తొలగునా, తొలగదా అను సంశ ముచుదీర్ప నేర్పడినదా! కాదు. ఇంకేమన, జీవులీశ్వరానుగ్రహమ సంసారపాశనివృత్తినొంది మోక్షసుఖమునొందుదురని యందు స్ప ముగా గానఁబడుచున్నది.

ప్ర॥ ఉపమానముచుబట్టి యట్టియర్థము గోచరమగుచు లేదా! ఎట్లనిన, ఓపశుపతీ! పశునాయకునిచే మెడత్రాడు విడువబ పశువులవోలే నీచే పాశవిముక్తినొందిన పశువులును మోక్షసుఖ మొందుదురనుటచే మెడత్రాడువిడిచినమాత్రన పశువులకు పశుత్వ తొలగదుగాన బంధనివృత్తినొందినను పశుత్వము తొలగదను నర్థ ద్యోతకమగుటలేదా?

ఉ॥ అంతమాత్రన నట్టియర్థము ఋజుబుద్ధులకు యుక్తము దోపదు. బంధము దొలగించుట యజమానుని యధీనమనుట బంధవిమోచనము నొందినవారు మోక్షసుఖము నొందుదురనుట మాత్రమే యాయుపమానము నిర్దేశింపఁబడియెను. అట్లుగాక

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మానగతధర్మముల నన్నిటిని నుపమేయమున సంబంధింపజూచినచో నాయుపమాన మలంకార మనిపించుకొనక వికారమనియె యనిపించుకొనును. ఆపద్యమునందు నుపమానోపమేయములకు మోక్షసుఖప్రాప్తిని సమానధర్మముగా గ్రంథకర్త గ్రహించియున్నను వీరు పశుత్వానివృత్తిని గ్రహించుట యాశ్చర్యకరము.

ప్ర॥ ఇట్టి విశేషార్థమును సాధింప వీరికేమి యవసరము?

ఉ॥ కారణములేక కార్యమెన్నటికి గలుగనేరదు. వారట్టి విపరీతార్థమును సాధింప శైవమతములమీదగలపరిపూర్ణానుగ్రహమే యనితోచెడి. అదిలేనిచో వీరు శైవమతములనింత తేలికగా నుద్ధరించి యుండరు.

ప్ర॥ పీఠికా కర్తలు శైవమతముల కేమి లాఘవము గలుగజేసిరి?

ఉ॥ ఇంకేమి చేయవలయు? పీఠిక 76 పుట ఆంధ్రారాధ్య సంప్రదాయము పూర్వకాలమున నీశివాచార్య పరంపర వారి సంప్రదాయముగానె యుండెనని నేను దలచుచున్నాఁడను. పెక్కువిధముల జూడగా నాంధ్రారాధ్య సంప్రదాయ మిట్టిదిగా గానవచ్చుచున్నను లింగధారణము కరపీఠార్చనము షట్స్థల వివేకము మొదలగునవి వీర శైవసంప్రదాయోద్భూతములు గొన్నిగూడ గలిసి యుండెననియు 78 పేజీయందు, ఇటీవల వీరు లింగ ధారణముతో బాటు ఖననసంస్కారమునుగూడ పరిగ్రహించి యుండవచ్చుననియు వ్రాయుటతో నాంధ్రారాధ్యమత ముద్ధరింప బడియెను. ఇది యెట్టిదైననగు గాక దీనికి మూలమగు వీరశైవము సప్రమాణము యగుగాదా యనియొంతు శేమోయనను నూహాతో వీరశైవము బసవేశ్వరాద్యు పజ్ఞమెయని నిర్ధారణచేసిరి. ఈనిర్ణయముచే [illegible] కుంకుడుఁవ్రేళ్ల[illegible] యుద్ధారితమైనది. ఎట్లన వీరశైవమతమునకు కర్తలు బసవేశ్వరా[illegible]. వీర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శైవ మతమునకు ప్రమాణమైన గ్రంథములు నప్పుడేర్పడ
యనుటతో నా మతము నిర్మూలమని యేర్పడుచున్నదిగదా.

పాశుపత మతస్థు లిప్పుడెవ్వరు లేరుగాన దానిని
భూషించియు, పాశుపత మతముమీద నెక్కలోపము నారోపి
వారికి ముక్తియందును పశుత్వము తొలఁగనేరదని ప్రతిపాదించి

ఈయర్థము పాశుపతసిద్ధాంతమునగాని వా రుదాహ
పద్యమునగాని లేశమైన లేదు.

శ్రీమల్లికార్జునపండితులవారు గోపతికృతమున నను పద్య
నకు దరువాతి పద్యమునందు విపరీతార్థ శంకలను మాన్పి
ఎట్లన!

క. త్రిమలకృతదుఃఖ సంసా
రమహాబ్ధినిమగ్న జీవరాసులు నీయు
త్తమ కారుణ్యావశంబున
విముక్తులై నీవపోలె వెలుగుదురు శివా॥

జీవులు నీయనుగ్రహమున ముక్తులై నీవపోలె వెలుగుదు
టచే సారూప్యముక్తి లభించునని తెలియుచున్నది. ఈశ్వర సమ
రూపత్వము సిద్ధించుననఁగా పశుత్వము తొలఁగదని యర్థమగున
ఈనిర్ణయము శ్రీకంఠభాష్యమునకు విరుద్ధమేయని నిర్ధారణ చేయ
బడియెగదా?

ఇదిగాక మఱియు వారుసన్యాసమును గర్హింతురు అన్నది
విరుద్ధమే.

ప్ర॥ క. ప్రాజ్ఞులు వేదజ్ఞులు లో
కజ్ఞులు చేకొంద్రె గతశిఖాగాయత్రీ
యజ్ఞోపవీత నాస్తిక
లజ్ఞులు చేకొంద్రుగాక యద్వైతమజా॥

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అను పద్యమును బట్టిసన్న్యాస గర్హాపాణము స్పష్టపడలేదా?

ఉ॥ ఆపద్యమును బట్టి యద్వైతులాదరించిన పరమహంసాశ్రమము కలియుగ నిషిద్ధముగాన నదిమాత్రమె నిరాకరింపఁబడినట్లు తెలియుచున్నదిగాని సన్న్యాస సామాన్యము నిరాకృతమని తెలియుటలేదు.

ఇందిది గ్రహింపవలయు.

కుటీచకము,బహూదకము,హంస,పరమహంసలను సన్న్యాసాశ్రమము నాలువిధములుగా నున్నది. ఇందు హంస పరమహంసలకు శిఖాసూత్రాదులు లేవుగాని కుటీచక బహూదకులకు గలవు. సన్న్యాసం పలపైతృకంఅనుటచే సన్న్యాసము కలియుగనిషిద్ధమైనను పరమహంసాశ్రమముగ్రాహ్యమే యని శంకరాచార్యులవారంగీకరించిరి. సన్న్యాస నిషేధము పరమహంసాశ్రమ పరముగాన బహూదకము గ్రాహ్యమని నీలకంఠాచార్యులవారంగీకరించిరి.

పరమహంసాశ్రమ ధర్మములను జెప్పునప్పుడు నేతిని నెత్తురుగాఁ జూడవలయుననియు, సువర్ణ రజతములను మలముగా నెన్నవలయుననియు మొదలుగానుపనిషత్తులయందెగలదుగానపరమహంసాశ్రమము కలియుగమున ననుష్ఠింప దుశ్శకముగా దెలియుచున్న కతన నీలకంఠాచార్యప్రభృతులు కలియుగ నిషేధము పరహంసాశ్రమ పరమే యని నిర్ణయించి బహూదకమును గ్రహింప వలసివచ్చెను. ఏదియెటులైనను

సన్న్యాసము నాలువిధములుగా నుండుటయు, అందు కుటీచక బహూదకులకు శిఖాసూత్రము లుండుటయు సర్వప్రమాణ సమ్మతమైయున్నది. ఇట్లుండ గతశిఖా గాయత్రీ యజ్ఞోపవీతులనటచే శిఖాసూత్రరహితులగు హంస పరమహంసలు మాత్రమె గర్హితులగుదురో లేక శిఖాసూత్రసహితులగు కుటీచక బహూదకులును గర్హితులగుదురో దీనింబట్టి పాశుపతులు సన్న్యాసమునే గర్హించుచుండనట యెట్లు లుచితమగునో విజ్ఞులు గ్రహింతురుగాక.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్ర॥ పీఠిక 73 పేజీ, దేవలకులు మంత్రదీక్షాన్వితులును పాసుపతాది శాసనధరులు, వారి కారికలింగవంతులైచూచివారివా లింగవంతులైరూకి, ఈవిపదలుబసవేశ్వరుని యుద్బోధనమువలన లింగ ధారణము లేని పాసుపతాములు కూడ లింగధారులయి వీరశైవము జేరిజొచ్చిరని చెప్పుచున్నవి.

శ్లో॥ వ్రతంపాసుపతంచైవ కాలాముఖకపాలికె ।
లింగాంగసంగహీనత్వా త్తచ్ఛిష్యోనరకంవ్రజేత్ ॥
వీరశైవాచార సంగ్రహము.

శ్లో॥ శైవాః పాసుపతాః వామాః కాలాముఖమహావ్రతా
అతిరిచ్యతిదేవేశి ప్రాణలింగార్చనోబుధః ॥

పై శ్లోకములు పాసుపతులు, కాలాముఖులు, కాపాలిక లింగధారులుగారనియు, అట్టివారి శిష్యుడగువాడు నరకము నొ సనియు జెప్పుచున్నవి. ఇట్టిశ్లోకములు పెక్కులుగలవు అని వ్రా యున్నారు. ఇందుమీయభిప్రాయమేమి ?

ఉ॥ బసవేశ్వరు నుద్బోధన వలన లింగధారణము లేని పా పతాములుగూడ లింగధారులై వీరశైవమునజేరిరనుట విరుద్ధముగా లింగధారణముగలది యొక్కటియు, లింగధారణము లేనిది వేరొకటి యిట్లు పాసుపతము రెండువిధములుగా నున్నదని కాలాగ్నిరుద్ర అథర్వశిరస్సు, మొదలగునుపనిషత్తులు, శివపురాణము, లింగపు రాణము మొదలగువానివలనను దెలియుచున్నది. దానింబట్టి లి ధారణములేనిపాసుపతులు బసవేశ్వరునుద్బోధమువలన లింగధా లైనచో బాధయేదియును లేదు.

ప్ర॥ పైశ్లోకములవలన పాసుపతాములకు లింగధా లేదని తెలియుటలేదా ?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ॥ అంతమాత్రమున నట్లుగ్రహింపఁగూడదు. ఏలన, ఈశ్లోకములు వీరశైవ గ్రంథగతములు. ఏమతధర్మమును నిర్ణయింపవలసి వచ్చినప్పుడు ఆమతగ్రంథములనుండియే నిర్ణయించుట న్యాయ్యమగు గాని తద్విరుద్ధమతగ్రంథములవలన నిర్ణయించుటయుచితమనితోపదు. ఎట్లన, అద్వైతులకు దేవభక్తిశూన్యమని శైవగ్రంథములయందుండును. శైవులకు కర్మాసక్తి మృగ్యమని యద్వైతగ్రంథములయందుండును. ఈయిర్వురకు ముక్తియే పూజ్యమని వైష్ణవగ్రంథములయందుండును. కావున విమతగ్రంథములవలన నేమతధర్మమునైన నిర్ణయింపనుచితముగాదు. ఈశ్లోకములుచూడగా, తచ్ఛిష్యో నరకం వ్రజేత్ అని మొదలుగానుండుటచే పాశుపతాది మతనిందాశ్లోకములని స్పష్టమగుచున్నది. ఇట్టిశ్లోకములనుబట్టి పాశుపతాదిమతధర్మముల పరిష్కరించుట యెట్లుచితమో విజ్ఞులాలోచింతురుగాక.

ఈశ్లోకములవల్లనైనను లింగధారణములేని పాశుపతాదులకన్న లింగధారణముగల వీరశైవమే శ్రేయమను నాశయము వ్యక్తమగుచున్నది.

ఆరాధ్యులు పూర్వకాలమునను లింగధారులే.

ప్ర॥ తెలుగునాటి యారాధ్యులు వీరశైవులు గారు. అని పీఠికయందున్నది. దీనికేమి చెప్పుదురు?

ఉ॥ తెలుగునాటియారాధ్యులు వైదికవీరశైవులనియు, పూర్వకాలమున వీరు లింగధారులేయనియుఁ జెప్పుదుము.

ప్ర॥ వీరశైవమున భేదము గలదా?

ఉ॥ కలదు. వర్ణాశ్రమాచార రహితమైనదియొక్కటియు, వర్ణాశ్రమాచార సహితమైనది వేరొక్కటియు నని యిట్లు వీరశైవము రెండు విధములుగా నున్నది. ఈయర్థము శంకరసంహితాదులయందు గలదు. ఇందు తెలుగునాటి యారాధ్యులు వర్ణాశ్రమాచారసహితమైన వైదికవీరశైవమునకు సంబంధించినవారగుదురు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్ర॥ లింగము ధరించిన వీరమాహేశ్వరుడు (వీరశైవు[…] వర్ణాశ్రమధర్మములను, వైదికకర్మములను విడుచుటచే వీరవ్ర[…] అని పీఠికయందు గలదు. ఇట్లుండగా వైదికవీరశైవమని యొ[…] కలదనుటయెట్లు?

ఉ॥ పీఠికయందట్లున్నమాటనిజమే. వారట్లు వ్రాయుట సా[…] సమెగాని ప్రమాణసిద్ధముగాదు. వర్ణాశ్రమధర్మములను విడుచుట[…] వ్రతమని యెందైనఁ గలదా? వీరశబ్దమున కీయర్థము విపరీతము[…] సహజముగాదు.

లోకమునందు వీరశబ్దము శూరులగు యోధులయందు ప్ర[…] గింపఁబడుచున్నది. వీరరసమునకు నాలంబనమైనవారు వీరులు.

ప్ర॥ వీరులు సంగ్రామములయందు వీరరసమును శై[…] యందు వినియోగింతురు. అట్లే వీరశైవులును తమయందుగల[…] రసమును మతాంతరులయందు వినియోగించుటచే వీరికి వీరశైవ[…] సంజ్ఞ కలిగెనా?

ఉ॥ ఇదియు విపరీతశంకయె. ఏలన, వీరరసమునకు స్థాయి[…] వము ఉత్సాహము. వీరలు దమయుత్సాహమును వైదికకర్మ[…] విడుచుటయందుగాని ఎదిరిమతములవారిని విధ్వంసము చేయుటయ[…] గాని వినియోగించుటచే వీరపదమేర్పడినదిగాదు. ఇంకేమన, పదము శైవపదముతో సామానాధికరణ్యము గలిగియున్నది. పదమునకైననో శివభక్తుఁడని యర్థము. వీరుఁడైన శివభక్తుఁడ[…] శివభక్తియందు అత్యంతోత్సాహముగలవాఁడనుట.

లోకమునందు వీరపతివ్రతయని పతివ్రతయందును వీరప[…] విశేషింపఁబడుచున్నది. అప్పుడు పాతివ్రత్యమున నుత్సాహ[…] రాలని యర్థముగ్రహింపవలయుగాని కడమవారిని కఱచునని[…] రక్కుననియో యర్థము గ్రహింపఁబడునా ?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇదిగాక, దానవీరుడు, ధర్మవీరుడు అని మొదలుగా వ్యవహారంబునుగలదు. అట్టియెడల దానగుణంబునను, ధర్మగుణంబునను నుత్సాహముగల వాఁడని యే యర్థమగుఁగాని కడమ దాతలను, కడమ ధార్మికులను జంపువాఁడని యర్థము గ్రహింపఁదగునా.

ప్ర॥ బసవేశ్వరాదులు తమమతముఁ జేరని మతాంతరులను వధించి వీరశైవమును నిల్పుటచే దానికాపేరు వచ్చియుండఁగూడదా ?

ఉ॥ మతప్రచారము చేయునప్పుడు ఎదిరిమతములవారిని జంపుటలో జంకుగల మతాచార్యులెవరు ? శంకరాచార్యులేఁదజునో జైన బౌద్ధాదులను గానుగలలో వేయించి శిక్షింపించినట్లు శాస్త్రములయందు లేదా? కావున వీరశైవమను పేరు కారణాంతరము చే వచ్చినదిగాదు.

ప్ర॥ వీరశైవులు ప్రాణలింగము లోపించెనేని గండకత్తెర వేసికొని చచ్చిపోవలసినదే కాని వారు జీవించియుండరాదు అని వ్రాసియున్నారు. ఇట్టి కఠినవ్రతములనుబట్టి వీరశైవమను పేరు కలిగియుండఁగూడదా?

ఉ॥ కఠినవ్రతములనుబట్టి యట్టిపేరు రాలేదు. వారికట్టి కఠినవ్రతములు గలవనుట యార్షధర్మములనెఱింగినవారికి వింతగలిగింపదు. వ్రతములే కఠినంబులు. వ్రతభంగమునందు భృగుపతనాదిమూలమున నామరణాంతప్రాయశ్చిత్తములను ధర్మశాస్త్రములయందు మహర్షులు విధించియుండిరి. గావున నిట్టివానిని వీరశైవాది లక్షణములుగా చేసిన పరిష్కారము స్వమతముగాని యెదిరిమతముగాని యేదియు నెఱుఁగనివారల కాలయాపనమునకు నుపయోగించునేగాని నిజము దెలుప నేమాత్రముపయోగింపదు.

ప్ర॥ పీఠికయందు 76 పేజీ, ఆంధ్రారాధ్య సంప్రదాయము పూర్వకాలమున నీశివాచార్యపరంపర వారిసంప్రదాయముగానె యుండెనని నేను దలంచుచున్నాఁడను. పెక్కువిధములఁ జూడగా నాంధ్రారాధ్యసంప్రదాయమిట్టిదిగా గానవచ్చుచున్నను లింగధార

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ణము, కరపీఠార్చనము, షట్థ్సల వివేకము మొదలగునవి వీరశైవసం[ప్ర]
దాయోద్భూతములు గొన్నికూడ గలసియుండుటచే వీరును వీరశై[వు]
లేమోయనియు సంశయము గల్గును. అనియు, 78 పేజీ, దహనసం[స్క]
స్కారము నేఁడాంధ్రారాధ్య సంప్రదాయమున లేదు. కాని రా[ను]
న్నాత్రమున వీరు వీరశైవులనఁగాదు. ఇటీవల వీరు లింగధారణముకో[సం]
బాటు ఖననసంస్కారముకూడ పరిగ్రహించియుండవచ్చును. అని[యు]
టచే నారాధ్యులు లింగధారణము, కరపీఠార్చనము మొదలగువానిని
మధ్యకాలమున జంగములనుజూచి పరిగ్రహించినట్లు సూచించు
చున్నారు. దీనికేమి చెప్పెదరు?

ఉ॥ ఆరాధ్యులు జంగములనుజూచి లింగధారణాము ప[రి]
గ్రహించిరనుట బ్రాహ్మణులు దేవాంగులనుజూచి యజ్ఞోపవీతధార
ణమును పరిగ్రహించిరనుటను, ఆర్యులు అహింసాధర్మమును బౌద్ధు
లనుజూచి పరిగ్రహించిరనుటను బోలియున్నది.

ఉత్తమధర్మమును నేరివద్దనుండి గ్రహించినను దోసఁగులేదు. [?]
శంకరాచార్యులవారు అద్వైతమును బౌద్ధులవద్దనుండి గ్రహించియుం
డిరిగదా?

ప్ర॥ శంకరాచార్యులవారు శ్రు॥ ఏకమేవాద్వితీయం బ్రహ్మ
ఈ మొదలగు శ్రుతులవల్లనుండి యద్వైతముగ్రహించిరిగాని బౌద్ధు
లనుజూచి గ్రహించిరా ?

ఉ॥ ఆరాధ్యులు శ్రు॥ నమోబ్రహణేధారణంమేఅస్తు అని[రా]
కరణం ధారయితాభూయాసం॥ లకు॥ అమృతస్యదేవధారణోభూయా
సం॥ ఈ మొదలగు శ్రుతులనుబట్టి లింగధారణము గ్రహించిరిగా[ని]
జంగమయ్యలనుజూచి గ్రహించిరా? లేదు. పీఠికాకర్తల మతమును
బట్టి యుక్తులు చెప్పవలసివచ్చెను. వీరియభిప్రాయమునుబట్టి యారా
ధ్యులు జంగమయ్యలను జూచియే లింగధారణము నవలంబించిరి
గ్రహింతము. జంగమయ్యలెవ్వరినిజూచి గ్రహించిరో ఆయంశము దే[?]

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మున్నచో బాగుండును. అది దెలిపియుండ లేదు. పాశుపతులు, కాలా
ముఖులనను వారికి లింగధారణ లేదనియె నిర్ణయించిరి. ఆరాధ్యులు
ర శైవులనుజూచి గ్రహించినవార లెగదా ? దీనింబట్టి లింగము ధరిం
చుట వీరశైవులకు వేరొకరితో పని లేదు. గాని కడమ వారికి మాత్రము
కావలయుగాబోలు! ఆహా! వీరశైవు లెంతధన్యులు ఈ శాస్త్రిలవారికి
అపరశైవులమీద నిట్టియనుగ్రహము గలుగ నేమి కారణమో తెలియదు.
దియుండుగాక, కరపీఠార్చనము కూడ వీరశైవధర్మమే యనిరి. పార్థివ
ంగమునకు నెందఱో స్మార్తులును కరపీఠార్చనమే చేయుచున్నారు.
హారాష్ట్రదేశమందంతటను బ్రాహ్మణులయందు కరపీఠార్చనమే
ప్రసిద్ధమైయున్నది. మాణిక్యప్రభువను సిద్ధుని మఠమునందు నే
నుకరపీఠార్చనమే జరుగుచున్నది. ఇట్టిధర్మములు జంగమయ్యల
దనుంచి గ్రహింపఁబడినవనుటకంటె సాహసము వేరొండుకన్పట్టదు.

ప్ర॥ తెలుగునాటియారాధ్యులు పూర్వకాలమున లింగధా
లుగారు. వీరు శివాచార్యుల సంప్రదాయము వారని పీఠికా
రలు వ్రాసియున్నారు. ఇందుమీయభిప్రాయ మేమి ?

ఉ॥ వీరు పూర్వకాలమునను లింగధారులేయగుదురు, గాన
ప్పుడును నారాధ్యసంప్రదాయము వారె! అట్లుగాక శాస్త్రిలవారు
ప్పినట్లులోకపక్షమున శివాచార్యసంప్రదాయము వారేయనియెంచు
ము. అట్లైనను లోపము గానిపింపదు. ఏలన, స్మార్తులు, వైష్ణవులు
న్నగువారైనను శైవదీక్ష గ్రహించినచో నారాధ్యులనుగా నె మెం
నప్పు సహజశివభక్తికలితులును పరమపాశుపతులనగు శివాచార్య
ప్రదాయము వారు లింగధారణదీక్ష గ్రహించియున్నచో బంగరు
సౌరభమబ్బినట్లెగదా ?

ఆశివాచార్యులును జగద్గురుత్వమును వహించినవారే యని
స్త్రిలవారే వారిని పెక్కువిధముల ప్రశంసించియున్నారు. వారు
ప్పవారు కానిండు. లేక సామాన్యులు కానిండు, దానికి మన
ప్పు డేమి చేయగలము ?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మన గోత్రర్షులు మహాతపోధనులని గర్వపడుదుమా? జన్మము లవిమర్శనీయములుగా నున్నవని విచారపడుదుమా?

దాననె మహాభారతము ప్రజాగరపర్వమున,

శ్లో॥ మునీనాంచ నదీనాంచ కులానాంచ మహాత్మనాం
ప్రభవోనాధి గంతవ్య స్త్రీణాం దుశ్చరితస్యచ॥

మునులయొక్కయు, నదులయొక్కయు, కులములయొక్క మహాత్ములయొక్కయు, స్త్రీలదుశ్చరితముయొక్కయు మూలము విమర్శింపగూడదనియున్నది. అయినను

ఈశాస్త్రిలవారు తెలుగునాటియారాధ్యుల పూర్వకాలస్థి మాత్రమేపరిష్కరింపఁ బూనిరో, అట్లుగాక వైష్ణవులు, అద్వైతు మొదలగువారి యందఱియొక్క పూర్వకాలస్థితినిగూడ పరిష్క బూనిరో, ఆపరిష్కారముల నే గ్రంథమున విశదీకరించిరో తెలియ

కల్పసూత్రకర్తలగు ఋషులు చాలవరకు నద్వైతమ ఖండించి ద్వైతమును సిద్ధాంతము సేసియున్న కారణమున పూర్వఋషి సంప్రదాయమువారందఱు నిజముగా ద్వైతు లేయని సికొని యద్వైతు లిప్పుడేమి మార్గమవలంబింతురో. ఆరాధ్య నను తమపూర్వులు లింగధారులుగారని వీరి పరిష్కారము గ్రహించి యట్టిమార్గము నే యవలంబింతురని గ్రహించుడు.

## పండితత్రయము-లింగధారణము గలదే?

ప్ర॥ తెలుగుదేశపువారగు పండితత్రయము (శివలెంకమం పండిత, శ్రీపతిపండిత, మల్లికార్జునపండితులు) లింగధారులన బలవదాధారములు నాకు గానరాలేదు. మల్లికార్జునపండిత ధ్యుల గ్రంథమున నెక్కడను లింగధారణప్రశంసయే లేదుగదా? పీఠికయందు గలదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దీనింబట్టి పండితత్రయమునకు లింగధారణలేదని స్పష్టమగుచున్నది. పండితత్రయమునకే లింగధారణలేనప్పుడు పూర్వకాలమున లింగధారణమున్నదనుటయెట్లు?

ఉ॥ పండితత్రయమునకు లేదని తేలినప్పుడుగదా పూర్వకాలమున నున్నదనుట యెట్లని మీరు సంశయించుట.

ప్ర॥ పండితత్రయమునకు నున్నదని దేనినిబట్టి ధ్రువపరుతురు?

ఉ॥ లేదని మీరు దేనినిబట్టి ధ్రువపరుతురు ?

ప్ర॥ పండితత్రయము లింగధారులనుటకు నాకు బలవదాధారములు గానరాలేదని పీఠికాకర్తలు వ్రాసియున్నారుగదా?

ఉ॥ బలవదాధారములు వారికి గానరాకున్నను మాకు గానవచ్చుచునేయున్నవి.

ప్ర॥ మీకుగానవచ్చిన బలవదాధారములెవ్వి ?

ఉ॥ వారు లింగధారులుగారనుటకు బలవదాధారములు గావలయుగాని వారులింగధారులనుటకు బలవత్తర ప్రమాణములతోబనిలేదు.

ప్ర॥ అదియేల ?

ఉ॥ పండితత్రయముయొక్క వంశమువారు పెక్కండిప్పుడును గలరు. వీరందఱు లింగధారులుగానేయున్నారు. దీనంబట్టి వీరి పూర్వులును లింగధారులేయని యనుమానప్రమాణముచే నేర్పడును. ఇదిగాక వీరు లింగధారులుగారని శాస్త్రిలవారొక్క ప్రమాణమునైనం జూపియున్నారా? లేదు. ఇట్లుండ, వీరు లింగధారులు గారనుట యెట్లు ?

ఇదిగాక పండితత్రయమనువార లప్రసిద్ధులుగారు. ద్వాదశ శైవాచార్యులలోఁ జేరినవారు. వారులింగధారిమతమును సిద్ధాంతము?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సేయుకున్నచో లింగధారిబ్రాహ్మణశాఖను నాచార్యకోటిలో నెట్లు సేరుదురు? వారిని నాచార్యులనుగా కడమవారెట్లులంగీకరింతురు? కాఁబట్టి పండితత్రయము లింగధారులేయనుట నిర్వివాదము.

ప్ర॥ అగుగాక, పండితత్రయము లింగధారులనుటకు నను మాన ప్రమాణములుగాక శబ్దప్రమాణములను గనఁబరుపగలరా!

ఉ॥ అవసరమైనచో నట్లే దెలుపఁబడును.

మంచెనపండితుఁడు లింగధారియే.

ప్ర॥ మొదట శివలెంకమంచన పండితుఁడులింగధారియనుటకు శబ్ద ప్రమాణమేమిగలదు?

ఉ॥ శివలెంకమంచెన పండితునిచరిత్రమే ప్రమాణము.

ప్ర॥ ఆచరిత్రమెందున్నది?

ఉ॥ సోమనాథకృతమగు బసవపురాణమునందె కలదు.

ప్ర॥ బసవపురాణముననున్న యాచరిత్రమున మంచెన పండి తుఁడు లింగధారియని బోధించు వాక్యమెద్ది?

ఉ॥ బసవపురాణము 198 పేజీ.

అక్కజంబుదంగ నన్యదర్శనుల ముక్కుపైఁ గత్తియ నెక్క మప్పుడ నెత్తించి 'వీరమాహేశ్వర పదమెయుత్తమ మీశ్వరుఁడొక్కండెకర్త యని ప్రతిష్ఠింపంగ నన్యదర్శనులు అని మొదలుగా గలదు. దీనింబట్టి వీరమాహేశ్వరపదమె యుత్తమమనియు, శివుఁడొక్కఁడే కర్తయనియు, మంచెనపండితుఁడు సిద్ధాంతము సేసినట్లు తెల్లియు చున్నది. ఆయన చేసినవానిలో మొదటి సిద్ధాంతము వీరమాహే శ్వరపద ముత్తమమని గదా? వీరమాహేశ్వరపదమునకు నర్థము తెలియునెడ నాసిద్ధాంతకర్త లింగధారి యగునో కాఁడో యను సంశ యము నివర్తింపకమానదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్ర॥ వీరమాహేశ్వరపదమునకు నర్థమేమి?

ఉ॥ వీరమాహేశ్వరుఁడన్నను, వీరశైవుఁడన్నను పర్యాయపదములె యగుఁగదా?

ప్ర॥ ఈయర్థము నెల్లరు నంగీకరింతురా?

ఉ॥ కడమ వారంగీకరించినను నంగీకరింపకున్నను పీఠికాకర్తలగు శాస్త్రులవారుమాత్ర మంగీకరింపకతక్కరని తోఁచెద.

ప్ర॥ అదియేల?

ఉ॥ బసవపురాణపీఠిక 74 పేజీయందు నీశాస్త్రులవారే వీరమాహేశ్వరుఁడనగా వీరశైవుఁడే యని యర్థము వ్రాసియున్నారు. దీనింబట్టి శివలెంకమంచెన పండితుఁడు కాశీపట్టణమునందు వీరశైవసిద్ధాంతముగావించినట్లు స్పష్టమగుచుండగా పీఠిక 79 పేజీయందు శ్లో॥ శివలింగం కరాద్యంగే వీరశైవస్తుధారయేత్॥ అను వచనమునుబట్టి లింగధారణము మాత్రమే వీరశైవాసాధారణధర్మమని పరిష్కరించిన శాస్త్రులవారు మంచెనపండితుఁడు లింగధారిగాడని యంగీకరింప సాహసింతురా?

ప్ర॥ మంచెనపండితుఁడు తాను లింగము ధరింపకయె లింగధారణసిద్ధాంతము సేసియుండఁగూడదా?

ఉ॥ అది సిద్ధాంతమేయగుచో నీవేల యాచరింపవని తన్నొరులడుగకుండనుగాన నట్టి తెలివిమాలిన పనికి సిద్ధాంతకర్తలు ప్రవర్తింపరు. కావున శివలెంకమంచెన పండితుఁడు లింగధారియే యనుట సప్రమాణము నిర్వివాదము నగును.

ప్ర॥ శివలెంక మంచెనపండితుఁడు సోమశంభుని మనుమడట గౌడదేశమున గోళకీ మఠమనుపేరనున్న గొప్పశైవాచార్య మఠమునకు సోమశంభువు భావశంభువు మొదలగువార లధిపతులని తెలియుచున్నది. సోమశంభువు తనపేర నొకపద్ధతిరచియించెను. దానినిబట్టి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యాతడు పాశుపతశైవసంప్రదాయమువాఁడని తెలియుచున్నది. కా
బట్టి యీయనమనుమఁడైన శివలెంక మంచెన పండితుఁడును శ్రీ
చార్య సంప్రదాయమువాఁడె యగుఁగాని లింగధారణగలవాఁ
గును?

ఉ॥ లోఁగడ మంచెనపండితుఁడు లింగధారియని సప్రమా
ముగా దెలుపఁబడియెను గాన సోమశంభునకు మనుమఁడైనను తా
లింగధారణము గ్రహించియుండవచ్చును.

ఇదిగాక, సోమశంభుని పద్ధతి యనుగ్రంథము మాత్రము
బట్టి సోమశంభ్వాదులు లింగధారులుగారని నిర్ణయింప నవుపడ
సోమశంభుఁడు మొదలగువారు శివాగమ పారదృశ్వు లగుటంజే
లోకోపయోగమునకై స్థావర పూజాపద్ధతులనుగూడ రచించియు
దురు. దాక్షిణాత్యులగు గురుకులులు తమకు స్థావరపూజా పద్ధ
మాత్రమె యుపయుక్తమైనదగుటంజేసి యద్దానిని మాత్రమెప్రచా
మునకుంచికొనియుందురు, గాన నీమాత్రమున వారు లింగధారు
గారనుట సహేతుకముగాదు.

మంచెనపండితుని వంశస్థులునేటికిని, లింగధారులుగా నుం
టను, మంచెనపండితుడు లింగధారియని చరిత్రలవలన నేర్పడుట
నాయనకు తాతలైన సోమశంభ్వాదులునులింగధారులేయయియుం
రని యూహించుటయె ఋజుపద్ధతియగును.

శ్రీపతిపండితుఁడు లింగధారియేయగును.

ప్ర॥ శ్రీపతిపండితుఁడు లింగధారియనుటయెట్లు ?

ఉ॥ చరిత్రలనుబట్టియె.

ప్ర॥ శ్రీపతి పండితునిచరిత్రమెవ్వరుచెప్పిరి ?

ఉ॥ కాశీనాథుని పీఠారాధ్యుఁడు శ్రీపతి పండితుని చరిత్ర
మును చెప్పియుండెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్ర॥ అందేమికలదు ?

ఉ॥ ధర్మగుప్తాభ్యుదయమున నీకథ నిట్లువివరించి చెప్పినాడని బసవపురాణ పీఠిక 64 పుటయందు.

గీ॥ అరయఁదత్పండితేంద్ర నిజాంశభూతి
భవులుశ్రీపతిమంచెనపండితులును
మల్లికార్జున పండితుఁడెల్ల జనులు
వినుతులొనరింప వెలసిరుర్వీతలమున॥

గీ. వారు భువి వీరశైవప్రవర్తనంబు
బ్రాహ్మణాచారమగునంచుఁ బత్యమాన
వేదవేదాన్తసిద్ధాంతవిశ్రుతముగఁ
దెలియఁజేయుచు విలసిల్లి రలఘు మహిమ॥

అని యిట్లు పీఠికాకర్త లుదాహరించిన పద్యములలోనె శ్రీపతి పండితాదులు వీరశైవధర్మాచరణము బ్రాహ్మణానుష్ఠేయ మేయని సిద్ధాంతము చేసినట్లున్నది.

పీఠికాకర్తల యభిప్రాయమునుబట్టి చూచినను లింగధారణము లేని వీరశైవసిద్ధాంతము సంభవింపదుగదా? దీనింబట్టి పండితత్రయము లింగధారులేయని స్పష్టమగుచున్నది.

తరువాత శ్రీపతిపండితుని చరిత్రమున,

సీ॥ సరవిఁ గృష్ణానదీస్నానంబుగావించి నిత్యకృత్యంబులు నెఱయఁదీర్చి
వచ్చుచోఁబురవీధివసుధేశుమదగజంబరుదేర దొలఁగుచునచటనొక్క
గొడగరి వాకిలిగడఁజొచ్చినిలిచిన నంతఁ దద్బ్రహ్మమేధియరుగుదెంచి
శరణార్థి,గురురాయసతతంబునావ్రతంబార్యవరయ్యలకుశివార్చనఁబు

గీ॥ దగసలుపుచుండ నొకయయ్య తక్కవమ్యొ। నేను లింగైక్యమిఁక
నాకు నిక్కమనిన। మంచిదని వాని వ్రత మొనరించి వేడ్క।
వచ్చు దేశికుఁగని పరవాదులుదిరి॥

అని మొదలగు పద్యములుగలవు. అందు

శ్రీపతిపండితుఁడు కృష్ణానదియందు స్నానముచేసి నిత్యకృత్య ములు దీర్చికొనివచ్చునెడ నెదురుగా మదగజంబొకటి వచ్చుచుండ గాంచి మొక్క గొడగరివాని వాకిట నొదిగి నిలిచియుండ నాయింటి వాఁడు వచ్చి శ్రీపతిపండితునకు మ్రొక్కి స్వామీ! నాకు ప్రతిదినము నార్వురు మాహేశ్వరుల నారాధించు వ్రతము గలదు. నేఁడొ మాహేశ్వరుండుదక్కువయ్యెను. నాకు వ్రతము జరుగనియెడ ల్రి క్కము తప్పదని వచింప నామహాత్ముఁడు దాని కియ్యకొని యాత వ్రతంబు నెరవేర్చి వచ్చుచుండగా పరవాదులు గాంచి యాశ్రీప పండితుండు గొడగరివాని యింటియందు భుజించెనని రాజునకు దెలిపి పండితునిం బహిష్కరించి పరవాదులకు నగ్ని మెసఁగమను నప్పండితేంద్రుండు (వీతిహోత్రు) నాకర్షణంబుజేసి తనమీఁదనున్న పట్టుపచ్చడంబునం బంధించి శైవగృహంబులందక్క కడమయిం నుండకుమని యానఁబెట్టి విజయవాటికాపుర మల్లికార్జునదేవు నా యదిగ్భాగముననున్న జమ్మికొమ్మకుం గట్టిన నంతఁ దద్గ్రామవా వ్యులగు ప్రతివాదులకు నగ్ని కరవగుటయు రాజుతోఁగూడ నందఱు శరణార్థులయి తచ్ఛిష్యులైరనియుఁ దెలియుచున్నది.

ఆర్వురు మాహేశ్వరులవ్రతము షట్స్థలములకు, షడ్లింగము లకును సంబంధించినదిగాన వీరశైవవ్రతమగుగాని వేరొకటిగానేర లింగధారి గానివాఁడీ వ్రతమున నుపయుక్తుఁడుగాడు గాన నీచరిత్ర ముంబట్టి శ్రీపతిపండితుఁడు లింగధారియేయని తెలియుచున్నది.

ప్ర॥ శ్రీపతిపండితుని చరిత్రము సంకేవరైన దెలిపియుండిరా

ఉ॥ సోమనాథుఁడు బసవపురాణముననుం, మల్లికార్జునపం తుఁడు శివతత్త్వసారముననుగూడ నీచరిత్రము జెప్పియుండిరి.

ప్ర॥ అదియెట్లు?

ఉ॥ బసవపురాణము 210 పేజీ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భక్తుండు శ్రీపతిపండితుం డీను భక్తుని కిలఁగోటిబ్రాహ్మణులైన నేనయన్న నాలుకనే గోసినైతుననుచు ననంతపాలుని సభాస్థలిని నెక్కొనగాఁ జండ్రవిప్రులుగాదె చక్కన పొత్తిపచ్చడమున ముడిచె. అనియు మల్లికార్జునపండితుఁడు శివతత్త్వసారమున

క॥ ఒక్కఁడెదైవముశివుఁడని
నిక్కము సేయుటకుముడిచె విప్రులుసీరన్
స్రుక్కక శ్రీపతిపండితు
డక్కజముగవిజయవాడనలజమ్మిశివా ॥

ప్ర॥ బసవపురాణము, శివతత్త్వసారము ననువానినిబట్టి శ్రీపతిపండితుఁడనంతపాలుని సభాస్థలమున ప్రతిజ్ఞసేసి జమ్మిచెట్టున నగ్నిని బంధించినట్లుమాత్రము దెలియుచున్నదిగాని యతఁడు లింగధారియని తెలియుచున్నదా ?

ఉ॥ బసవపురాణ శివతత్త్వసారములనుబట్టి యనంతపాలుని సభాస్థలిని చర్చఁజరిగినమీాద నగ్నిని బంధించెననిమాత్రము తేలినను నట్లు చర్చజరుగుటకును, నగ్నిని బంధించుటకును కారణము గొడగరివానిత్రవతము నెగ్గించుటయని గ్రంథాంతరములవలన దెలియుచున్నదిగానను, ఆయన లింగధారిగానిది యట్లునెగ్గించుట యసంభవము గానను శ్రీపతిపండితుఁడు లింగధారియనుట బసవపురాణ శివతత్త్వసారములకును సమ్మతమేయని స్పష్టమగుచున్నది.

ఇదిగాక, శివభక్తునకు గోటిబ్రాహ్మణులైన సరికారనివాదించి నట్లు బసవపురాణమువలనఁ దెలియుచున్నది. ఈవాదము భక్తుఁడైన గొడగరివానియొక్క యాధిక్యమును దెలుపనేయని విశదమగుచున్నది. ఈసందర్భములును గ్రంథాంతరోక్తచారిత్రమునె యనూదించుచున్నవి గాన శ్రీపతిపండితుఁడు లింగధారియేయని స్పష్టమగుచున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## మల్లికార్జునపండితుఁడు లింగధారియేయగును.

### ప్రథమప్రమాణము.

ప్ర॥ మల్లికార్జునపండితుఁడు లింగధారియనుటకు నేమిప్రమాణము ?

ఉ॥ సోమనాథుడురచించిన మల్లికార్జున పండితారాధ్య చరిత్రమే ప్రమాణము.

ప్ర॥ అందు మల్లికార్జున పండితుడులింగము ధరించినట్లు గలదా?

ఉ॥ భవహారుసాత్త్వదభవు జితభావ । భవుశివు శ్రీకోటియారాధ్యదేవు శ్రీపాదు కేందీవరంబులకు । భావం బెలర్పనర్పణమారించి । పడసిప్రాణార్పణప్రాణలింగంబు ॥ అనుటచే లింగమూధరించినట్లును, మఱిలింగధారణమహిమ వేదముల నెఱుగరె సకలదా నెయ్యవియనిన॥అను మొదలగు ద్విపదలచే మల్లికార్జున పండితుఁడు లింగధారణసిద్ధాంతము చేసినట్లును స్పష్టమగుచున్నది.

ప్ర॥ పీఠికాకర్తలు మల్లికార్జున పండితారాధ్యుల గ్రంథములనెక్కడను లింగధారణప్రశంసయే లేదుగదా? అని వ్రాసియున్నారు. మల్లికార్జునపండితుఁడు లింగధారియే యైనచో తానురచించిన శివతత్త్వసారమున లింగధారణసిద్ధాంతము నేలసేయకుండును ? దీనిబట్టి యాయనకు లింగధారణము లేదని స్పష్టమగుచున్నది. సోమనాథుఁడు మల్లికార్జునపండితునకు లింగధారణముండునని యూహించి తానులింగధారిగాన యాయనయు లింగధారియనియో వ్రాసియుండ వ్రాయునగును.

మల్లికార్జునపండితుఁడు లింగధారి యగునా కాఁడా యనుసంశయము గలిగినప్పుడు ఇతరుఁడు చేసిన గ్రంథముకంటె మల్లికార్జునపండితుని గ్రంథమునకే యెక్కువ ప్రామాణ్యముండునుగదా? శివతత్త్వసారమునుబట్టి మల్లికార్జునపండితుఁడు లింగధారి కాఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్పష్టమగుచుండగా సోమనాథకృతులనుబట్టి యాయన లింగధారియని నిర్ణయించుట యెట్టులుచితమగును?

ఉ॥ ఇది యెట్టు లుచితమో యవధానముతో వినుము. శివతత్త్వసారమునుబట్టి మల్లికార్జునపండితుఁడు లింగధారి కాఁడని యేర్పడదు. ఏలన, శివతత్త్వసారము సంపూర్తిగ్రంథము లభింపనేలేదని ప్రకాశకులు తెలిపియున్నారు. ఇట్లుండ అసంపూర్ణమగు గ్రంథమును బట్టి గ్రంథకర్త లింగధారిగాఁడనుట న్యాయ్యముగాదు.

ఇదిగాక సంపూర్ణగ్రంథమున లింగధారణప్రశంస లేకున్నను నామాత్రమున మల్లికార్జునపండితుఁడు లింగధారి కాఁడనఁగూడదు. ఏలన,

కల్పసూత్రకారులైన పదునెనమండ్రు మహర్షులలో నొక్క బోధాయనుఁడుతక్క యజ్ఞోపవీతమును విధించినవాఁడె లేఁడు. ఈకారణమున కడమమునులందఱకు యజ్ఞోపవీతధారణము లేదని నిర్ణయింపనగునా?

అదిగాక, మల్లికార్జునపండితుఁడు శైవదీక్షను వివరించియె యుండెను, అది లింగధారణదీక్షయే యని యేలగ్రహింపరాదు?

మఱియు మల్లికార్జునసేపండితకృతినిబట్టి పీఠికాకర్తలు మల్లికార్జునపండితుఁడు లింగధారి కాఁడని నిర్ణయించుచున్నారో ఆశివతత్త్వసారమును, సోమనాథుఁడు చూడకుండెనా? చూచియుండినచో దానినిబట్టి గ్రంథకర్త నిజస్థితి యాయనకుమాత్ర మెట్లు తెలియకుండును? తెలిసినప్పుడు నిజముగ్రహింపఁజాలక మల్లికార్జున పండితుని చరిత్రమునూహించి వ్రాయవలసిన గ్రహచార మాయనకేలపట్టెను?

ప్ర॥ నిజము దెలిసినను సోమనాథుడు తాను లింగధారిగాన మల్లికార్జునపండితుఁడును లింగధారియేయని కల్పించి వ్రాసియుండఁగూడదా?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ॥ అసత్యదోషమును మహనీయుఁడగు సోమనాధునిపైఁ పించుట మహాసాహసము.

లింగధారిగాని మల్లికార్జున పండితుని లింగధారినిగా గ్ర సోమనాధునకేమియవసరమువచ్చెను. చరిత్రముఁ వ్రాయ నాత నిజమైన లింగధారి యెక్కడనుదొరకఁడయ్యెనా ?

లేనివానికి లింగమున్నదని గల్పింపఁజూచినచో నట్లు గము లేనివా రెందఱు లేరు ? మల్లికార్జునపండితునకే గల్పిం మఱియు సోమనాధుఁడు పండితారాధ్యచరిత్రమునందు

భవిగృహక్షేత్రాది పథవర్జితుండ, భవిజనదర్శనస్పర్శ నా వివిధదానాదాన విషయదూరగుడ॥ ననుటచే భవిజనముయొక్క నము, స్పర్శనము, ఆలాపము మొదలగునవి లేనివాఁడనని వ్రా యుండెను. ఆయనకేమల్లికార్జున పండితుఁడు లింగధారి కాఁడని యున్నచో గలలోనైన నీయననుగూర్చిన ప్రస్తావమునిచ్చగించు అట్టివాఁడు నాలుగునూర్ల పుటల కధికమగు గ్రంధముతో భవి వర్ణించును ? కావున మల్లికార్జున పండితుఁడు లింగధారి కా చారిత్రవిరుద్ధము.

ఇదిగాక మల్లికార్జునపండితుఁడు మనకంటె సోమనా చాలసమీపకాలమువాఁడు, కావున నాయనకుఁ దెలిసినదే నిజ విశ్వసింపకతీరదు.

పీఠిక 6 పుట,

1168 లో బసవేశ్వరుఁడు లింగైక్యమందెను. 1170 కే తారాధ్యుడును లింగైక్యమందియుండును.

ఇట్టి పండితారాధ్యులవారి శిష్యునితో సంభాషించి పురాణకథార్థముల నెఱిఁగిన పాల్కురికి సోమనాధుఁడు 1190

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ములకంటెఁ దర్వాతివాఁడైయుండఁడు. అది రుద్రదేవుని పరిపాలన కాలమేకదా?

మఱియుఁ బండితారాధ్యులవారు లింగైక్యమందినపిదప వారి శిష్యుఁడైన దోనమయ్య, వారిప్రథమపుత్త్రుఁడైన కేదారయ్యకు లోకారాధ్య పట్టముఁగట్టి తాననర్గళముగా భక్తిరాజ్యమేలుచున్న ట్లును, కేదారయ్యయు నలుగురు పుత్త్రులంగాంచి వంశాభివృద్ధిలో నున్నట్లును బండితారాధ్యచరిత్రమునఁ గలదు. పాల్కురికి సోమనాథుని పండితారాధ్యచరిత్రరచనాకాలమునకుఁ బండితారాధ్యులవారి శిష్యుఁడును, బుత్రుఁడును సజీవులైయున్నారని మనుమలు పేర్వెలయుచున్నారని దీనివలన నేర్పడుచున్నది. సోమనాథుని గ్రంథములలోఁ బండితారాధ్యచరిత్ర కడపటిది. ఈసాధనమును బట్టిచూచినను బండితారాధ్యుల లింగైక్యమునకుఁ దర్వాత నిర్వది ముప్పది యేండ్లకే రుద్రదేవుని పాలనకాలముననే (ఇంచుమించుగా 1190) సోమనాథుఁడు ప్రసిద్ధగ్రంథకర్తయైనట్లు స్పష్టమగుచున్నది. అనియున్నది.

పండితారాధ్యుల లింగైక్యమున కిరువది ముప్పదియేండ్లకే పండితారాధ్యుల శిష్యుఁడు, పుత్రుడును సజీవులైయుండగనే సోమనాథుఁడు లింగధారణలేని పండితారాధ్యునకు లింగధారణ మున్నదని యెట్లువ్రాయును. ఇట్టి యసత్య చరిత్రమునకు పండితారాధ్యుని శిష్యపుత్రాదులెట్లు సమ్మతింతురు? ఆగ్రంథము లోకమున నెట్లు ప్రకాశము నొందఁగలుగును? కాఁబట్టి సోమనాథుఁడు మల్లికార్జునపండితునకు లింగధారణము లేనిదే కల్పించి వ్రాసెననుట కల్ల. దానంజేసి మల్లికార్జునపండితుఁడు లింగధారియేయగుట యథార్థము.

ద్వితీయ ప్రమాణము. (2)

ఇదిగాక పీఠిక 5 పుట.

జంగమరత్నంబు శరణసమ్మతుఁడు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లింగైక్యవర్తి గతాంగవికారి
పండితారాధ్య కృపాసముద్గతుఁడు
మండితసద్భక్తి మార్గప్రచారి
విలసితపరమ సంవిత్సుఖాంభోధి
నలిఁగరస్థలి సోమనాథయ్యగారు

మొదలగు భక్తులనువేడి బసవపురాణ కథా వృత్తాంతము దానుదెలిసికొన్నట్లు సోమనాథుఁడు బసవపురాణమునఁ జెప్పి యున్నాడు. మీఁది ద్విపదలలోఁ గరస్థలి సోమనాథయ్య పండితారాధ్య కృపాసముద్గతుఁడనికలదు. పండితారాధ్యుల వారిశిష్యుఁడనియేని దీని తదనుగ్రహమున జనించిన వాఁడనియేని దానికర్థమగును. తచ్ఛిష్యుఁ డనుటే యుక్తతరము. పండితారాధ్యుఁడనగా మల్లికార్జున పండితా రాధ్యుఁడే ఆయనశిష్యుఁడైన కరస్థలి సోమనాథయ్యకుఁ బాల్కు సోమనసమకాలమువాఁడని దీనివలన నేర్పడుచున్నది, అనియున్న

దీనింబట్టి కరస్థలి సోమనాథయ్య మొదలగువారివలన సో నాథుఁడు పూర్వవృత్తాంతముల నెఱిఁగియున్నట్లును, కరస్థలి సో నాథయ్య మల్లికార్జునపండితారాధ్యుని శిష్యుఁడనియు విశదమగు న్నది గదా.

జంగమరత్నంబు శరణసమ్మతుఁడు. ఈ మొదలగు విశేష లనుబట్టి కరస్థలిసోమనాథయ్య లింగధారియె యనుట నిస్సంశయ

ఇట్టి సోమనాథయ్యకు గురువైన మల్లికార్జున పండి లింగధారి కాఁడనుట పరిహాసావహము కాదా? కావున పండి లింగధారి కాకమానడు.

## తృతీయ ప్రమాణము. (3)

ప్ర॥ పీఠికాకర్తలు మల్లికార్జునపండితునిగూర్చి పీఠిక 74 పుట

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మల్లికార్జునపండితారాధ్యులకు బ్రాహ్మణ్యము మీద నాస్థగలదు. వర్ణాశ్రమధర్మనిబంధనము మీద దత్పర్యము గలదు. శివభక్తియందు దన్మయత్వము గలదు. బసవేశ్వరుఁడు మహాశివభక్తుఁడని యాయన యెడల నద్భుతగౌరవమును, వైదికకర్మలను గర్హించి వర్ణాశ్రమాచారములను రూపుమాపుచున్నాఁడని యత్యప్రీతియుఁ గాంచినవాఁడై బసవేశ్వరుని దర్శించి వాదించుటకై పోవుచుండఁ ద్రోవలో దన్మృతివార్తవినవలసెననియు, భక్తిమీఁద నలపుఁ బ్రాహ్మ్యంబుతోఁ బొత్తుఁ బాయలేను నేను బసవలింగ అనియాయన చెప్పెననియుఁ బ్రతీతికలదు. దీనింబట్టికూడ నాతఁడు బసవేశ్వరుని మతమువాఁడుకాఁడని స్పష్టముగా నెఱుగనగును. అని వ్రాసియున్నారు. దీనింబట్టి మల్లికార్జున పండితుఁడు లింగధారి కాఁడని తెలియుటలేదా ?

ఉ॥ ఆచరిత్రముంబట్టి బసవేశ్వరమతమువాఁడు కాఁడని తెలియుఁగాని లింగధారిగాఁడని యేర్పడదు. బసవేశ్వర మతము వాఁడు గానిచో లింగధారణముండదను నియమమెందును లేదు. ఆది వైదిక వీరశైవమునను నుండునని వివరింపఁబడియెనుగదా?

మఱియు నీచరిత్రముఁబట్టియు మల్లికార్జునపండితుఁడు లింగధారియనియె యేర్పడును. ఎట్లన బసవేశ్వరునకు పండితునకును వర్ణాశ్రమధర్మములయెడనె మతభేదముగలదని యీయైతిహ్యమును బట్టి దెలియుచున్నది. అది యిరువురులింగధారులైననే సంభవించును, అందు వేఱొక్కరు లింగధారిగానిచో లింగధారణంబును మతభేదమూలమైయుండునుగదా ? కావున నిరువురును లింగధారులైనను వర్ణాశ్రమధర్మమునెడనే వారికి నభిప్రాయభేదము గలదని యేర్పడుచున్నది.

## తురీయప్రమాణము (4)

ప్ర॥ శివతత్త్వసారమునుబట్టి మల్లికార్జునపండితుఁడు లింగధారియని నిరూపింపశక్యమగునా ?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ॥ వలయునో నదియునొక్యమే. ఎట్లనశివతత్త్వసారము.

క॥ జంగమ లింగంబగు భ
క్తుంగని పూజింపడేం గోటివిధములన్
లింగార్చనచేసిన వృథజంగము
ముత్తమముగాన స్థావరమునకున్ ॥

అను పద్యమున మాహేశ్వరుని జంగమలింగముగా భావించి పూజింపవలయునని యున్నది. ఈ భావము లింగధారులకో దక్క యన్యులయందు నసంభవము. దీనింబట్టి మల్లికార్జునపండితుఁడు లింగధారియని యేర్పడును.

ప్ర॥ భక్తుఁడు జంగమలింగమనుట లింగధారణ సిద్ధాంతగతమే యనుట సర్వసమ్మతమగునా?

ఉ॥ ఇట్లనుట సర్వసమ్మతమైనను గాకున్నను వీరికాకర్తలకు సమ్మతమే. "పీఠిక 74 పుట. వీరశైవులు జంగమునైన (చరించునట్టి) శివలింగము లేయని వీరశైవగ్రంథములు పలుకుచున్నవి. అని వారే వ్రాసియున్నారుగదా? దీనింబట్టి శివతత్త్వసారకర్త లింగధారి యని స్పష్టమగుటలేదా ?

పంచమ ప్రమాణము. (5)

ఇదిగాక శివతత్త్వసారము 82 పేజీ.

క॥ కుసుమశరారీ శివలిం
గసమేతులు దక్కఁబొందఁగావొగి నిర్మా
ల్యసుఖంబని బండారువు
బసవన విసమెత్తిరాని బ్రతుకేఁడె రుద్రా ॥

అనుపద్యమున శివలింగధారులుదక్క శివనిర్మాల్యము నను భవింపరాదని చెప్పె బసవేశ్వరుఁడు విసముద్రావిన వృత్తాంతమునను

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బాదించెను తాను శివలింగధారిగానిచో నీచరిత్రము నెట్లుదాహ రించును ?

ప్ర॥ బసవేశ్వరునిచరిత్రము నుదాహరించినమాత్రన శివతత్త్వ సారకర్త లింగధారియని యెట్లు విశ్వసింపవలయు?

ఉ॥ అంతు బసవేశ్వరునిచరిత్రము నుదాహరించుటమాత్రము గాదు. వేఱొకవిశేషముగలదు ఏమనిన, మల్లికార్జునపండితుఁడు తాను శివనిర్మాల్యము ననుభవించువాఁడనుట స్పష్టము. అట్లు కానిది తన గ్రంథమున శివనిర్మాల్యముభోజ్యమని సిద్ధాంతము చేసియుం డునుగదా?

ఎటనైన లింగధారణలేనివాఁడు తాను శివనిర్మాల్యము భుజిం చుచు తన్నుంబోలువారలకు శివనిర్మాల్యము భోజనీయమే యని సిద్ధాంతముసేయుచు 'లింగధారణలేనివాఁడు శివనిర్మాల్యము భుజిం పఁగూడదను వాదము నంగీకరించునా? అట్టిచో నిట్టివాదమును గాక వినముద్రావి ప్రత్యక్షనిదర్శనముచూపి యీ వాదమును దృఢపరిచిన బసవేశ్వరచరిత్రమునుగూడ తన గ్రంథమున నిబంధింపఁబూనునా?

కాఁబట్టి శివతత్త్వసారమునుబట్టి గ్రంథకర్తయగు పండితుఁడు లింగధారియేయనుటయుచితము. అయినను ఆగ్రంథకర్త లింగధారి గాడని యన సాహసింపఁబూనినచో దానిచే నంతమాత్రమెగాక యతఁడు పండితుఁడునుగాఁడనియే యంగీకరించినట్లగు.

ప్ర॥ శివతత్త్వసారకర్త భక్తునకు శివనిర్మాల్యము గ్రాహ్య మని సిద్ధాంతము సేసియుండెను. అంతమాత్రమున లింగధారియనుట యెట్లు?

ఉ॥ శివనిర్మాల్యముసిద్ధాంతముసేయునప్పుడుశివతత్త్వసారము ౯౯ పుట.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క॥ గురుకృతశివదీక్షమెయిన్
విరహితమలదేహులగు పవిత్రులు భక్తుల్
హరనిర్మాల్యము గుడుతురు
పరమేశ్వరునందు దాసభావముతోడన్ ॥

అనుటచే గురునిచే నొసంగబడిన శివదీక్షచే త్రిమలములు నశించినకతన పవిత్రులైన భక్తులు శివనిర్మాల్యమును భుజింపనగునని యున్నది. ఈగ్రంథము యొక్క పూర్వోత్తర సందర్భములనుబట్టి యీశివదీక్ష లింగధారణదీక్షయేయని విశదమగుచున్నది.

అట్లుగాక, కేవలభక్తులని గ్రహించినను లింగధారులే యని లోకవ్యవహారమువలన నేర్పడును. దాననే బలిమికి లింగముగట్టిన భక్తుడగునా అనుసామెత ప్రవర్తించినది. లింగధారణ లేనివారు కొందఱుభక్తులున్నను నీసామెత లింగధారణము భక్తలక్షణములలో ముఖ్యమను నర్థమును బోధింపకమానదు.

మఱియు, శివతత్త్వసారమున శివాచారము, భృత్యాచారము మొదలగు సంప్రదాయములును, శివభక్తుడు కులహీనుడైనను సర్వోత్తముడనుటయు, శివనిందకుల జంపవచ్చునను నిర్ణయము మున్నగు పెక్కునంశములు గ్రంథకర్త లింగధారి యనుటనే విశద పరుచుచున్నవి. కావున, మల్లికార్జునపండితుడు లింగధారియే యనుట బహుప్రమాణసిద్ధము.

## ఉద్భటుడు లింగధారియే.

ప్ర॥ ఉద్భటునకు లింగధారణమున్నదనుటకేమి ప్రమాణము?

ఉ॥ ఉద్భటునకు లింగమున్నదనుటకు నుద్భటరాధ్యచరిత్రమె ప్రమాణము.

ప్ర॥ దాని నెవ్వరు రచించిరి?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ॥ తెనాలి రామలింగ కవి రచించెను. మఱియు నీగ్రంధము చు నీపీఠికాకర్తలె పరిష్కరించి యుండిరి. అందు నుద్భటునకు లింగధార ణము గలదను నెడసంశయము నైన వెలిబుచ్చియుండిరా లేదు.

ప్ర॥ పీఠిక 77 పుట:—ఉద్భటుడు భోజునకు దీక్షాగురుడని పండితారాధ్య చరిత్రముునను నుద్భట చరిత్రమునను గలదు. భోజుడు రచించిన శైవతంత్రము తత్త్వప్రకాశము నేడు సుముద్రితము లైయున్నవి. అందు నేటి యారాధ్య సంప్రదాయ విషయము లేవియు గానరావు. గోళకీమఠ సంప్రదాయము వారు లిమ గ్రంధములయందు భోజుని గ్రంధములను ప్రమాణముగా గొనియున్నారు. ఉద్భటుఁడీ భోజనకు గురువేయగు నేని యాతడు నేటియారాధ్య సంప్రదాయము వాఁడుగా నేరఁడు. ఆయుద్భటుని వంశమువారగు నాంధ్రారాధ్యులు గూడ భోజ గ్రంథగోళకీమఠాచార్యకృత గ్రంధోపదిష్టమగు వైదిక శైవసంప్రదాయము వారేయగుదురు. అవి వ్రాయఁబడి యుండుటచే నుద్భటుడు లింగధారి గాడని యేర్పడుట లేదా?

ఉ॥ ఉద్భటుడు భోజుని గురువేయని యుద్భటారాధ్యచరి త్రమువలన దెలియుచున్నది. ఐనను శైవతంత్రాదులరచించిన భోజుఁ డెవరో ఉద్భటునకు శిష్యుడైన భోజుఁ డెవరో నిర్ణయింప నశక్యము అట్లుగాక శైవతంత్రాదులు రచించిన భోజుఁడె యుద్భటుని శిష్యుడై నను తానంగీకరించిన లింగధారణ సిద్ధాంతమును తారచించు గ్రంధ ములలో నెల్ల వ్రాయవలయునను నియమముండమిగాన శైవతంత్రా దులలో లింగధారణ సిద్ధాంతము లేనిమాత్రన నాతని కెగాక యాతని గురునకు గూడ లింగధారణము లేదని యనుమానించుట యసంగ తము. ఎవడో భోజుడు రచించిన శైవ తంత్రాదులలో లింగధార ణము లేదని చెప్పి యంత మాత్రన భోజునకు గురువైన యుద్భటునకు లింగధారణము లేదని యనుమానించుటయు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గోళకీమఠమువారు లింగధారులు గారనియెంచి వారు భోజు గ్రంథముల ప్రమాణీకరించిరి గాన భోజునకు గురువైన యుద్భటు కును లింగధారణము లేదనుటయు బలవత్తరాధారములు గాని వారిక్ దోచినవి గాబోలును.

ఇందుఁ జూడుడు.

ఇప్పటి యారాధ్యులును నప్పయదీక్షితులవారి గ్రంథముల ప్రమాణముగా గ్రహింతురు. ఇట్టియెడ అప్పయదీక్షితులవారికి లింగ ధారణము లేదుగాన వారి గ్రంథములఁ బ్రమాణముగా గ్రహించిన యిప్పటి యారాధ్యులకును లింగధారణము లేదని సాధింతురా? అట్లు గాక, అప్పయదీక్షితులవారి గ్రంథములను లింగధారులు ప్రమాణ ముగా గ్రహించిరిగాన నప్పయదీక్షితులవారికిని లింగధారణము గల దని సాధింతురా! ఇట్లు సాధించిన నిర్ణయము యథార్థమగునా! కావున నీయనుమానములు మానములుగాఁజాలవు. ఇదిగాక, ఉద్భట వంశ్యులగు ముదిగొండ వారుపూర్వకాలమునుండి లింగధారులుగా నుండిరి గానను వీరికి కూటస్థుఁడగు నుద్భటుఁడు లింగధారియే యనుట స్పష్టము.

పీఠిక 77 పుటయందు,

ప్ర॥ క్రీస్తు శ॥ ౧౩౫౦ నుండి ౧౪౫౦ దాక సుప్రఖ్యాతులు గానున్న కొండవీటి రెడ్లు, తన్మంత్రులు శైవమతాభినివిష్టులుగానుండిరి. వారికిని వారి మంత్రియగు మామిడి ప్రెగ్గడయ్యకును శంకరారా ధ్యులనువారు గురువులుగానుండిరి. ఆశంకరారాధ్యులకే పెదకోమటి వేమారెడ్డి పినపాడను గ్రామము నగ్రహారముగా నొసగెను. దానికి శాసనముగలదు. తెనాలిదగ్గఱ బినపాటిలో నేఁడా శంకరారాధ్యుల వారివంశమువారు మృత్యుంజయారాధ్యులు గలరు. వీరిది యుద్భటా రాధ్యవంశమట! కాని వీరికి లింగధారణము లేదు. బహుకాలమున

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నుండి సుప్రఖ్యాతమైయున్న యీవంశమువారు లింగధారులు గాకుండుట వింతగాదా? అని వ్రాసియున్నారు. దీనింబట్టి యుద్భటారాధ్యవంశోద్భవులు కొందఱు లింగధారణ లేనివారుగానున్నారుగాన దీనింబట్టియుద్భటునకు లింగము లేదని విశదమగుట లేదా?

ఉ॥ ఉద్భటవంశ్యులగు పినపాటివారికి నేడు లింగధారణము లేదను కారణమున నుద్భటునకు లింగధారణము లేదని సాధింపం బూనుట యుచితముగాదు. ఏమనఁగా ఉద్భటవంశ్యులగు ముదిగొండవారు నేడు, నూర్లకొలది కుటుంబములవారు గలరు. ఇట్లుండ నత్యధికసంఖ్యాకులగు తద్వంశీయులనుబట్టి మూలపురుషునకు లింగధారణముగలదని యనుమానించుట న్యాయ్యమో? అత్యల్పసంఖ్యాకులగు పినపాటి వారిని బట్టి మూలపురుషునకు లింగధారణము లేదని సాధించుట న్యాయ్యమో బుద్ధిమంతులె గ్రహింపగలరు. ఏకారణముననైన లింగధారణము వారికి లోపించియుండుటయె సంభావితము. లింగమునుధరించుట కన్న దానిని విడుచుట సులభము. దాననె ఇప్పుడెన్ని కుటుంబములవారో లింగధారణము మానుచున్నారు. క్రొత్తగా ధరించు వార లరుదుగదా? నిజమిట్లుండ నుద్భటునకు లేనిదే తద్వంశ్యులలో మధ్యకాలమున శతసంఖ్యాకులు లింగము ధరించి రనుట సంభావితమో, అల్పసంఖ్యాకులు మానివేసిరనుట సంభావితమో బుద్ధిమంతు లూహింతురుగాక.

ప్ర॥ పినపాటివారికి మొదటినుండి లింగధారణము లేదని పీఠికా కర్తలు వ్రాయుచున్నారు. వారికి మధ్య కాలమున లింగధారణము లోపించినదని మీరభిప్రాయపడుచున్నారు. ఇందు నిజమేదని గ్రహింప వలయు.

ఉ॥ ఉద్భటారాధ్య వంశ్యులమని వారు పేర్కొనుచున్న కారణమునను, ఉద్భటవంశ్యులు పెక్కురు లింగధారులుగానున్న కతనను వీరికి మధ్యకాలమున లోపించిన దనుటయె నిజము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్ర॥ మధ్యకాలమున లోపించుటకు కారణమేమి?

ఉ॥ లింగధారణలేని వారితోఁగల సంబంధమె కారణమనుట విశదమే. నేడనేకులట్టి సంబంధవశమున లింగధారణము మానివేయుచుంట కన్పట్టుచున్నదిగాదా?

ప్ర॥ పినపాటివారు నడుమ లింగధారణము మానివేసిరని నమ్ముటకు వీరికి తొల్లిధారణము గలదని యెందేనిఁగలదా? అది లేనిచో వీరు నడుమ మానిరనుట యెట్లు?

ఉ॥ పినపాటివారి యొద్దయందు వారి పూర్వులచరిత్రములఁ జెప్పు గ్రంథములు గలవు. వానిలో వారు లింగధారులెయనియు నిత్యము శివరాత్రి వ్రతము మొదలుగా శైవవ్రతముల నవలంబించినవారనియు శ్లో॥ భీమలింగ ధరణాదిపు భీమ। ఈమొదలగు శ్లోకములు బోధించుచున్నవి. కావున పినపాటివారు పూర్వకాలమున లింగధారులనుట నిక్కము.

ప్ర॥ అట్లైన వారి చరిత్రములను వీరికాక ర్త లెఱుఁగరా?

ఉ॥ బాగుగా నెఱుఁగుదురు.

ప్ర॥ ఎఱిఁగియున్నచో వారికి ధారణము లేదని యెట్లువ్రాయుదురు?

ఉ॥ వారికి లింగధారణమున్నదనియె వ్రాసిరి.

ప్ర॥ ఏగ్రంథమునందు వ్రాసిరి?

ఉ॥ బసవపురాణపీఠికా కర్తలగు శాస్త్రులవారే. శృంగారశ్రీనాథమను గ్రంథము 119 పుటయందు పినపాటి తామ్రశాసనము వివరించునప్పుడు,

"ఇందుఁ బ్రతిగ్రహీతయగు శంకరగురువంశమువారు ఇప్పుడు పినపాటివారందున్నారు. వారుద్భటారాధ్యసంతతివారట. కొన్ని పూర్వ పాంతరములనుండి వారు, లింగధారణము వర్జించినారు" అనిరి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బట్టి పినపాటివారు పూర్వము లింగధారులేయని పీఠికాకర్త లంగీకరించిన యంశమే.

ప్ర॥ వారాగ్రంథము వ్రాయునాటికి నుద్భటుని నిజస్థితి దెలియమిచే నుద్భటుడు లింగధారియే యనియెంచి తద్వంశ్యులగు పినపాటివారికి నేడు లింగధారణము లేమిగాన నదియు వర్జించియుందురను నూహతో వ్రాసియుందురు. ఇప్పుడు విమర్శింపగా నుద్భటునకే లింగధారణము లేదని తెలిసెనుగాన దానింబట్టి పినపాటివారికి నెన్నడును లింగధారణమే లేదని వ్రాసియుండఁగూడదా?

ఉ॥ అవధరింపుడు. ఉద్భటునకు లింగధారణము లేదనుటకు నీవు వ్రాసిన కారణములు బలవత్తరములేయైనచో నట్లె భావింపవలయు. విమర్శింపగా నివి దుర్బలములుగానున్న కారణమున శృంగార శ్రీనాథము రచించునాటికి లింగధారణము పూర్వాచారసిద్ధము కాదని సిద్ధాంతముచేయు కుతూహలము వీరికి లేదుగాన నట్లు వ్రాసియు, ఈనడుమగల్గిన కౌతుకముచే నుద్భటవంశ్యులగు పినపాటివారికి ధారణము లేదుగాన నుద్భటునకును లింగధారణము లేదని స్వవచన విరుద్ధముగా సిద్ధాంతము సేయసమకట్టిరనియు, విమర్శింపగా నీసిద్ధాంతము కొందఱ బ్రహ్మసామాజికులగు నేటివిప్రులనుబట్టి వీరిపూర్వులకును యజ్ఞోపవీతధారణము లేదను వాదమును బోలియున్నదిగాన నసమంజసమనియు విశదమగుచున్నది.

ప్ర॥ పీఠిక 78 పేజి. బసవేశ్వరుని కాలమునుండి యాంధ్ర దేశారాధ్యులు వీరశైవులై లింగధారులైయుండరేని కర్ణాటదేశమున బోలె వీరికిని మఠములు గురుపరంపరలును నుండెడివి. ఆంధ్రదేశమున గోళకీమఠ సంప్రదాయమువారి మఠములే యుండెడివి గాని నేటి యారాధ్యసంప్రదాయమువారి మఠములెన్నడునున్నట్లు దెలియరావు. పండితత్రయోద్భటారాధ్య వేమనారాధ్యాది వంశపరంపరల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వారాభిజాత్యముగల వారారాధ్యసంప్రదాయములవారు పలువుర
వెలయుచున్నను లింగధారణాదిదీక్షలు గొనుటలో గురువంశములు,
శిష్యవంశములు సను భేదములేక వీరిలో నెల్లరును సమానసమ్మా
నము నె పడయుచున్నారు. బహుకాలమునసుండియు నిట్టి సంప్రదా
యమే సాగుచున్న చో నిప్పుడు లేకున్నను పూర్వకాలమున నేని యట్టి
మతము లుండకపోవునా యని సంశయము. అని పీఠికాకర్తలు
వ్రాసియున్నారు. ఇట్లుండ నీయారాధ్యసంప్రదాయము పూర్వకాల
మున నున్నదనుట యెట్లు?

ఉ॥ పూర్వకాలమున నారాధ్యులకు మఠములు లేవనుట కల్ల,
ఎట్లన,

పీఠిక 76 పుట. నేడద్వైతమతాచార్య పీఠములుగానున్న
విరూపాక్ష, పుష్పగిరి పీఠము లానాడు వీరు నెలకొల్పిన శైవమఠములే
యని శాస్త్రులవారె వ్రాసియున్నారు. తొల్లి యామఠాధిపేలెల్ల
శైవులేయని యెల్లరు నంగీకరించిన యంశమేయగుగదా! గోళకీ
మఠము మొదలగు నాయా మఠాధిపతులు లింగధారణరహితులను
టకు బలవత్తరప్రమాణములు లేవు.

ఇదిగాక, శ్రీశైలమున నెలకొన్న పండితారాధ్యమఠము ఆరా
ధ్యులదనుటకు సంశయముండదుగదా?

శ్రీకాశీనగరమందుగల విశ్వారాధ్యమఠము నేడు జంగమ
య్యల యధీనముననున్నను పూర్వకాలమున నది యారాధ్యుల
యనుట విశదమేగాదా?

అట్లె, ఆరాధ్య త్రయ పండిత త్రయాదులలోఁ జేరినవారల
గురుత్వమనియు, కడమవారికి శిష్యత్వమేయనియు విభాగంబు
విశదమయ్యెయున్నది. కావున నారాధ్యసంప్రదాయము బహుకా
సమాగతమేయనుట నిర్వివాదము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్ర॥ శ్రీశైలమున నున్న పండితారాధ్యమఠంబును, కాశీనగరమున నున్న విశ్వారాధ్యమఠంబును నారాధ్య సంప్రదాయము వారివే యనుట యెట్లు?

ఉ॥ ఆరాధ్యశబ్దమును బట్టియె.

ప్ర॥ ఆరాధ్యశబ్దము లింగధారణము లేనివారిని బోధింపదా?

ఉ॥ లింగధారణము లేని పాశుపతులకుగాని వర్ణాశ్రమధర్మరహితులగు జంగములకుగాని యారాధ్యసంజ్ఞ వ్యవహారసిద్ధముగాదు. లింగధారణరహితులగు పాశుపతు లెందును నారాధ్యపదమును వాడుకొనుట కనంబడదు. సోమనాథుఁడు బసవేశ్వరాదులను శివస్వరూపులనుగానె యుదాహరించెను. గాని యెక్కడో నైన వారియందు నారాధ్యపదమును వాడియుండెనా? తక్కంగలకవులలో నొక్కరేని యట్లు వాడియుండిరా? లేదు.

దాననే బసవేశ్వరుఁడని వ్యవహరించిరిగాని బసవారాధ్యుఁడని యెక్కడో నైన పేర్కొనరైరి.

కావున, లింగధారణరహితులగు విప్రులకుగాని, వర్ణాశ్రమధర్మరహితులగు లింగధారులకుగాని వాచకము గాక వర్ణాశ్రమధర్మకలితులును, లింగధారులు నగు విప్రులకే యారాధ్యపదము వాచకమగుచున్నది.

ప్ర॥ ఈనిర్ణయము నెల్లరు నంగీకరింతురా?

ఉ॥ లోకవ్యవహారము నతిక్రమించిన ప్రతిభాశాలు రెల్లరు నంగీకరింపక పోరు.

దాననే పీఠికా కర్తలును, పీఠిక 10 పేజి. శైవులైన బ్రాహ్మణులకే యారాధ్యనామ మానాడు చెల్లినది. బసవపురాణ పండితారాధ్య చరిత్రాదులు పరిశోధింపనగును. అని వ్రాసిరి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్ర॥ పీఠిక 77 పుట:—మఱియు, నాంధ్రదేశపు టారాధ్య కుటుంబములలో మిక్కిలి గౌరవము గడించినవారు లింగధారణ లేనివారికను గొందఱుకలరు. గోదావరి మండలమున నయ్యగారి రనియారాధ్యులు గలరు. వారికిని లింగధారణము లేదు. అనియున్న దీనింబట్టియు నారాధ్యులలో పూర్వకాలమున లింగధారణము లే తెలియుట లేదా?

ఉ॥ ఇట్టి నిదర్శనములంబట్టి యీమధ్య కాలమున పెక్కు లింగధారణము మానివేసిరని తెలియును. ఇంతియగాని యది యిప్పు లేనికారణమున పూర్వకాలమున గూడ లేదను నర్థము గ్రాహ్య గానేరదు. అయ్యగారివారి పూర్వుల చరిత్రముల దిలకించినను వా లింగధారణ ముండియున్నట్లే స్పష్టమగును.

దానన కూచిమంచి తిమ్మకవి తనకు దెందులూరి లిం నారాధ్యుని గురునిగాఁ జెప్పికొని లింగధారులను గౌరవించి యుం శిష్యులందఱు అయ్యగారు అనుటచే నాయన తర్వాతి వారయ్యా వారైనట్లు తెలియు చున్నదిగదా?

హైందవులకు నేడు స్వారాజ్యము లేని కతన వీరి పూ కును లేదను చందమున నేడు కొందఱకు లేదుగాన వారిపూ లకును లేదని చేయు తీర్మానమప్రమాణ మనుటవిశదము.

ప్ర॥ పినపాటివారును అయ్యగారి వారును మొదలుగా లిం ధారణలేనివారును నారాధ్యులని పేర్కొనబడుచుండగా నారా పదము లింగధారులనే బోధించు ననుటయెట్లు?

ఉ॥ లింగధారణ లేనివారలకు నారాధ్య సంజ్ఞ యేనా లేదు. పినపాటి వారున్నను వారలారాధ్యులని పీఠికాక వ్రాసినను దానికి వారెంతమాత్రము నంగీకరింపరు. ఇప్పుడు వా రాధ్యులము కామని నదింపక మానరు. కావున నారాధ్యప లింగధారణ రహితుల బోధించు ననుట కల్ల.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్ర॥ పీఠిక 76 పుట:—ప్రాచ్య లిఖిత పుస్తకశాలలో ౧౧-౫-౧౬ అని సంఖ్యగల ప్రాచీన తాళపత్ర గ్రంథమున గోదావరీతీరమున నొకస్వాములవారు ప్రాచీనగ్రంథములను శైవసంప్రదాయములను జక్కఁగాఁ బరిశోధించి, యక్కడి బ్రాహ్మణులకు వ్రాసిన పత్రిక యొక్కటి గలదు. అది యిప్పటికిన్నూ రేండ్లక్రిందట వ్రాయఁబడినదైయుండును. ఆనాటికి రెండువందలయేండ్లకుఁబూర్వము ఆంధ్రదేశమువారు ౬౬ కుటుంబములవారు బ్రాహ్మణులు శ్రీశైలమునకేగి యక్కడ లింగధారణదీక్షగొనిరనియు, కొందఱక్కడనే వీరశైవులై యుండిరనియు, కొందఱు వైదిక ధర్మముతో లింగధారణమునుగూడ నాంధ్రదేశమందుఁ బాటించుచుండిరనియు నందు గలదు. ఇది వాస్తవమేమో పరిశోధింపవలసియున్నది. ప్రాచీనాంధ్రారాధ్య సంప్రదాయగ్రంథములలో లింగధారణాదివిషయములు గానరాకుండుటచేతను, నాంధ్రారాధ్యులలో నిప్పటికిఁ గొన్ని కుటుంబములవారు లింగధారణము లేకయే యుండుటచేతను మీఁదివిషయము విశ్వాస్యమే యగునని నేఁదలంచుచున్నాఁడను. అని యున్నది.

దీనింబట్టి లింగధారణము ప్రాచీనము కాదని స్పష్టమగుట లేదా?

ఉ॥ పూర్వమెవరో స్వాములవారు తమ పత్రికలో కొందఱు బ్రాహ్మణులు మధ్యకాలమున లింగధారణదీక్షగ్రహించిరని వ్రాసిన మాత్రన లింగధారణమే ప్రాచీనము కాదని యెట్లు తేల్పుదురు? అంతకుమున్ను బ్రాహ్మణులలో లింగధారణమే లేనియెడ నప్పుడు మాత్రము బ్రాహ్మణులద్దాని నెట్లు గ్రహింతురు? గ్రహింపజాలరు గావున నాపత్రిక లింగధారణము ప్రాచీనము కాదను నర్థమును సాధింపఁజాలదు.

ప్రాచీనారాధ్యగ్రంథములలో లింగధారణము గానరాలేదనుట యసంగతము. లింగపురాణము, స్కాందపురాణము, శివ మహా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పురాణము మొదలగు ననేక గ్రంథములలో లింగధారణము రాద్ధాంతితమై యుండగా నిది ప్రాచీన గ్రంథములలో లేదనుటకంటె సాహసము వేరొండేమికలదు?

ఆంధ్రారాధ్యులలో నిప్పటికి గొన్ని కుటుంబములవారు లింగధారణము లేకయే యుండుట వీరు మధ్యకాలమున మానివేయుటను సంభవించినదేగాన నదియెంతమాత్రము పూర్వకాలమున లింగధారణము లేదనుటను సాధింపజాలదు. ఈవిధమున బసవపురాణ పీఠికాకర్తలు లింగధారణము పూర్వాచార్యానుష్ఠితము కాదని సాధింపగనబరిచిన యుక్తులలో నొక్కటియేని విచారమున నిలువమింజేసి యవి యాభాసము లేయనియు వారివాదము విచారాసహమనియు విశదీకరింపఁబడియెను.

ప్ర॥ పీఠిక 78 పేజి:- కృష్ణదేవరాయలకు బూర్వకాలమున నాంధ్రదేశమున నారాధ్య బ్రాహ్మణులు లింగధారులై యుండిరనుటకు బ్రబలాధారములు గలవేమో యింకను పరిశోధింప వలసియున్నది. అనియున్నది. దీనింబట్టి రాయలవారికిబూర్వము విప్రులలో లింగధారణము లేదనియేర్పడుచున్నది. రాయలవారికిబూర్వకాలమున బ్రాహ్మణులలో లింగధారణ మున్నదనుటకు బలవత్తర ప్రమాణమేమి?

ఉ॥ శ్లో॥ శ్రుతిః ప్రమాణం స్మృతయః ప్రమాణం ధర్మార్థయుక్తం వచనం ప్రమాణం । యస్య ప్రమాణం నభవేత్ప్రమాణం కస్తస్య కుర్యాద్వచనం ప్రమాణం॥ అనగా,

ధర్మనిర్ణయమునెడ మొదట వేదము ప్రమాణము తరువాత స్మృతులు ప్రమాణము అనంతరము పూర్వాచార్యోక్తి ప్రమాణము ఇవన్నియు నెవ్వానికి బ్రమాణముకావో అట్టి వానిమాట నెవ్వా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రమాణముగా గ్రహించును? వీని మాట నెవ్వడును విశ్వసింపడని ధర్మశాస్త్రకర్తలు వచించియుండిరి. ఇట్లుండ,

శ్రు॥ అమృతస్య దేవధారణో భూయాసం ఈ మొదలగు ననేక శ్రుతులు లింగధారణము అవశ్యకర్తవ్యమని విధించుచున్నవి. అట్లె పెక్కు శివాగమములు శ్లో॥ వక్షేమంత్రం హృద్ధ్యానం మస్తకే లింగధారణం ఈ మొదలగు స్మృతులను లింగధారణమును ప్రశంశించు చున్నవి.

అదిగాక లింగపురాణము, స్కాందపురాణగతశంకరసంహిత శివమహాపురాణగతవిద్యేశ్వరసంహిత మొదలగు పురాణసంహితలును లింగధారణము సర్వోత్తమమని యుద్ఘోషించుచున్నవి. పండితారాధ్యచరిత్ర మొదలగు ప్రాచీనగ్రంథములు లింగధారణమును రాద్ధాంతీకరించుచున్నవి.

ఇట్లు చెప్పబడిన శ్రుతిస్మృత్యాదులు కృష్ణరాయలవారికి పూర్వకాలమునాటివా లేక తరువాతివా దెలిసినవారలకు రాయలవారికిం బూర్వకాలమున లింగధారణమున్నదియు లేనిదియు విశదము గాదా? ఇవన్నియు నటుండనిండు.

ఆనందగిరికృత శంకరవిజయమునందు- ఇష్టలింగధారులగు వజ్రజంఖారాధ్యులు మొదలగువారు బ్రాహ్మణోత్తములు శంకరాచార్యులవారితో వివదించినట్లున్నది. ఆగ్రంథము శంకరాచార్యులవారి ముఖ్యశిష్యుడగు నానందగిరి రచించినదిగదా. వీరిలో శంకరాచార్యులుగాని, ఆనందగిరిగాని, వజ్రజంఖారాధ్యులుగాని వీరందఱు రాయలవారికిని నర్వాచీనులే యగుదురా? పీఠికాకర్తలకు విమతగ్రంథములు ప్రమాణముగాకున్న పోనిండు. స్వమతగ్రంథములును నవిశ్వాస్యములే యగునా? ఇట్టి వాదము విచారక్షమమెట్లగును?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ములను ఖండించి యద్వైత సిద్ధియను గ్రంథమున నద్వైతమును నిలిపినవాడునునగు మధుసూదన సరస్వతి యను మహావిద్వాంసుఁడు దశశ్లోకికి వ్యాఖ్యానమైన సిద్ధాంత బిందువు అను గ్రంథమునందు—

శ్లో॥ నస్తౌమితం వ్యాస మశేషమర్థం
సమ్యఙ్న సూత్రైరపియోబబాధ।
వినాపితై స్సంగ్రథితాఖిలార్థః
తంశంకరం నౌమి సురేశ్వరంచ॥

కావలసిన సకలార్థమును సూత్రములయందు బాగుగాఁ జెప్పనట్టివ్యాసుని నేను స్తుతింపను. సూత్రములతో పనిలేకయె వలసిన సకలార్థమును గూర్చి చెప్పిన శంకరాచార్యుని, సురేశ్వరాచార్యుని బ్రణమిల్లు చున్నాను. అని చెప్పియున్నాడు.

దీనింబట్టి పెక్కురు శాంకరమతస్థులలో వ్యాసుఁడు సరిగాఁ జెప్పనంతమాత్రన నుపనిష త్తాత్పర్యమును విడువ నగునా? శంకచార్యులవారు నిర్ణయించినదె యుపనిషదర్థము, కాన నదియే ముఖ్యమనువారు గొందఱును, ఈసూత్రములను రచించినవాఁడు నిజమైన వ్యాసుఁడు గాడని మఱికొందఱును, వేదవ్యాసుఁడె యీ సూత్రములను సామాన్యుల కొఱకు రచించెగాని జ్ఞానుల కొఱకు గాదని యింక గొందఱును, నుడువు చున్నారు. ఇంక యోజింపఁగా,

సూత్రములను వేదవ్యాసుఁడు/గాని వేరొకఁడుకాని ఎవఁడు చేసినను వీనియందు నుపనిషదర్థము న్యాయ్యముగా నిర్ధారణము చేయఁబడియున్నదని తోఁచినచో నాసూత్రములను ప్రమాణముగా గ్రహించి వానికి ననుగుణముగా వ్యాఖ్యానము చేయ వలయును. వీనియందు నుపనిషదర్థ నిర్ధారణము సరిగాలేదని తోఁచినచో నీసూత్రములు ప్రమాణముగావని త్రోసిపుచ్చి స్వతంత్రముగా నిర్ధారణము చేయవలయును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

న్యాయ్యమిటులుండగా- సూత్రములను ప్రమాణముగా గ్రహించినట్టులభినయించి- వానికి వ్యాఖ్యానము జేయ నారంభించి- మూలమునకు వ్యతిరేకముగా సిద్ధాంతముసేసి, ఇదేమనిన సూత్రములు సరిగా లేవనుట యెట్టులుచితమో పండితుల కెఱుక. బ్రహ్మసూత్రములు సరిగా లేవనుట మహాసాహసము. ఏలన, వేదములు విభజించుటచే వేదవ్యాసుఁడని పేరుగాంచి పురాణముల సంగ్రహించి, పంచమవేదమనంబరగు భారతసంహితరచించి, పరమపురుషార్థసిద్ధికై బ్రహ్మమీమాంసనిర్మించిన సాత్యవతేయునికంటె నార్యమతస్థులకుఁబరమాప్తుండు వేరొకండు గలఁడా? ఎందును లేఁడు. దాననే వేదవ్యాసునిఁ బ్రమాణముగా నంగీకరింపకున్నవాఁ డార్యులలో ననె పరిగణింపఁబడఁడు. ఆకారణముననె హిందూమతాచార్యులందఱును సూత్రములకు సరిపడినను సరిపడకున్నను తమతమ మతములు వ్యాససమ్మతములెయని వెల్లడింపనె తప్పక బ్రహ్మసూత్రములకు భాష్యముల రచింపవలసినవారైరి. దాననె వ్యాసునకు మాయావాదమునందె తాత్పర్యముగలదని సాధింపఁబండితులు నేటికిని తమతమశక్తిని వినియోగించుచునె యున్నారు.

నిజమిట్టులుండ బ్రహ్మసూత్రములకు శాంకరభాష్యమె సమ్మతమనియు, తక్కు-భాష్యము లాగమ తంత్రమతములవారిచే నసంగతముగా వ్రాసిలొనఁబడినవనియు, తమదె వైదికమతమనియు స్వీయమత గ్రంథములయందైనగాక శైవమతపరిష్కార సందర్భమున వ్రాయ సాహసించుట యెంతయుచితజ్ఞతయో బుద్ధిమంతులు గ్రహింతురు గాక.

బసవపురాణ పీఠికలో నందును శైవమతపరిష్కార ఘట్టమున శైవమహాజనులకు సంశయజనకముగా వ్రాసిన కారణమున నిందు గొంచెము శాంకరభాష్యయాథార్థ్యము విన్నవింపక తప్పదయ్యెను. అంతి యెగాని, శాంకరమతస్థులు తమదె వైదికమతమనియు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తమ భాష్యమే యగ్రగణ్యమనియు, తమ యాచార్యుఁడె వేదవ్యాస సకండె తత్త్వవేత్తయనియు నెన్నివిధములు దుర్భరాభిమానము వహించినను నెపలకుఁజింత యావంతయునుండదను.

శుద్ధాద్వైత మిట్లు బ్రహ్మసూత్ర విరుద్ధమగుటనే శైవులు శివాద్వైతమును గ్రహించిరి. కావున బసవపూరాణ పీఠిక ౨౦ పుట యందు వీరశైవ మద్వైత సిద్ధాంతమునను సరించును. అని పీఠికాకర్త లు వ్రాసినది సరికాదు కొన్నిచోట్ల అనుథనాద్వైతము శైవగ్రంథ ములయందున్నను నిది శైవాచార్యులు సిద్ధాంతముగా పరిగ్రహించినది కాదు. కావుననే శ్రీమల్లికార్జున పండితసోమనాథాదులు అద్వైత సిద్ధాంతము ననేకవిధముల ఖండించియుండిరి. అదిగాక సర్వేశ్వర శతకము 73, 74 పద్యములు.

శా. మోహధ్వాంతములో మునింగిన మహామూఢుండతిభ్రష్టుడై
సోహంబంచుఁదొడంగి నీకుఁగడు దూరాత్ముండగుంగాని దు
ష్టాహంకార గుణంబుమాని మది సొంపారంగ సద్భక్తి దా
సోహంబన్న భవత్పదార్చకుఁడు నీవైయుండు సర్వేశ్వరా.

శా. చావంబుట్టుచుఁ బుట్టఁజచ్చుచు మహాచండాల సంసార పా
రావారంబునఁగూలి తాఁజెడుటకుంబ్రవ్యక్తిగా నాత్మలో
నేవంబాఁదక యేను నీవనుట తానే జ్ఞానమో శ్రీమహా
దేవా యిట్టి కుతర్కముంగలదె చింతింపంగ సర్వేశ్వరా.

అను వానియందు నద్వైతము నిరసింపబడియున్నది, గాన దీనిం బోవిడిచి వేరొక యంశము విమర్శించుట యుచితము.

ప్ర. బసవ......పీఠిక ౨౧ పుటయందు, శివకవులు అని యుప క్రమించి వీరశైవులలోఁగ వీశ్వరులగు వారు శివునిమీదను, తద్భక్తు లమీదను దక్క నితరులగు భవులమీద నెప్పుడును గృతులఁజెప్ప డివారుగారు. కావున వారికి శివకవులని పేరుగల్గెను కర్ణాటాంధ్ర గ్రంథములలో శివకవుల ప్రశంస పెక్కుచోట్లగలదు. శివకవులు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భవికవుల గర్హించిరి. కవితలోగూడ వారు వేరుమతము వారైరి. అని పీఠికకాకర్తలు వ్రాసియున్నారు. దీని యభిప్రాయమేమో దెలుపుడు.

ఉ॥ భవికవుల మతము కన్న శివకవులమతము వేరనుట విశదమే. ఇంతియేగాక కవితలోగూడ వారిమతము వేరెయనగా శివకవులమత మన్నిటలోకవిరుద్ధమెగాన నది పరిహాసావహము. అనునాశయము వ్యక్తమగుచున్నది.

భవికవులేపాటి మనుజునైనఁ బొగడి ధనముగడించి యైహిక సుఖముగాంతురు. శివకవులైననో యైహిక సుఖమునెల్లక పరమపురుషార్థము నెగోరి శివుని, లేక శివభక్తులను మాత్రమే ప్రశంసింతురు. మఱియు, వారుకుకవులనుంబలె భవికవుల దెగడుటయు గలదు. దాననె,

శ్లో॥ ఆదరేణ యథాస్తౌతి ధనవంతం ధనేచ్ఛయా।
తథాచేద్విశ్వకర్తారం కోనముచ్యేత బంధనాత్,

కవీశ్వరుఁడు ధనవాంఛచే ధనికునెంత యాసక్తితో స్తుతించునో అంత యాసక్తితో పరమేశ్వరునింబొగడెనేని వాఁడు మోక్షము నెట్లు పొందకుండును? అని మహాకవి నీలకంఠుఁడును భవికవులఁదూలనాడెను, శివకవులు భవికవుల గర్హించిరి. అని పీఠికాకర్తలు తమకు వారితోగల సహజవైరమును తోఁటుతదెలిపియే కవితలోగూడవారు వేరుమతము వారైరి అని వారినిఁజులుకనసేయ నారంభించిరి, ఇది విరుద్ధముగాదు. ఏలన,

శ్లో. లుబ్ధానాం యాచకశ్శత్రుశ్చోరాణాం చంద్రమారిపుః,
జారస్త్రీణాం పతిశ్శత్రుర్మూర్ఖాణాం బోధకోరిపుః.

లోభులకు యాచకుఁడు శత్రుఁడు, చోరులకు జంద్రుఁడు శత్రుఁడు, జారస్త్రీలకు భర్త శత్రుఁడు, మూర్ఖులకు బోధకుఁడు శత్రుఁడు నగు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గాన లోభులు యాచకులను, యాచకులు లోభులను పరస్పరము గర్హించుకొనుచుంట సహజమే.

కాని, శివకవియగు సోమనాథుని గ్రంథముంగూర్చి భవికవులు పీఠిక వ్రాయవలసివచ్చిన కతన శివకవుల కవితయెగాక వారి మతంబును పరిహాసభాజనమగుట విచారకరము కాకపోదు,

శివకవుల కవితామతంబులు భవిసంఘముల యాదరమునకు నాస్పదముగాకున్నను భక్తసంఘముల యధికాదరమునకుం బాత్రము గాకపోవుగాన వారికి నేమియుగొరంతలేదు. పూర్వకాలమున పరమేశ్వరునో లేక పరమేశ్వరభక్తులనో మాత్రమెగాక తక్కువారి స్తుతింపరాదు అను భావము పెక్కురు కవీశ్వరులకు నుండినట్లు కన్పట్టుచున్నది. దాననే శ్రీ నన్నయభట్టారకుఁడును రాజరాజనరేంద్రుని బ్రశంసించునప్పుడు.

క, వీరశ్రీవనితాశ్రిత
భూరిస్థిర బాహుదండ బుధనుత సుగుణా
ధార కలియుగ పవిత్ర పు
రారాతి పదాబ్జపూజనాసక్తమతీ. అను పద్యమున

అతఁడు శివపూజాపరాయణుఁడే అనిచెప్పి శివభక్తేతరులను బొగడెనను నపవాదము తనమీదకిరాకుండఁ గాపాడికొనియెను,

శివకవుల మతరహస్యంబును, భవికవుల మతయాథార్థ్యంబును నీ పత్రికయందు బెక్కువిధముల వివరింపఁబడుచున్నదిగాన నా విషయమిప్పుడు విన్నవింప ననవసరము.

శివకవుల కవితావిశేషముంగూర్చి వ్రాయఁబూనినచో గ్రంథవిస్తరముగాక మానదు.

సోమనాథుఁడు ద్విపదయందు ప్రాసయతి నంగీకరించుటంజేసి ఛందస్స్వాతంత్ర్యము నవలంబించినట్లు పీఠికాకర్తలు వ్రాసియున్నారు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాని ఆ మహాకవి, అనియతగణైః ప్రాసోవా, యతిర్వా అని యాకాలమున వాడుకలోనున్న సూత్రములను ప్రమాణముగాఁ గనఁబరిచియె యుండెను. దానింబట్టి యాయన స్వాతంత్ర్యము నవలంబించి నట్లుగనబడదు.

మఱియు, ప్రాసవిశేషములు యతి విశేషములు మున్నగువానిని గనఁబరిచియు. నట్టివిశేషములు జాలవరకు నితరప్రాచీన మహాకవి కృతులందును గలవని పీఠికాకర్తలె దెలిపియున్నారు. నామాఖండ యతిమున్నగువానికి భారతాదులయందె లక్ష్యములఁజూపి యుండిరి గాన నవి శంకనీయములుగావు.

ఇదిగాక, వైరిపదములు మొదలగు నసాధారణ ప్రయోగములు సోమనాథకృతులందు గలవని వ్రాసియున్నారు. అట్టివానిని నన్నయాదులె గొన్నిటి బ్రయోగించియుండిరి. మఱియు, కొన్ని సోమనాథ కృతులందున్నను నయ్యవి యాకాలమునకు నార్యవ్యవహార సిద్ధములుగానె యున్నవని పీఠికాకర్తలె సమర్థించి యుండిరిగదా?

సోమనాథుని కృతులలో గొన్నితావుల వ్యాకరణవిరోధములు నుగలవని వచించిరి. సోమనాథుని కృతులు తగినంత పండిత పరిష్కారము నొందకుండుటంజేసి యవి లేఖకప్రమాదకృతములనియె నమ్మదగును.

భారత గ్రంథమనంతపాఠ ప్రభేదములతో నున్నను నద్దానిని పండితులు పరిష్కరించి ప్రచురించియున్నారు గదా? అట్లు పరిష్కరింపక తాటియాకులలో నున్నతీరుననే ముద్రించియున్నచో నది యెట్లుండును? గావున నట్టివి సోమనాథుని లోపములనుగా గ్రహింపరాదు. పీఠికాకర్తలు కవితయందు శివకవులమతము వేరెయని యేలకోవ్రాసినను, బసవపురాణ కృతియందగు గుణమును వివరించు నెడను, లోపములని యొరులు భ్రమించువాని సమర్థించు నెడనుచేసిన పరిశ్రమము ప్రశంసనీయము.

సోమనాథకృతిలోని విశేషములకు గారణము పీఠికాకర్తలే

పీఠిక ౧౩౩ పుట.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సోమనాథుఁడు తన గ్రంథముల యందుపయోగించిన భాష ప్రాచీనతచేతను, కర్ణాటాంధ్ర దేశములను గలిపట్టున వాడిక గలదగుట చేతను, మఱియు సోమనాథుని బహుదేశ భాషాపరిజ్ఞానము చేతను. వైలక్షణ్యము గాంచి. నేఁడు మధ్యాంధ్ర దేశవాస్తవ్యులయి కర్ణాట ద్రవిడ భాషాపరిచయమించుకయుఁ బొందనివారికిఁ గొంత వింతఁగొల్పుచుఁ గొన్నిపట్టులఁ గొఱుకఁబడనిదై యుండును. అని తెలిపియున్నారు.

సోమనాథుని వైదుష్యము పీఠిక ౨౭ పుటయందు.

సోమనాథుని పాండిత్య విశేషము చతుర్వేదసారమునను పండితారాధ్యచరిత్రమునను బసవరాజీయము (సోమనాథభాష్యమునను గాననగును. వేదములనుండి పురాణములనుండి శివపారమ్య ప్రతిపాదకములైన వాక్యముల నీతఁడు హెచ్చుగాఁ జూపినాఁడు. వేదములు, వేదభాష్యములు, కొన్నిచోట్ల వేదభాష్యముల ప్రతీకముల నిచ్చినాఁడు. ఆభాష్యము లెవ్వరివో? విద్యారణ్య భాష్యమప్పటికి పుట్టలేదుగదా? పూర్వోత్తర మీమాంసలు పురాణములు, మొదలుగా మతాచార విధులకు సంబంధించిన సంస్కృత గ్రంథములనెల్ల నీతఁడు శోధించినాఁడు. పాండిత్యమిట్లుండఁగా, నీతఁడు సంస్కృతాంధ్ర కర్ణాట ద్రవిడ మహారాష్ట్ర భాషలలోఁ గవితఁ జెప్ప నేర్చినవాఁడు. సంస్కృతాంధ్ర కర్ణాటక భాషలలో నీతఁడు రచించిన గ్రంథములే కలవు. కాని యాతని సంస్కృతకవితయంత రసవంతమైనది కాదు, సంస్కృత వచనరచనము నంత మేలయినది కాదు. ఆంధ్రదేశమునను, ఆంధ్ర వాఙ్మయమునను గడించిన గౌరవమునకంటె సోమనాథుఁడు కర్ణాట దేశమునను గర్ణాట వాఙ్మయమునను హెచ్చుగౌరవము గడించెనని మొదలుగాఁగలదు.

ఇందు. ఈతని సంస్కృత కవిత యంత రసవంత మైనది గాదు అను నీమొదలగు వాక్యము నకుఁ గారణము గన్పట్టదు.

పీఠికయందు వారుదాహరించిన సోమనాథ రచనల గాంచిన వారికి సోమనాథుని సంస్కృత రచనా వైదుష్యము వెల్లడి యగుచునే యున్నది గదా?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సంస్కృతమున వేదతదీయభాష్య సర్వశాస్త్ర పరిజ్ఞానము నందుటయెగాక సంస్కృతాంధ్ర కర్ణాట ద్రవిడ మహారాష్ట్ర భాష లలోఁ గవితఁ జెప్ప నేర్చిన వాఁడని తామె వచింపుచు నీతని సంస్కృ తకవితయంత రసవంతముగా లేదనుటయెంతయో రసవంతముగానున్న దని నిబంధించినవారి దృష్టికిఁ గొంత రసవంతముగా నున్నదని తోచు టయే యధికము.

చతుర్వేద సారము మొదలగు గ్రంథములంబట్టి సోమనాథుని సకలవేద పరిజ్ఞానము వ్యక్తమే. అదిగాక సర్వశాస్త్ర వేత్తృత్వ మద్వి తీయము. అదియటుండ నానాదేశ భాషాకవిత నిరుపమానము. ఇంత మాత్రముగాక, ఈయనఘుఁడు చతుష్షష్టి శీలసంపన్నుఁడు, షట్కాల శివపూజాపరుఁడు, అనుదినషట్సహస్రోత్తరైక వింశతి సహస్రసంఖ్యాక శ్రీపంచాక్షరీమంత్ర జపపరుఁడు. నిగ్రహానుగ్రహ సమర్థుఁడు. జైన మస్తక విన్యస్త శాతశూల కలిత బిజ్జల తలగుండు గండబిరుదాభి మండితుఁడు. దాననే ప్రత్యక్ష భృంగీశావతార, అని మొదలగుబిరుద ములు గలవని కర్ణాట కవి చరిత్రకారులు వ్రాయుట వింతగాదు. ఇట్టి మహాత్ము నుద్దేశించి,

సోమనాథుని నిష్ఠలు నియమములు, అని పీఠిక ౨౯ పుట యందు, ఈతఁడు చతుష్షష్టి శీలసంపన్నుఁడని పలువురు చెప్పిరి. ... భవిజనదర్శన స్పర్శనాలాప వివిధదానాదాన విషయదూరగుడనని యీతఁడు చెప్పికొన్నాఁడు, శైవేతరుల (భవుల) మొగముఁ జూడ మని శైవులును, వైష్ణవేతరుల మొగముల జూడమని వైష్ణవులును వ్రతములు పూనుటగలదు! అట్టివారు నేఁడునున్నారు! అనియున్నది, ఇట్టి వ్రతములు నేఁడు శైవవైష్ణవేతరులకు పరిహాసాస్పదముగా దోఁచి నను నాఁడు గౌరవావహములు గానెయుండెను. అట్టివారనగా నొరుల మొగములు జూడమనువారు గదా యిప్పుడున్నారు. యింతియెగాని పాండిత్యమునగాని, కవితయందుగాని, మాహాత్మ్యముగాని సోమనాథు నింబోలువార లిప్పుడెందేనిం గలరా? అట్టివారలు నాఁడుండుటయె యరుదు. నేఁడెట్టులుండురు? ఇదియంత విమర్శనీయముగాదు. పీఠికాక

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ర్తలే పీఠిక ౧౧౯ పుట,

శబ్ద రత్నాకర కారులు మనసోమనాథుని గ్రంథములను స్వయముగాఁ దలస్పర్శముగాఁ బరిశోధించినట్లు గానరాదు. అట్లు పరిశోధించి యుండురేని బసవపురాణ పండితారాధ్య చరిత్రములలోని ద్విపదలనే యన్యగ్రంథములలోని వానిగా నుద్ధరించుటగాని యనేకశబ్దములను విడుచుటగాని సంభవింపదు. సోమనాథుని గ్రంథములు మొదటి తరగతిలోఁ జేరవలసినవైనను వారైదవ తరగతిలోఁ జేర్చిరి, అనిమొదలుగా సోమనాథుని గ్రంథముల బ్రశంసించి యున్నారు.

శబ్దరత్నాకర కారులు సోమనాథుని గ్రంథములఁ జూడకుండుటకు, అట్టివారునేడు నున్నారని పీఠికాకర్తలు చెప్పినచొప్పున శబ్దరత్నాకర కారులగు సీతారామాచార్యుల వారికి వైష్ణవేతరులనే గాక వైష్ణవేతరుల గ్రంథములనుగూడ జూడమను వ్రతము కలదేమో యని యెన్నవలసి వచ్చుచున్నది. అట్లులేనిచో సకలాంధ్ర వాఙ్మయమునుగాంచి పెద్దనిఘంటువు నిర్మించిన వారేల చూడకుందురు?

వీరవైష్ణవులైన శబ్దరత్నాకర కారుడువీర శైవాగ్రేసరులైనసోమనాథుని గ్రంథముల నైదవ తరగతిలోనైనఁ జేర్చియుంటకు సంతసింపవలయునెగాని మొదటితరగతిలో నేల చేర్పలేదని యోజింప నావశ్యకము కన్పట్టదు.

కావున, పాఠక మహాశయులారా, ఎంతటి విపశ్చిదులనైనను విమతద్వేష పిశాచిక యావహించి యుండునందాక సత్యమార్గాభిరతి యలభ్యము గాన నీయెడ నెక్కుడుగావిన్నవింప ననావశ్యకము.

ఆధునిక విమర్శకులు స్వధర్మాను ష్ఠానము నెడ స్వమతాభిమానము వహింపకున్నను విమత ప్రస్తావముల యందైన సద్గానిగొదువలేకుండ వినియోగించుట శ్రేయమే.

కాఁబట్టి, యీపీఠికలోని శైవమత కవితాది పరిష్కారములయందగు గుణములు సహజములనియు, లోపములు కారణాంతర కలితము లనియు గ్రహింతురుగాక.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇట్లు,
వ॥ సం॥

| | |
|---|---|
| మ॥ రా॥ శ్రీ కొమరువెల్లి కాశయ్యగారు వరంగల్ | 12-0-0 |
| ,, రామిని మల్లయ్యగారు ... | 12-0-0 |
| ,, తుగ్గపాటి వెంకటేశ్వరరావుగారు, బారిష్టరు, బెజవాడ | 10-0-0 |
| ప్రొద్దుటూరి పెదవీరన్న చినవీరన్నగార్లు, శికింద్రాబాదు | 10-0-0 |
| ,, కైలాస శరభయ్యగారు, ... | 10-0-0 |
| ,, బెల్దె రామన్న కుమారుడు, జగదీశ్వరయ్య ... | 10-0-0 |

## —— పోషకులు ——

| | |
|---|---|
| మ॥ రా॥ శ్రీ తాడికొండ పూర్ణయ్య అయ్యావార్లంగారు, ఈమని | 6-0-0 |
| ,, శ్రీపతి పండితారాధ్యుల లింగయ్యగారి వీరభద్రయ్యగారు ఈమని | 5-0-0 |
| ,, కామర్సు రాజశేఖరరావుగారు, కరణం, నవాబుపాలెం | 5-0-0 |
| ,, ముదిగొండ వీరభద్రశాస్త్రిలుగారు, తొండపి | 5-0-0 |
| ,, ముదిగొండ పూర్ణయ్య లింగంగారు | 5-0-0 |
| ,, ముదిగొండ వీరభద్రశాస్త్రిగారు, మాదల | 5-0-0 |
| ,, మూలంపల్లి శివలింగారాధ్యులవారు, లచ్చపేట | 5-0-0 |
| ,, భూపతి రత్నంగారు, వరంగల్ | 5-0-0 |
| ,, మల్లంపల్లి మల్లికార్జునుడుగారు, అయితంపూడిఅగ్రహారం | 5-0-0 |
| ,, మల్లంపల్లి మృత్యుంజయశాస్త్రిగారు తాడికొండ | 5-0-0 |
| ,, శ్రీపతిపండితారాధ్యుల నాగలింగశాస్త్రిగారు, ఈమని | 5-0-0 |
| ,, చీకటిమళ్ళ సంగయ్యగారు, మద్రాసు | 5-0-0 |
| ,, కోనసముద్రం మోహిరీలు అయ్యవారుగారు, ఆరమూరు | 5-0-0 |
| ,, బీపేట విశ్వనాథశాస్త్రిగారు, సిద్దిపేట | 5-0-0 |
| ,, ముత్యంపేట మల్లయ్యగారు ,, | 5-0-0 |
| ,, కాళేశ్వరం నాగభూషణంగారు ,, | 5-0-0 |
| ,, కొమరువెల్లి బాలరాజుగారు, వరంగల్ | 5-0-0 |
| ,, గర్రెపల్లి రామన్నగారు, మిడిదొడ్డి | 5-0-0 |

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ప్రకటనము.

ఆర్యధర్మ ప్రత్యక్షఫలబోధిని:- ఈ గ్రంథమునందు బ్రాహ్మణులు మొదలగువారు వేకువజామున నిద్రలేచినది మొదలుకొని రాత్రి పండుకొనునందాక చేయనగు స్నానసంధ్యాది సకలధర్మములకును వైద్యశాస్త్రప్రామాణ్యమునుబట్టి ఆరోగ్యరూపమగుప్రత్యక్షఫలము కలదని ఋజువుచేయఁబడియున్నది. వెల రు ౧-౦-౦

కారణోత్తరమను దివ్యాగమము:-ఇయ్యది శైవుల లింగధారణము మొదలగువానియెడలగల సకలసంశయముల వారించు నెడ నిరుపమానమైనది. వెల రు ౧-౦-౦

ఆహ్నికవిధి:-ఇందు స్నానము సంధ్య మొదలుకొని వైశ్వదేవమువరకుగల సకల నిత్యకర్మములు సస్వరాంధ్ర ప్రయోగముతో గలవు. వెల రు -౮-౦.

మకుటోత్తరము అను దివ్యాగమము:- ఇందు శివపూజా విశేషములు, శైవాంత్యేష్టి విధానము మొదలగు ననేక విశేషములు గలవు. వెల రు ౧-౮-౦.

బ్రహ్మతర్క స్తవము:- శ్రీమదప్పయ దీక్షిత విరచితము. ఇందు తామసత్వ నిరాకరణము, గంగాధరణ విషయము, స్మశానవాసిత్వము, బాణాసురయుద్ధమున నోడిపోయెనన్న దానికి సమాధానము మొదలగు ననేక విషయములు గలవు. వెల రు ౧-౦-౦

మహాశివపూజా విధి:- ఇయ్యది లింగనిరీక్షణమున వినియోగించు దశావధాన విధానముతోను, సస్వరాంధ్రప్రయోగముతోను శాంభవీయ సూత్రానుసారముగా ముద్రింపఁబడినది. వెల రు ౦-౮-౦

ధర్మసంగ్రహము అంత్యేష్టికాండము:- ఇందు శైవులాచరించు సమాధ్యారాధనవిధులు శాస్త్రసిద్ధములని పలువిధముల నిరూపింపఁబడియుండుటెగాక, అపరకాండ సందర్భమునగల సర్వవిధకృత్యములకుఁదగు ప్రమాణముల గనబరిచి సకల సంశయములు వారింపఁబడియెను. ఆంధ్ర తాత్పర్యసహితము. వెల రు ౨-౦-౦.

వలయువారు:— ముదిగొండ నాగలింగశాస్త్రి.

మల్లికార్జునపేట, తెనాలి. అని వ్రాయవలెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

REGD. No. M-1738

చందా సం॥ రు 1

శ్రీ బాలాత్రిపురసుందర్యైనమః.

యతోధర్మ స్తతోజయః : సత్యమేవజయతే నానృతమ్.

# శైవధర్మప్రకాశిక.



శ్లో॥ ధర్మఏవ హతోహంతి, ధర్మో రక్షతి రక్షితః

| సంపుటము | రుధిరోద్గారి వత్సర | సంచిక |
|---|---|---|
| 1 | జ్యేష్ఠ మాసము. | 3 |

శివపురపు వీరభద్రపాకయాజి-పత్రికాసంపాదకుడు

శ్లో॥ శివోక్తాం జాతిమర్యాదాం యోతీత్య భువివర్తతే
సపాషండ ఇతిజ్ఞేయః సర్వకర్మబహిష్కృతః ॥

శ్లో॥ స్వజాత్యాశ్రమధర్మం య స్త్యక్త్వా వేదోదితం నరః
అన్యజాత్యుచితాచారం చరే త్సపతితో భవేత్ ॥

విషయసూచిక



శ్రుతిధర్మసంజీవనీ ముద్రాక్షరశాలయందు
శి. వీ. పాకయాజిచే ముద్రింపఁబడి
ప్రచురింపబడియె.— బెజవాడ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

1923.

శ్రీ బాలాత్రిపురసుందర్యైనమః

యతోధర్మ స్తతోజయః సత్యమేవజయతే నానృతమ్.

# శైవధర్మప్రకాశిక.

శ్లో॥ ధర్మఏవ హతో హంతి ధర్మో రక్షతి రక్షితః॥



సంపుటము 1

దుందుభి సంవత్సర మాఘ శుద్ధ పూర్ణిమ.

సంచిక 3

## ఆంధ్ర వాఙ్మయ చారిత్ర విమర్శనము.

ఇది వంగూరు సుబ్బారావుగారను నొకయాధునిక చరిత్రకారులచే వ్రాయబడిన యాంధ్రవాఙ్మయచారిత్రను విమర్శించుచుండుటచే నీవ్యాసమున కాంధ్రవాఙ్మయచారిత్ర విమర్శనమను నన్వర్థ నామకరణము గావింపబడినది.

రావుగారు సంఘసంస్కారప్రియులు. కావుననే పైచరిత్రయందు జైనబౌద్ధాదిమతములను భూషించుచు, వానిని నిరసించిన పండితులనందరిని దూషించుచువచ్చినారు. సంస్కారులకు గులాచారములను గూలద్రోసి వర్ణసంకరులను వృద్ధిచేయుటయందిష్టము. అదిచేయువారియెడ ననురాగముమెండు. కావున నట్టివారియందు లేని గుణములనారోపించి వారిని మహామహులనుగా. వర్ణించుచుందురు. అట్టివారి విషయములలో నొకదానిని చేడుతీసికొని విమర్శించుకొందము. రావుగారు పైచరిత్ర 61 పుటలో బసవేశ్వరునిగూర్చి కొంతముచ్చటించియున్నారు. అది సత్యేతరమును, శైవమతాపకర్షావహమునునై యున్నది. అందుచే స్థాలీపులాకన్యాయము ననుసరించి దాని నించుక విమర్శించుచున్నారము.

### —* శైవమతము *—

అను శీర్షిక క్రింద రావుగారిట్లు వ్రాసియున్నారు. అదేమన? "బసవేశ్వరుడారాధ్య బ్రాహ్మణుడు" అని రావుగారొక సత్యేతర విషయమును బోధించియున్నారు. బసవడు మాదంగి మాదిరాజను

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ద్విజునికిఁ బుత్రుడని బసవపురాణమందుగలదు. కాని యారాధ్య బ్రాహ్మణుడని యెచటగానరాదు. ఆతనితండ్రి కావాడుకకలదేమో యన్న నదియుఁగానరాదు. కాన లేనిదానిని వ్రాయుట సరికాదు. పోనింకు. ఆరాధ్యుడన నారాధిం (పూజిం)ప దగినవాడని యర్థము కదా? బసవేశ్వరుడందరిచే నారాధింపఁబడియుండుటవలన నారాధ్య బ్రాహ్మణుడని యొకవేళ వ్రాసినారని తలంతుమా? బసవఁడుపనయ నము మానుకొని చండాలురతోఁ గలిసి తిని వివాహము గావించు కొని యనేక వ్రతములాచరించి తననుగన్న తలిదండ్రులచేతనే బహి ష్కృతుడైయున్నాడని యాతని చారిత్ర చెప్పుచున్నది. తలిదండ్రుల చేతను గులమువారిచేతను బహిష్కరింపఁబడిన బసవని నితరజాతీయు లారాధింతురా? కాన నాతని నారాధ్యుడనుట ధర్మవిరుద్ధము.

ఇట్లనిన నతని యాచారమునకు సమ్మతించి యాతనితోఁ జేరి నవారి కాతడారాధ్యుడైయుండెనని సమాధానము చెప్పవలయును. అపుడు వారుకూడ వీరివంటివారే (బహిష్కృతులే) యై యుండిరని చెప్పక తప్పదుకదా? బహిష్కృతులచే నారాధింపబడు బహిష్కృ ని నారాధ్యుడని పండితులు వ్యవహరింతురా? అదియట్లుండనిండు బహిష్కృతులచే నారాధింపబడు బసవడు బహిష్కృతారాధ్యుడ గునుగాని యారాధ్యబ్రాహ్మణు డెట్లగును? ఉపనయనము వదలి చండాలురతోఁగలసి తినితిరిగిన బసవని నారాధ్యబ్రాహ్మణుడని ప్రాజ్ఞులెన్నటికైన వ్యవహరింతురా? భ్రష్టుడైనను బ్రాహ్మణపుత్రుడే కదాయని యొక సమాధానము చెప్పవలెను. అపుడతని నారాధ్యు డనుట తప్పుకాదా? ఆరాధ్యబ్రాహ్మణులను నొకగొప్పసంఘము ప్రపంచముననుండగా బ్రాహ్మణకులభ్రష్టుని నారాధ్యబ్రాహ్మణు డని గ్రంథస్థము చేయుటచే నారాధ్యబ్రాహ్మణులందరు బసవని వలెనే భ్రష్టులైయుందురని లోకము తలంపదా? అదిశైవులకపకర్షా వహముకాదా? పరాపకర్షావహములైన యిట్టి వ్రాతలు ప్రాజ్ఞులు వ్రాయదగునా? ఇంతటితోఁబోక యొక వింతసమాచారము శాస్త్రిగారు వ్రాసియున్నారు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"లింగాయతమను వీరశైవమతమును బునరుద్ధారణమొనరిం
బసవేశ్వరుని మనము వినియున్నాము" అని మన రావుగా
పాతరమణీయమగు వ్రాతవ్రాసియున్నారు. లింగాయతమను వీర
మత మొకటికలదని శైవశాస్త్రములందు జెప్పబడినదా? అది
చ్చటనుగానరాదు. లేనిదానిని బుద్ధిమంతులు వ్యవహరింపవచ్చు
లింగాయతమని లేక పోవచ్చునుగాని వీరశైవమనునది యొకటి
లదని శైవశాస్త్రములందు జెప్పబడలేదా యందురా? అదికలదు
ని యావీరశైవము బసవనివలె నుపనయనము మానుకొని జాతి
విడిచి యాచండాలాంతము కలిసిభుజింపవచ్చునని చెప్పియుం
లేదు. శైవాదిషణ్మతములలో నేమతమునవలంబించిన వాడైనను
వాడు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులలో నొకజాతికి జేరిన
వాడుగానుండవలెను. అందు శైవులలో వేదవిహితకర్మానుష్ఠానము
కధికారియగుద్విజుడే వీరశైవుడగునని శైవశాస్త్రములె చెప్పియు
న్నవి. ఇట్లుండగా మనరావుగారు కులమువిడిచి చండాలురతో గలిసి
బసవడు వీరశైవమతమును బునరుద్ధరించినాడని సర్వజ్ఞునివలె
నుపదేశింపవచ్చినారు. బ్రాహ్మణ కులభ్రష్టుడు బ్రాహ్మణుల నుద్ధ
రించునా? అని యనదగునా? ఇది బుద్ధిమంతులు వినదగునా? బస
వడుద్ధరించిన శైవమతము వర్ణసంకర శైవమతముకాని వీరశైవమత
ముకాదు. వీరశైవుడు స్వజాత్యాశ్రమ ధర్మములను విడువరాదు.
విడిచినయెడ వాడు పతితుడగునని శైవశాస్త్రమిట్లు చెప్పియున్నది.

శ్లో॥ స్వజాత్యాశ్రమ ధర్మం య। స్త్యక్త్వా వేదోదితం నరః।
అన్యజాత్యాశ్రమాచారం। చరేత్స పతితో భవేత్॥

ఇంతియె కాదు. మరియొకతూరి యిట్లు చెప్పియున్నది.

శ్లో॥ శివోక్తాంజాతిమర్యాదాం। యోతీత్యభువివర్తతే।
సపాషండ ఇతిజ్ఞేయః। సర్వకర్మ బహిష్కృతః॥

స్వజాతికిని స్వాశ్రమమునకును వేదోక్తమగు ధర్మమేదికలదో
దానిని నరుడు వదలి యన్యజాతికిని నన్యాశ్రమమునకును విహిత CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri శివోక్త
మైనధర్మము నాచరించినయెడ వాడుపతితుడగుచున్నాడు.

మైన జాతిమర్యాదననుసారి యెవడు భూమిపై వర్తించునో వా
సర్వశాస్త్రములయందు బహిష్కరింపదగిన పాషండుడగుచున్నాడని శై
శ్లోకములకర్థము. దీనింబట్టి శైవులను బ్రాహ్మణ, క్షత్రియ వైశ్య
శూద్రులను నాలుగు జాతులలో జేరినవారుగానుండవలెను గా
యన్యులుకారని తెలియనచ్చెడిది. నాలుగు జాతులేకాని యైదవజా
లేదని మను వీక్రిందశ్లోక ముఖమున, జెప్పియున్నాడు చూడుడు
దశమాధ్యాయము.

శ్లో॥ బ్రాహ్మణః క్షత్రియో వైశ్యః । త్రయోవర్ణాః ద్విజాతయః
చతుర్థ ఏకజాతిస్తు । శూద్రో నాస్తితుపంచమః॥

శాస్త్రములిట్లుచెప్పియున్నవి. నానింబట్టిచూడ నిపుడుపా
యనము మానుకొని చండాలురతోగలిసి తినితిరిగిన బసవని శి
తుడని నిశ్చయించవలయునేకాని పైబ్రాహ్మణాదులలో నేజాతిని
జేర్చరాదు. ఈనాలుగు జాతులను విడిచినయెడ మిగిలినవన్నియు
సంకరజాతులయ్యెనుగదా? సంకరజాతులలోజేరి బసవడు వృద్ధిచేసిన
శైవము మేముచెప్పినట్లు సంకర శైవమగునుగాని యది వీరశైవ
మెట్లగును? వీరశైవులన నెవరో శైవశాస్త్రమే యిట్లు నిర్ణయించి
యున్నది.

శ్లో॥ విద్యాయాం రమతేనిత్యం । మాయాం హేయాంశ్వవద్రహేత్
అనేనైవనిరుక్తేన । వీరమాహేశ్వరస్స్మృతః ॥

విద్యనార్జించుకొని హేయమైనమాయను గుక్కనువలె
ద్రోలినవాడు వీరశైవుడని పైశ్లోకమునకర్థము. విద్యయనవేమో
శైవశాస్త్రమే యిట్లుచెప్పుచున్నది వినుడు.

శ్లో॥ వేదాంతజన్యం యద్జ్ఞానం । విద్యేతి పరిగీయతే
విద్యాయాం రమతేయో వై । వీర ఇత్యభిధీయతే ॥

విద్యయన వేదాంతజన్యమగు జ్ఞానమనియు నందు వర్తించు
వాడే వీరశైవుడనియునీ శ్లోకమునకర్థము. వేదాంతములన ఉపని
షత్తులుకదా? ఆయుపనిషత్తులకు ద్విజశ్రేష్ఠులే పఠనార్హులుకానీ
సకలశాస్త్రములు చెప్పియున్నవి. ఆచారము నడుచుచున్నది. ఇట్లు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డగా నుపనయనమువలదని మాలమాదిగెలలో జేరి వివాహము చేసి
కొని మనిన బసవనికిఁగాని యా మాలమాదిగెలకుఁగాని యుపనిష
త్తులను జదువుట కధికార మేది? ఆ యధికారములేని వానికిఁ దజ్జన్య
మైన జ్ఞానమెట్లు లభించును? అది లభించనినాడు వాడు వీరశైవు
డెట్లగును? వీరశైవుడు కానివాడు వీరశైవమతము నుద్ధరించు టెట్లు?
ఒక మతము మొదటనుండి మధ్యకాలమున జెడిన యెడఁ దరువాత
దానిని బాగుచేయుటకుఁ బునరుద్ధరణమని పేరుకదా? అపుడు బస
వనికి ముందొకప్పుడు బసవనివలెనే యుపనయనము మానుకొని
చండాలురలోఁ జేరి పెండ్లిచేసికొని ప్రవర్తించెడి వీరశైవ మత మొకటి
యుండి యది యాయన తల యెగఁగట్టిననాటికి క్షీణదశకు రాఁగా
దానిని బసవడు బునరుద్ధరించినాడని కదా రావుగారి వ్రాతసారము?
అటులేని బసవడు వర్ణసంకరశైవమును బునరుద్ధరించినాడని వ్రా
యుట ధర్మమగునుగాని వీరశైవమతమును బునరుద్ధరించినాడని
వ్రాయుట ధర్మమా? ఈ వ్రాత సత్యమునకును ధర్మమునకును విరు
ద్ధమై శైవాపకర్షావహమై యుండలేదా? కాన నిపుడీ సత్యేతర ప్రసం
గమును సంస్కరించుకొని యికమీద నిట్టి యప్రస్తుత ప్రసంగము
లను వ్రాయకుండుట యుచితమని మా వంగూరు సుబ్బారావుగారిని
హెచ్చరించుచు నింతట నీవిషయము నుపసంహరించుచున్నారము.

## — ఉ ప సం హా ర ము —

బసవడు ద్విజపుత్రుడు. అత డుపనయనము మానుకొని
వ్రాత్యుడై చండాలురతోఁ జేరి కన్న తలిదండ్రులు మున్నగువారిచే
బహిష్కృతుడైన వాడు. అందుచేఁ బతితుడయ్యెను. పతితుడు ద్విజ
పుత్రుడైనను వానిని బ్రాహ్మణుడని ప్రాజ్ఞులు వ్యవహరింపరాదు.
వంగూరు సుబ్బారావుగారికి శ్రుతిస్మృత్యాది శాస్త్రమర్యాదలు
తెలియవు. అందుచే వారు పతితుడగు బసవని నారాధ్యబ్రాహ్మణు
డని వ్యవహరించినారు. రావుగారు శైవశాస్త్రముల నెరుంగరు. దా
నంజేసి బసవడు సంకరశైవమును వృద్ధిచేసినది తెలియక వీరశైవమత
మును వృద్ధిచేసినాడని వ్రాసిరి. వీరశైవులన బ్రాహ్మణులు. బసవడు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బ్రాహ్మణజాతి భ్రష్టుఁడు. వీరశైవుడు కాఁడు. అతఁడు సంకరశైవుడు. అతడు వీరశైవ మతమును గొంత చెడఁగొట్టినవాడని యీ విమర్శ నుబట్టి స్పష్టమగుచున్నది. వీరశైవ మతమును జెడఁగొట్టినవాని దన్మతోద్ధారకునిగాఁ బ్రాజ్ఞులు చెప్పరు. చెప్పినను వినరని విశ్వసించి యింతట విరమించుచున్నారము. —పత్రికాధిపతి.

## భక్తస్మరణము.

:(o):

భక్తులను స్మరించుట భక్త స్మరణ మనిపించుకొనును. భక్తి యనఁ బూజ్యులయెడఁ గల యనురాగము. భక్తుడన తన భక్తిచే భగవంతుని మెప్పించి యా భగవంతుని యనుగ్రహ మార్జించుకొనినవాడు. ఇట్టి భక్తునికిని భగవంతునకును భేదములేదని శాస్త్రములు చెప్పియున్నవి. కాన భగవంతుని స్మరించుట వంటిదే భక్తుని స్మరించుట యని తేలుచున్నది. అట్టి భక్తుని స్మరణమును బోధించునది కాన నీ వ్యాసమునకు భక్త స్మరణ మను నన్వర్థ నామకరణము గావింపఁబడినది. భక్తులు రెండు విధముల నుందురు. వారెవ్వరన? స్మరణీయులు, స్మరణీయులు కానివారు ననువారు. ముందు స్మరణీయులను గూర్చి విచారించుకొని పిదప స్మరింపరాని భక్తులను గూర్చి ముచ్చటించుకొందము.

### స్మరణీయ భక్తుఁడు.

భగవంతునితో సముఁడగు భక్తుడు మనకు స్మరణీయుడు (తలంపఁదగినవాడు.) పూజ్యుడు నగుచున్నవాడు. అదెట్లన? ఈవిషయమై పరాశర మాధవీయమున ౭౧ పుటను మాధవ విద్యారణ్యులవారు శ్రుతి నిట్లు చూపియున్నారు.

"యస్య దేవే పరాభక్తిః । యథా దేవే తథా గురౌ
తస్యైతే కథితా హ్యర్థాః । ప్రకాశంతే మహాత్మనః॥"

ఈ శ్రుత్యర్థమునే ... శైవ... యిట్లు చెప్పియున్నది. చూడుడు. ౧ పుట,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"యస్యదేవే యథాభక్తిః । శివభక్తే తథాగురౌ
తస్యపాణితలె ముక్తిః । స్థితాహస్తబిల్వవత్ ॥"

ఎవని కెట్లు దేవునియందు భక్తి యవసరమో యతని కట్లు గురువు (చరుసి) నందును భక్తి యవసరము. ఆ భక్తునికి హస్తము నందలి మారేడు పండువలె ముక్తి కరగతమైయుండును. ఈ విషయమునే యింకొక విధమున శైవపంచకము శైవ సిద్ధాంత శిఖామణిని జంగమ పూజాస్థలమం దిట్లు విపులముచేసి చెప్పియున్నది.

శ్లో॥ లింగంచద్వివిధంప్రోక్తం । జంగమాజంగమాత్మనా
అజంగమేయథాభక్తి । ర్జంగమేచతథాస్మృతా
అజంగమంతుయల్లింగం । మృచ్ఛిలాదివినిర్మితం
తత్పరంజంగమంలింగం । శివయోగీతివిశ్రుతం
అచరేమంత్రసంస్కారా । ల్లింగేవసతిశంకరః
సదాకాలంవసత్యేవ । చరలింగేమహేశ్వరః
శివయోగీశివస్సాక్షా । దితికైంకర్యభక్తితః
పూజయేదాదరేణైవ । యథాలింగంతథాచరమ్ ॥

అనఁగ జంగమము, అజంగమము నని లింగము రెండు విధములఁ బరగును. అజంగమ మన మృత్తు, శిల మున్నగువానితోఁ జేయఁబడిన లింగము. జంగమ మన శివయోగి యగు భక్తుఁడు. స్థావర లింగమునందు మంత్ర సంస్కారముచే శివుడు వసించును. చరునియం దిట్లుగాక యెల్లపుడు శివుడు వసించియుండును. గాన శివయోగి యగువాడు లింగమును శివుడని నమ్మి భక్తితో నెట్లు బూజించునో యట్లు శివయోగిని శివుడని నమ్మి బూజించవలయును. ఈ చెప్పినదానింబట్టి శివునికిని శివభక్తునికిని భేదము లేదనియు శివుని స్మరించినట్లె భక్తుని స్మరించవలెననియు స్పష్టమగుచున్నది. ఇంతియెగాక శివ స్మరణమువలన మన కేయే ప్రయోజనములు సిద్ధించునో భక్త స్మరణమువలననుగూడ నాయా ప్రయోజనములు సిద్ధించునని యవగతమగుచున్నది. ఈ భక్తులను భక్తిని బట్టి మనము రెండు విధములు విభజించుకొనవచ్చును. భక్తి రెండు విధములఁ గన్పడుచున్నది. అవేవన? చూడుడు. (శై॥ పు॥ ౨)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"సాభక్తిర్ద్వివిధాజ్ఞేయా। బాహ్యాభ్యంతర భేదతః
బాహ్యాస్థూలాంతరాసూక్ష్మా। వీరమాహేశ్వరాదృతా॥"

ఆ శైవభక్తి బాహ్యము, అభ్యంతరమునని రెండు విధముల గుచున్నదని తెలియవలెను. బాహ్యము స్థూలమనియు, ఆంతరము సూక్ష్మమనియుఁ జెప్పఁబడును. ఈ సూక్ష్మమె వీరశైవునిచే నాదరింపఁబడుచున్నది. ఆ భక్తి విధానములనే యిట్లు శైవపంచకము సురల వ్యక్తీకరించియున్నది.

శ్లో॥ సింహాసనే శుద్ధదేశే। సురమ్యేరత్న చిత్రితే
శివలింగస్య పూజాయా। సాబాహ్యభక్తిరుచ్యతే
లింగేప్రాణం సమాధాయ। ప్రాణేలింగంతుశాంభవం
సశరీరం మనఃకృత్వా। నకించిచ్చింతయేద్ధృది
సాభ్యంతరా భక్తిరితి। ప్రోచ్యతే శివయోగిభిః
సాయస్మిన్వర్తతేతస్య। జీవనం భృష్టబీజవత్
జీవన్ముక్తస్స విజ్ఞేయో। వీరమాహేశ్వరఃపుమాన్॥

శుద్ధప్రదేశమున మనోహరమును రత్న నిర్మితమును నగు పీఠముపై శివలింగమును బూజించుట యేదో యది బాహ్యభక్తి యనిపించుకొనును. లింగమందుఁ బ్రాణమును బ్రాణమునందు లింగమును నుంచి మనస్సును శరీరముతోఁ గూర్చి హృదయమునఁ గొంచెమేనియు నితర చింత రానీకయున్న నది యాభ్యంతర భక్తి యని శివయోగులచే ననిపించుకొనును. అటువంటి భక్తి యెవని యందుండునో వాని జీవనము పొట్లిపోయిన గింజవలె గనుపడుచుండును. అట్టి వీరమాహేశ్వరుఁడగు పురుషుఁడే జీవన్ముక్తుఁడగునని తెలియఁదగినవాఁడు.

ఇట్లనినఁ బీఠముపై లింగమును బూజించుట బాహ్యభక్తియగుననియు, లింగమునందు బ్రాణమును బ్రాణమునందు లింగమును నుంచి యజించినయెడ నది యాభ్యంతర భక్తియగుననియు మీరు చెప్పితిరి సరే. ఇందు మొదటిది వాఙ్మనఃకాయములు మూఁడింటిలోఁ గాయికమనియు రెండవది మానసికమనియు మన మేల తలంపరాదు? కరపీఠమున లింగము నర్చించుటను మనము బాహ్యభక్తి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యందే యేల చేర్చరాదు? అని కొందరు ప్రశ్నింపవచ్చును. వారికి సమాధానమును శైవపంచక మిట్లు చెప్పియున్నది.

పీఠముపై శివలింగార్చనమును జేయుటను బాహ్యపూజ (కాయికపూజ) యని మనము తెలిసికొనియున్నాము. ఆ విషయమై సంశయము లేదుకదా? కరపీఠమున శివలింగము నర్చించుట యను విషయమును గూడఁ గాయికపూజలోఁ జేర్చి మానసిక మన మనస్సునందే శివారాధన చేయుటయని చెప్పఁగొనరాదాయనికదా యిప్పటి మన సంశయము? ఇది సరికాదు. కరపీఠమున లింగార్చనమును జేయుటనే యాభ్యంతర భక్తి యని శంకరుడు శంకర సంహితా ముఖమునఁ జెప్పియున్నాడు. చూడుడు. గురువు శిష్యునికి లింగధారణము చేసి శివలింగార్చనక్రమము నిట్లుపదేశించవలెనని యున్నది.

శ్లో॥ స్వయంచప్రాఙ్ముఖోభూత్వా । గోమయేనోపలేపితే
మండలేస్థాపితంశిష్య । ముత్తరాభిముఖంగురుః
అభిషేకంతతఃకుర్యా । త్కలశస్థోదకేనసః
శిష్యదేహేతతశ్శక్తి । పాతంకృత్వాస్వవిద్యయా
పీఠస్థశివలింగేతు । శిష్యప్రాణంనిధాయచ
లింగంసంస్థాప్యతత్రాపి । ప్రాణలింగంభవేత్తతః
దత్వాశిష్యాయతల్లింగం । శ్రద్ధాభక్తియుతాయసః
నత్యజప్రాణలింగంత్వం । యావజ్జీవంప్రతిజ్ఞయా
పునర్భవోనతేవత్స । విద్యతేమాతృయోనిషు
ఇత్యుక్త్వాభిముఖంశిష్య । మానీయకృపయాపునః
వీరమాహేశ్వరంధర్మం । క్రమాదుపదిశేద్గురుః
వత్సలింగార్చనంనిత్యం । త్రికాలంకురుభక్తితః॥

గురువు తాను ప్రాఙ్ముఖుఁడుగా నుండి గోమయముచే నలుకఁబడిన స్థలమున రచింపఁబడిన మండలమున నుత్తరాభిముఖునిగా శిష్యుని గూర్చుండఁబెట్టి యతనిని బూర్వోక్త కలశోదకముచే నభిషేకించి పిదప స్వవిద్యచే శిష్యదేహమున శక్తిపాతము గావించి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యదివరకు సంస్కరింపఁబడి పీఠముపై నుంచఁబడియున్న లింగము

నందు శిష్యుని ప్రాణములను జేర్చి యా లింగమును శిష్య ప్రాణములందుఁ బ్రవేశపెట్టినయెడ నందుచే నా లింగము ప్రాణలింగమగును. దానిని శ్రద్ధాభక్తియుక్తుడగు శిష్యుని కిచ్చి "నీవీ ప్రాణలింగమును యావజ్జీవము త్యజింపవలదు. ఇట్లు వర్తింతువేని దిరిగి మాతృయోనులందుఁ బునర్భవము కలుగనేరదు." ఇట్లు దయతోఁ గురువు అభిముఖుడయిన శిష్యుని బిలిచి వీరమాహేశ్వర ధర్మమును క్రమముగా నుపదేశింపవలయును. అదేమన? ఓ చిన్నవాఁడా! నీవు భక్తితో నిత్యము మూడుకాలములందు లింగార్చనము చేయుమని. ఇట్లనఁగనే మీ రింతవరకుఁ జెప్పినదానింబట్టిచూడ నాభ్యంతర శివలింగార్చనము (ప్రాణలింగార్చనము)ను జేయవలెనని తెలియవచ్చినదే కాని యా లింగమును దేహమున ధరించి కరపీఠమునఁ బూజించవలసినదని కానరాదు. అది యెందులకుఁ జేయవలెనని కొందరడుగవచ్చును. అందులకు సమాధానముచు శంకరుడు శంకర సంహితాముఖమునఁ దన కుమారుడగు కుమారున కుపదేశించియున్నాడు. చూడుడు. ౫ పుటను.

"తదేవహస్తాంబుజపీఠమధ్యే । నిధాయలింగంపరమాత్మచిహ్నం
సమర్చయేదేకధియోపచారై । ర్నిగళ్ళబాహ్యాంతరభేదభిన్నైః"

పూర్వోక్తరీతిచే గురువిచ్చిన పరమాత్మ చిహ్నమగు లింగమును హస్తపీఠముననుంచుకొని తదేకబుద్ధితో బాహ్యాంతర భేదభిన్నములైన యుపచారములతోఁ బూజించవలెను. ఇట్లనిన నీ పూజవలని ప్రయోజన మేమని కొందరు ప్రశ్నింపవచ్చును. వారికి సమాధాన మా వెంటనే శైవపంచక మిట్లు చెప్పియున్నది. అదేమందురా? వినుడు.

"గురుప్రసాదాధిగతేష్టలింగం । సంపూజయన్తంస్వకరాబ్జపీఠే
మదాస్యభక్త్యాతివిధోపచారై । ర్నరస్తమాలోక్యవిముక్తిమేతి"

గుర్వనుగ్రహముచేఁ బొందబడినదియు, వివిధోపచారములచే స్వకరాబ్జ పీఠమునఁ బూజింపబడుచున్నదియు నగు నిష్టలింగమును జూచి నరుడు మోక్షమును బొందుచున్నాడు. శివపూజానంతరము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లింగమును ధరించవలసిన విధానమును నిట్లు శైవపంచకము తెలిపి యున్నది.

"ఏవమభ్యంతరద్రవ్య । సంభృతంశివపూజనం
కృత్వాహి దేహీసతతం । లింగం వస్త్రేణవేష్టితం
మస్తకేకంధరేకణ్ఠే । వక్షస్యథకరస్థలె
నాభేరధస్థాత్సతతం । ప్రమాదాన్నైవధారయేత్"

పూర్వోక్తరీతిని బాహ్యాభ్యంతరద్రవ్యసంభృతమగు శివపూజనమును జేసి నరు డెల్లప్పుడును వస్త్రవేష్టితలింగమును మస్తకమున, గంఠమున, గక్షును వక్షస్థలమునఁ గరస్థలమున వీనిలో నొకదానియందు ధరించవలయును. పొరపాటుననుగూడ నాభికధోభాగమున ధరింపరాదు.

ఇట్లు లింగధారులగు శైవులు శ్రుత్యుక్తములగు స్వజాత్యాశ్రమ ధర్మములను విడిచి యన్యజాత్యాశ్రమోచిత ధర్మములను జరింపరాదు. చరించినయెడ వారు పతితులు (కులభ్రష్టులు) లగుదురని శైవపంచక మిట్లు చెప్పియున్నది.

"స్వజాత్యాశ్రమధర్మంయః । త్యక్త్వా వేదోదితంనరః
అన్యజాత్యాశ్రమాచారం చరేత్సపతితోభవేత్"

ఈ చెప్పినదాని బట్టిచూడ శైవులు మతమునందు భేదించకున్నను జాతిభేదముల ననుసరించి విభాగింపఁబడుదురని మనము తెలిసికొనియుండవలెను. ఆ జాతులు నాలుగుగాఁ గన్పడుచున్నవి. అవేవన? బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రజాతులు ననునవి. వీని గుణములును వానింబట్టి కర్మలును భేదముగా గల్పింపఁబడియున్నవి. ఈ విషయమై శైవపంచకమునం దిట్లు చెప్పఁబడియున్నది. చూడుడు. 33 పుట.

"అధ్యాపనంచాధ్యయనం । దానంయజనయాజనే
ప్రతిగ్రహంబ్రాహ్మణానాం । షట్కర్మాణిప్రచక్షతే"

అధ్యాపనము, అధ్యయనము, దానము, ప్రతిగ్రహము, యజనము, యాజనము ఈ యాఱును బ్రాహ్మణ శైవధర్మములని శాస్త్రములు చెప్పియున్నవి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"దానమధ్యయనంయజ్ఞం । త్రీణిరాజన్యవైశ్యయోః"

దానము, అధ్యయనము, యజ్ఞము, ఈ మూడు ముక్తిమార్గములగు కర్మలు క్షత్రియ వైశ్య శైవధర్మములు. తక్కినవానియందు క్షత్రియ వైశ్యులు భేదించియున్నవారు. ఆ విషయము నీ క్రింది శ్లోకములు చెప్పియున్నవి.

"శస్త్రజీవోమహీరక్షా । హ్యపలాయనమాహవే
క్షత్రియాణామయంధర్మ । స్స్వధర్మమనుయాయినాం"

శస్త్రజీవనము, మహీరక్షణము, యుద్ధమున భీతిలి పరుగిడకుండుట ఇవి స్వధర్మానుష్ఠానపరులగు క్షత్రియ శైవుల ధర్మములు ఇఁక వైశ్య ధర్మముల నిట్లు చెప్పియున్నది.

"కృషివాణిజ్యగోరక్షా । ధర్మోయంసహజోవిశాం"

కృషి (వ్యవసాయము) వాణిజ్యము, గోరక్షణము ఇవి వైశ్య ధర్మములు. అటుపై శూద్ర ధర్మము లిట్లు చెప్పఁబడియున్నవి.

"శూద్రస్యద్విజశుశ్రూషా । రతానాంకామకర్మచ"

శూద్రులకు ద్విజ శుశ్రూషయు ననురాగవతులగు సతులందుఁ గామము తీర్చుకొనుటయు నను రెండు ధర్మములు కలవు.

ఈ చెప్పిన దానింబట్టిచూడ జాతిభేదముల ననుసరించి శైవులును నాలుగు తెగలుగ నుందురని మనము గ్రహింపఁగలిగితిమి. ఇందు జాతిభేదములు నిసర్గజములనియు మతము లట్లుగాక యైచ్ఛికములనియు మనము జ్ఞప్తియందుంచుకొనవలయును. ఇంతియెగాక యీ శైవులు ప్రవర్తించవలసిన విషయమును గూర్చి శైవపంచకమిట్లు చెప్పియున్నది.

"ముహూర్తంవాపిజీవేత । నరశ్శుక్లేనకర్మణా
నచవర్షశతేనాపి । నరఃకృష్ణేనకర్మణా"

ఒక ముహూర్తకాలము (రెండు మున్నావు గడియలకాలము) జీవించినను సరే మనుజుడు శుక్ల (పుణ్య) కర్మచే జీవించవలయును. అంతియెకాని కృష్ణ (పాప) కర్మచే నూరుసంవత్సరముల కాలముదాఁడ జీవింపరాదు. ఇట్లనినఁ బుణ్యకర్మ యేదియో పాప

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్మ యేదిగనో మన మించుక విచారించుకొనవలసివచ్చినది. ఈ
షయమై శైవపంచక మిట్లు చెప్పియున్నది.

"స్వజాతివిహితంధర్మం । వినింద్యమపిచేతరైః
ఇహాముత్రసుఖాకాంక్షీ । కుర్వీతమనుజస్సదా"

ఇహపరలోక సుఖములను గోరు నరుడు పరులచే నిందింపఁ
బునదియైనను స్వజాతి విహిత ధర్మమును జేయుచుండవలెను.
ట్లనిన విహితధర్మ మేదో యవిహితధర్మ మేదో మన కెట్లు తెలి
యునని కొంద ఱడుగవచ్చును. వారికి సమాధాన మిట్లు శైవపం
చకము చెప్పియున్నది. చూడుడు. 33 పుట.

"శ్రుతుస్మృత్యుదితంధర్మం । నిత్యనైమిత్తికాశ్రయం
కుర్యాల్లింగాంగసంబంధీ । ద్విజన్మాకామవర్జితః"

కామవర్జితుడును లింగాంగ సంబంధియు నగు ద్విజుడు
(బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులలో నెవఁడైనను) నిత్య నైమిత్తిక కామ్య
కర్మలను జేయుచుండవలెను. ఇట్లు చెప్పఁగనే జాతి మతధర్మములు
రెండు కలవని యిందువలనఁ దెలియఁవచ్చినది. అవి యొకవేళ నొక
దానితో నొకటి విరోధించినయెడ నపు డేమిచేయవలెనని కొంద
ఱడుగవచ్చును. వీరి ప్రశ్నకు శైవపంచక మిట్లు ప్రత్యుత్తర మిచ్చు
చున్నది. చూడుడు. 32 పుట.

"ధర్మంయోబాధతేధర్మో । నసధర్మఃపరంతప
అవిరోధస్తుయోధర్మ । స్సధర్మస్సద్భిరుచ్యతే"

ఒక ధర్మమును మరియొక ధర్మము బాధించినయెడ నది
ధర్మము కానేరదు. ఏ ధర్మమవిరోధముగ నుండునో యది ధర్మ
మని సత్పురుషులచేఁ జెప్పఁబడును. ఈ చెప్పిన దానింబట్టి జాతి
మతధర్మముల కొకప్పుడు విరోధము కన్పడినయెడ నా విరోధమును
పరిహార మగునటుల సమన్వయించుకొని యా యవిరోధ ధర్మమునే
యనుష్ఠించవలెనని మనము గ్రహించవలెను. ఇట్లనినఁ బరమేశ్వ
రానుగ్రహమునే గోరు మనకు ముక్తియే కావలెను కదా. అట్టిదుల కీ
జాతి ధర్మానుష్ఠాన మెందులకు? పరమేశ్వరారాధనము చేసి భక్తిచే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముక్తిని గడించుకొనరాదా? అని కొంద రడుగవచ్చును. ఆ భుక్తి ముక్తుల నార్జించుకొనుటకు విధ్యుక్త కర్మానుష్ఠాన మవసరము. అది లేకున్న భుక్తి ముక్తులు సిద్ధింపనేరవు. ఈ విషయమై శైవపంచక మిట్లు ప్రత్యుత్తర మిచ్చుచున్నది. చూడుడు. 33 పుట.

"విధ్యుక్తకర్మానుష్ఠానా । చిత్తశుద్ధిర్భవేద్ధ్రువం
చిత్తశుధ్యాభవేద్భక్తిః । భక్తిరవ్యభిచారిణీ
తయాసంజాయతేజ్ఞానం । నశ్యత్యజ్ఞానమాత్మనః
తస్మాన్మోక్షస్తతఃకర్మ । విధ్యుక్తంసమ్యగాచరేత్"

విధ్యుక్త కర్మానుష్ఠానమువలనఁ జిత్తశుద్ధియుఁ జిత్తశుద్ధివలన నచంచలమైన భక్తియు, భక్తివలన జ్ఞానమును, జనించును. దాని వలన నజ్ఞానము నశించును. అందువలన మోక్షము లభించును. కాన మానవుడు విధ్యుక్తమగు కర్మ తప్పక లెస్సగాఁ జేయవలెను. ఇట్లనిన విధ్యుక్త కర్మకదా చేయవలసినది? విధి యన నేమి యని కొంద రడుగవచ్చును. సమాధానము వినుడు. వేదశబ్దమునకుఁ బర్యాయముగ విధి యనుపదము శాస్త్రములం దుపయోగింపఁ బడును. గావుననే శైవపంచకము మరలఁ బై విషయమునే వేదశబ్దముచేఁ బరామర్శించియున్నది. చూడుడు. 3౬ పుటను.

"తస్మాత్సుఖమిహాముత్ర । యదస్త్యాయాససాధ్యకం
స్వజాతివిహితంకర్మం । కుర్యాద్వేదోదితంనరః
స్వజాతివిహితాద్ధర్మా । ద్వేదస్మృత్యుదితాత్క్రమాత్
పుంసఃపాపనివృత్తిస్స్యా । త్తయాశుద్ధిస్తుచేతసః
చిత్తశుధ్యాతువిశ్వాస । శ్శ్రుతిస్మృతిషుజాయతే
తస్మాద్భక్తిర్భవేత్పుంస । శ్శివేపరమకారణే
భక్త్యాజాయేతసతతం । సంస్మృతేర్ధ్యానదర్శనం
తస్మాదిహపరత్రాపి । భోగేషువిరతిర్భవేత్
తయావేదాంతవాక్యార్థే । శివరూపప్రకాశకం ।
సమ్యగ్జ్ఞానంభవేత్తేన । ముక్తిఃపుంసోభవేద్ధ్రువం
తస్మాన్మాహేశ్వరోవిప్రః । శ్రుతిస్మృత్యాద్యనోదితం
వర్ణాశ్రమోచితంధర్మం । ప్రాణత్యాగేపిసత్యజేత్"

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పూర్వకథ పరలోకమునకు బోవు పురుషునకు ధర్మాధర్మములు మాత్రమేకూడ వచ్చునవి. ఇతరములు రావు. అని చెప్పియా కారణముచే నిహపరలోకములం దాయాస సాధ్యమైనదియు స్వజాతి విహితమును వేదోదితమును నగు ధర్మమును మానవు డాచరింపవలెను. వేదోదితమయిన స్వజాతి విహిత ధర్మానుష్ఠానముచేఁ బురుషునకుఁ బాపనివృత్తియగును. దానిచేఁ జిత్తమునకు శుద్ధి కలుగును. చిత్తశుద్ధిచే శ్రుతి స్మృతులయందు విశ్వాసము జనించును. విశ్వాసమువలనఁ బరమకారణుఁడైన శివునియందు భక్తి లభించును. భక్తిచే సంసారమంఁదలి దోషము గన్పడును. దానివలన నిహపరలోక సుఖములందు విరాగము కలుగును. అందుచే వేదాంతవాక్యార్థమందు శివరూప ప్రకాశకమైన జ్ఞానమును దానివలన మోక్షమును నరుడు పొందుచున్నాడు. ఆ కారణముచే లింగధారి బ్రాహ్మణుడు శ్రుతి స్మృత్యాగమోక్తమైనదియు వర్ణాశ్రమోచితమును నగు ధర్మమును బ్రాణత్యాగమందుఁగూడ (అనఁగఁ బ్రాణము లాడుచున్నంతవరకు) విడువరాదు. ఈ చెప్పిన దానింబట్టి శైవులకు శివారాధనమువలెనే వేదోక్త ధర్మముగూడ ననుష్ఠించక తప్పనిదని ధృవపడినది.

ఇట్లు చెప్పఁగనే శివోక్తధర్మము లనుష్ఠేయము లగుఁగాని వేదోక్త ధర్మము లనుష్ఠేయము లగునా? అని కొందరడుగవచ్చును. ప్రత్యుత్తరము వినుడు. వేదములు శివముఖోద్గతములు. కాన నవి శివోక్త ధర్మములే యగుచున్నవి. అది యెచటఁ గలదందురా? వినుడు. సూతసంహిత యీ విషయమై యిట్లు చెప్పియున్నది. అదేమన ?

"బ్రహ్మాణం మునయఃపూర్వం । సృష్ట్వావత్సైమహేశ్వరః
దత్తవానఖిలాన్ వేదాన్ । ఆత్మన్యేవస్థితానిమాన్ ॥"

ఈ శ్లోకమునకు విద్యారణ్య యతీంద్రులవా రిట్లు వ్యాఖ్యానము గావించియున్నారు.

"స్వయమేవలీలయా సకలవేదగ్రహణసమర్థం బ్రహ్మాణం సృష్ట్వాత్మన్యేవ స్థితా ఏవవేదాః తస్మైదత్తా ఇత్యర్థః"

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మహేశ్వరుడు సకలవేదగ్రహణ సమర్థుడగు బ్రహ్మను ముందు సృజించి యతనికి తన యందెల్లప్పుడును నసించియున్న వేదములను నిచ్చెను. ఇందువలన వేదములు శివాజ్ఞారూపములని మనము గ్రహింపఁగలిగితిమి. వర్ణాశ్రమ ధర్మములు శివోక్తములు. వానినుల్లంఘించి వర్తించువాడు శివాజ్ఞను నుల్లంఘించినవాడగును. ఈ విషయమును గ్రింది శ్లోకము చెప్పుచున్నది.

"వర్ణాశ్రమసమాచారా। శ్శివేనకథితాః పురా
ఏతానుల్లంఘ్యవర్తంతే। శివస్యాజ్ఞాపలాపినః॥"

ఇట్లు వర్ణాశ్రమోచితములగు వేదోక్తధర్మముల నాచరించి శివుని బూజించువారు మాహేశ్వరు లగుదురని శివుడే యిట్లు చెప్పియున్నాడు. చూడుడు. 32 పుట.

"స్వజాతివిహితం ధర్మం। సర్వంతః పూజయంతియే
భక్త్యా శ్రీకంఠమనిశం। తేపిమాహేశ్వరాస్స్మృతాః॥"

ఈ మాహేశ్వరులు వేదోక్త ధర్మముల ననుష్ఠించినయెడ వారికి లభించు ఫలములను గ్రింది వచనములు తెలుపుచున్నవి. చూడుడు. శై: 32 పుట.

"చోదనాలక్షణం ధర్మం। శివేనాజ్ఞప్తమత్యజన్
శంకరం పూజయేద్యస్తు। తస్మై సాంబః ప్రసీదతి
ప్రసన్నే సతిదేవేశే। మహానందే సదాశివే
దుష్కరం కిముమర్త్యస్య। త్రిషులోకేషు విద్యతే
మహానందే మహాదేవే। మహాకారుణికోత్తమే
ప్రసన్నే సతిమూఢోవా। పతంగోవా విముచ్యతే
తస్మాత్ప్రసాదసిద్ధ్యర్థం। శివస్య పరమాత్మనః
ఆజ్ఞేతి వేదస్మృత్యుక్తం। నిత్యకర్మాచరేత్సుధీః॥"

వేదచోదితమగు ధర్మమును శివునిచే నాజ్ఞాపింపఁబడినదానిని విడువనివాడై యెవఁడు శంకరుని బూజించునో వానికి శివుడు ప్రసన్నుడగును. దేవేశుఁడును మహానందుఁడును నగు సదాశివుఁడు ప్రసన్నుడైనయెడ వానికి ముల్లోకములలోను దుష్కరమగు కార్యము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సునా! మహానంద స్వరూపుఁడును, మహాకారుణికోత్తముఁడును నగు మహాదేవుఁడు ప్రసన్నుఁడగు నేని వాఁడు మూఢుఁడుకాని కుంటి వాఁడుకాని ముక్తిని గాంచును. కానఁ బరమాత్మయగు శివునియొ క్క ప్రసాద సిద్ధికొఱకు శివాజ్ఞయని వేదశాస్త్రోక్తములగు నిత్య కర్మాదులను బుద్ధిమంతు డాచరించవలెను. వేదోక్తకర్మాచరణ పూర్వకముగ శివారాధనము చేయువారె శైవులు. వారే శివప్రి యులును లోకపూజ్యులును (స్మరణీయులును) నగుచున్నారు. ఇం తకు విరుద్ధముగ నడుచుచు వారు శైవాభాసు లగుదురు. అనఁగ వంచక శైవు లగుదురు. వారు స్మరణార్హులు కారు. ఇఁక వారింగూ ర్చియుఁ గొంత ముచ్చటించుకొందము.

## స్మరణానర్హ భక్తుఁడు.

భగవంతున కప్రియు లెవ్వరో వారు స్మరణీయులు కారు. వారెవ్వఁరన? ఎవరు విధ్యుక్తములయిన స్వజాతి విహితధర్మములను విడిచి శివుని బూజింతురో వారు. వాని పూజను శివుఁడు పరిగ్ర హింపఁడని శివుడే చెప్పియున్నవాఁడు. చూడుఁడు. శై 32 పుటను.

“కర్మవిధ్యుక్తముత్సృజ్య । స్వజాతివిహితంపరాః
యేర్చయంతిశివం తేషాం । పూజాంగృహ్ణాతి నేశ్వరః॥”

ఇంతియె కాదు. వర్ణాశ్రమధర్మములు పూర్వము శివునిచేఁ జెప్పఁబడినవి. వాని నెవ్వరుల్లంఘించి వర్తింతురో వారు శివాజ్ఞ నుల్లంఘించినవా రగుదురు. రాజాజ్ఞను మీఱినవారి కెట్లు దండనము తప్పక సంభవించునో శివాజ్ఞను మీఱినవారికి నరకమే దండనము ధ్రువము. శివునిచే నాజ్ఞాపింపఁబడిన ధర్మమును వదలి యెవఁడు శివా రాధనము గావించునో వానిపై శివుఁడు స్వాజ్ఞను మీఱినాఁడను కార ణమున నాగ్రహము పొందును. శివాగ్రహమునకుఁ బాత్రుఁడైనవాఁడు మనకు స్మరణీయుఁడగునుగాని శివుని యాగ్రహమునకుఁ బాత్రుఁ డైనవాఁడు స్మరణీయుఁడు కాఁడు. పై యర్థమును సూచించు వచనము లివి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"వర్ణాశ్రమసమాచారా । శ్శివేనకథితాఃపురా
ఏతానుల్లంఘ్యవర్తంతే । శివస్యాజ్ఞాపలాపినః
రాజాజ్ఞాభంగకృన్నౄణాం । యథాదండోభవేద్ధ్రువం
శివాజ్ఞాభంగకృన్నౄణాం । దండోపినరకస్తథా
సాం బేనళంభునాజ్ఞప్తం । ధర్మంత్యక్త్వార్చయేచ్ఛివం
యస్తస్మైకుప్యతిశివః । స్వాజ్ఞాభంగనిమిత్తతః॥"

ఇంతియేకాను. భక్తునికి సంధ్యావందనము తప్పక చేయవల సిన కార్యము. అది యెవడు విడుచునో వాడు మాహేశ్వరాధ ముఁడగును. ఈ విషయమై శైవశాస్త్రమిట్లు చెప్పియున్నది. చూ డుడు. 3౦ పుటను.

"మాహేశ్వరస్సదాకుర్యా । త్సంధ్యోపాస్తింత్రిసంధిషు
సహంతిసూర్యంసంధ్యాయాం । నోపాస్తింకురుతేచయః
సూర్యోహ్యముఖ్యశరీరంయ । చ్ఛివస్యపరమాత్మనః
యస్తస్యోపాసనంకుర్యా । త్సశివార్చనకృద్భవేత్
లింగాంగసంగినోపాస్యా । సంధ్యాకాలత్రయేష్వపి॥"

మాహేశ్వరుడగువాడు సంధికాలముల మూటియందును సంధ్యావందనము చేయవలెను. అట్లు చేయనివాడు సూర్యుని జం పిన వాడగును. సూర్యుడు శివునికి ముఖ్య శరీరము. కాన నెవడు సూర్యోపాస్తి చేయునో వాడు శివార్చనచేసినవా డగును. ఇట్లు సంధ్యోపాసనమును జెప్పి యటుపైఁ జేయనివానిం గూర్చి యిట్లు చెప్పియున్నది.

శ్లో॥ సంధ్యాయాముచితంకర్మ । యస్త్యక్త్వార్చయతిశ్వగం
సతామసఇతిజ్ఞేయో । భక్తోమాహేశ్వరాధమః॥

సంధికాలములందుఁ జేయవలసిన కర్మను విడిచి యెవడు శివారాధనము చేయునో వాడు మాహేశ్వరాధము డగు తామస భక్తుడు. వీడె పతితుడనికూడఁ జెప్పఁబడును. అదెట్లన? సంధ్యా వందనము మున్నగునవి నిత్యకర్మలనఁబడును. వాని నాచరింపని వాడు పతితుఁడని యీ క్రింది విధమున నిర్ణయింపఁబడియున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ ఏకస్మిన్ దివసేయస్య । నిత్యకర్మచ్యుతిర్భవేత్
సపంచాక్షరసాహస్రం । జపేత్తత్పాపశాంతయె
మాసేనిత్యక్రియాహానిః । యస్యపుంసోభిజాయతె
ప్రాయశ్చిత్తేనమహతా । శుద్ధిమాప్నోత్యనాపది
సంవత్సరేక్రియాహానిః । యస్యపుంసోభిజాయతే
తస్యావలోకనాత్సూర్యో । నిరీక్ష్యస్సాధుభిస్సదా॥

ఒక దినమున నెవ్వనికి నిత్యకర్మచ్యుతి కలుగునో వాఁడాపాప శాంతికొఱకు సహస్ర పంచాక్షరీ జపమును జేయవలయును. ఒక మాసముకాల మాపత్తులేక నిత్యకర్మచ్యుతి గాంచెనేని వానికి గొప్ప ప్రాయశ్చిత్తము విధింపఁబడును. ఇఁక నొక సంవత్సర కాలము నిత్యకర్మ లోపించెనా వాని ముఖావలోకనమున వచ్చెడి పాపశాంతికై సూర్యావలోకనము చేయవలయును. ఇంతియెకాదు. శివోక్తమగు జాతి మర్యాద నెవడు మీరునో వాడు సర్వకర్మ బహిష్కృతుఁడగు పాషండుఁడగునని యీ క్రింది వచనములు చెప్పుచున్నవి.

శ్లో॥ వర్ణాశ్రమాణాంమర్యాదా । శివేనస్థాపితాయది
యస్తాంత్యజతిమోహేన । సశ్శీకంఠాపరాధకృత్
శివోక్తాంజాతిమర్యాదాం । యోతీత్యభువివర్తతే
సపాషండఇతిజ్ఞేయః । సర్వకర్మబహిష్కృతః

వర్ణాశ్రమ ధర్మములు శివునిచే స్థాపింపఁబడినవి. ఎవఁడు మోహముచే వానిని వదలునో వాఁడు శివాపరాధము చేసినవాఁడగును. శివోక్త జాతి మర్యాదను నెవఁడు మీరి భూమియందు వర్తించునో వాఁడు సర్వకర్మలందు బహిష్కరింపఁదగిన పాషండుఁడగును. పైకి భక్తునివలె నటించుచు నెవఁడు స్వజాత్యాశ్రమ ధర్మములను బరిత్యజించునో వాఁడు స్మరణీయుఁడు కాఁడనుటకింతకన్న నేమి ప్రమాణములు కన్పరచవలెను? ఇట్లనిన నిందు స్వజాత్యాశ్రమ ధర్మములను బరిత్యజించినవానిని సర్వకర్మలందు బహిష్కరించవలెనని కలదుకాని వానిని స్మరించరాదని [illegible] కొంద రు ప్రశ్నింతురేమో! ఈ ప్రశ్న చేయఁదగినది కాదు. అదేమన?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జాత్యాశ్రమ ధర్మత్యాగి యగు శైవుడు సర్వకర్మ బహిష్కృతు డనియెడి యర్థము ద్యోతకమగుచునేయున్నది. అయినను ప్రశ్నకు మనము సమారాధానము చెప్పలేదనుమాట మనకేల? ఆ పని కూడ దీర్చుకొందము. ఇందు బహిష్కృతు డనుమాట జ్ఞప్తియం దుంచుకొని మనము శైవపంచకము తొమ్మిదవ పుటను జూతము. అట స్పష్టముగా బహిష్కృతుని స్మరింపరాదని యున్నది. ఇటు చూడుడు.

శ్లో॥ నేక్షేతపూజావేళాయాం । వరంవత్సబహిష్కృతం
శివద్రోహిణమాచార । నిందకంనహృదిస్మరేత్॥

శివద్రోహియు, నాచారనిందకుడును, బహిష్కృతుడు నను నరుని బూజావేళయందుఁ జూడరాదు. హృదయమున స్మరింపరాదు. ఇంతవరకు స్మరింపఁదగినవారిని స్మరింపరానివారిని దెలిసికొంటిమి. ఇటువంటివారు ప్రపంచమునఁ గలరా యని కొందరికి శంక పొడమవచ్చును. తన్నివృత్తికై యిఁక నించుక యత్నించుదము.

స్మరణీయ భక్తులు.

వీరు సాత్వికులైయుందురు. ఈ విషయమై శైవపంచక మిట్లు తెలిపియున్నది. చూడుడు. శై॥ 3౮ పుట.

శ్లో॥ శ్రుతిస్మృత్యుదితంధర్మం । నిత్యంనైమిత్తికాశ్రయం
కృత్వార్చయతియశ్శంభుం । సభక్తస్సాత్వికస్మృతః
యస్సాత్వికోలింగధారీ । విధివన్నిత్యకర్మకృత్
నీలకంఠస్యదేవస్య । ప్రియోభక్తస్సఈరితః

నిత్య నైమిత్తికాదికమగు శ్రుతి స్మృత్యుక్త ధర్మమును నను ష్ఠించి యెవడు శివు నర్చించునో వాడు సాత్వికభక్తు డనిపించుకొనును. ఆ సాత్విక భక్తుడే శివునికిఁ బ్రియుడు. ఇటువంటి భక్తులనే కులు కలరు. వారిలోఁ గొందరిని శైవపంచక గ్రంథాదిని బేర్కొని యున్నవారు. వారందరును వేదశాస్త్ర విహిత ప్రవర్తనము కల వారు. ఈ విషయము [illegible] యొక్కొకరిని గూర్చి యిట ముచ్చటించుకొందము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ శ్రౌతస్మార్తసదాచారం । పండితారాధ్యదేశికం
గృహిణంసర్వధర్మజ్ఞం । వందేప్రత్యక్షశంకరమ్॥

"శ్రౌత స్మార్త కర్మనిరతుడును, గృహస్థుఁడును, సర్వధర్మజ్ఞుడునునై ప్రత్యక్ష శంకరు డను బిరుద మందుకొనిన పండితారాధ్య దేశికునికి వందనముచేయుచున్నాను." ఇఁక స్మరణీయుడు కాని యొక భక్తుని గూర్చియు ముచ్చటించి యిక నీ విషయము ముగించుదము.

బహిష్కృత భక్తుడు.

స్మరణీయుడు కాడు. ఇందుల కుదాహరణముగ బసవ పురాణమునుండి బసవని నుదాహరణముగఁ దీసికొందము. ఇట్లనఁగనే బసవఁడు స్మరణీయుడు కాకుండుటకుఁ గారణ మేమని కొందరడుగవచ్చును. సమాధాన మేమన? బసవ డుపనయనము మానుకొనినవాడు, సంధ్యావందనాది నిత్యకర్మలను ద్యజించినవాడు, మాతృపితృ బంధు దూషకుఁడు, చండాలాది సంసర్గకలవాడు, సర్వకర్మబహిష్కృతుడునై యున్నవాడు కాన శైవాభాసకుడు, కనుక స్మరణీయుడు కాడు. ఈతని చరిత్రయే యీ విషయము కొంత మనకుపదేశింపఁగలదు. చూడుడు. సంస్కృత బసవపురాణమున నుపనయన ప్రయత్నమును

—* బసవోపనయన ప్రయత్నము *—

శ్లో॥ సంప్రాప్తేచాష్టమేవర్షే । మాదిరాజిస్సుధీమణిః
పుత్రోపనయనోద్యుక్తో । హింగుళీపురవాసినః
దేశాంతరాగతాన్విప్రాన్ । సమీపగ్రామవాసినః
ఆహూయబ్రాహ్మణాన్ సర్వాన్ । వేదశాస్త్రార్థపారగాన్
తైస్సార్ధంతుసభామధ్యే । ప్రోవాచమధురంవచః
పుత్రోమమాష్టవర్షోయం । బసవేశోమహామతిః
అతస్తస్యోపనయనం । కార్యమద్యద్విజర్షభాః
విమర్శనీయమధునా । లగ్నంసల్లక్షణాన్వితమ్॥

మాదిరాజను ద్విజవరుడు తన కుమారునకు ఎనిమిదవ వత్సరము ప్రాప్తించఁగనే యుపనయనము చేయ నిశ్చయించి దేశాంత

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాగతులును, స్వగ్రామ వాసులును నగు వేదశాస్త్రపారగులగు బ్రాహ్మణులను బిలిపించి సభామధ్యను మా పుత్రుడగు బసవేశునకు నెనిమిదవ వత్సరము వచ్చినది యుపనయనము చేయవలెను. గాన సల్లక్షణములతోఁ గూడిన లగ్నమును విచారించి చెప్పవలెనని కోరెను.

శ్లో॥ ఇత్యేవంమాదిరాజస్య । వచశ్శ్రుత్వాసగౌరవం
విచారవత్సుసర్వేషు । బ్రాహ్మణేషుయదృచ్ఛయా
ఆజగామమహాశీలః । పృథుకోబసవేశ్వరః
అశేషవిప్రవాక్యాని । శ్రుత్వాప్రాహాతిదృష్టవత్
భోభోపితస్తదాఖ్యాహి । యదేతైస్తువిచింత్యతే॥

ఇట్లు మాదిరాజుగారి సగౌరవమగు వచనమును విని బ్రాహ్మణులందరు లగ్నవిచారణము చేయుచుండఁగా బసవేశుడు వచ్చెను. వచ్చి యా బ్రాహ్మణుల వాక్యములను విని కోపము తెచ్చుకొని యో తండ్రీ! వీరితో విచారించుచున్న కార్యమేమో తెలుపుమని యడిగెను.

శ్లో॥ "తవోపనయసంకల్పం । యతిష్యేబసవేశ్వర॥"

నీ యుపనయనము చేయుటకు యత్నించుచున్నానని మాదిరాజు సమాధానము చెప్పెను.

శ్లో॥ "కర్మోపనయనంకర్తుం । తాతనాంగీకరోమ్యహం॥"

తండ్రీ! నాకుపనయనము చేయుటకు నంగీకరించను. అని బసవడు చెప్పెను. ఇందులకుఁ గొన్ని యసంబద్ధ విషయములను గూడ నుపన్యసించి యటుపై నిట్లు తనలోఁదాను యోజించుట కారంభించెను.

శ్లో॥ తాతోమేదుష్టహృదయః । పాషండాచారతత్పరః
సర్వదావశమాప్తో ... । ... ... సాం
మయాసంబోధ్యమానోపి । నూనంనైవనివర్తతే॥

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శివ! శివా! వింటిరా పితృదూషణమును బ్రాహ్మణనిందను? నా తండ్రి దుష్టహృదయుఁడు పాషండాచార తత్పరుడు. దురాత్ములైన బ్రాహ్మణులకు నెల్లపుడు వశుడై నాచేఁ బోధింపఁబడియు నివర్తించడు. నిశ్చయము. ఇట్లు నిశ్చయించుకొని యుపనయనము మాని మేనమామ కూతును గంగమాంబను వివాహమై కక్కయాది చండాలురతో గలసి యాహారవిహారాదులు సలిపినట్లు బసవపురాణము చెప్పియున్నది.

పుత్రులు లేక యనేక వ్రతములు చేసి కన్న బసవని తలిదండ్రులగు మాదిరాజు మాదాంబికలు కులమువారగు బ్రాహ్మణులు బసవని బహిష్కరించిరి. అతడు వారిని విడిచి చండాలురతో చేరియున్నవాడు. ఇట్లు కులభ్రష్టుడైనకతననే క్రింది శైవపంచక వచన ప్రకారము బసవడు స్మరణీయుడు కాడయ్యెను.

శ్లో॥ నేత్రేశపూజావేళాయాం । నరంవత్సబహిష్కృతం
శివద్రోహిణమాచార । నిందకంనహృదిస్మరేత్॥

## ఉ ప సం హా ర ము.

బసవ డుపనయనము మానినవాడు. కావున స్వవర్ణాశ్రమ ధర్మదూరుడయ్యెను. అందుచే శివద్రోహియై యున్నవాడు. ఇది గాక వేదవిహితోపనయనాచారమును నిందించి విడిచినవాడు. కావుననే తలిదండ్రులు బంధువులు మున్నగువారిచే బహిష్కరింపఁబడినవాడు. కాన బసవడు స్మరణీయుడు కాడు. అతని చరిత్ర పఠనీయముకాదు. కనుక మా శైవసోదరులు స్వజాతి మతవిహిత ధర్మముల నాచరించి బసవనిపితలవలెనే జాతిమతదూరులను దూరీకరించి యిహాపరలోకసౌఖ్యములను క్రమముగఁ గాంతురుగాత.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# స్వవిషయము.

పాఠకమహాశయులార! శైవధర్మప్రకాశికను దుందుభి వత్సర మార్గశిరమున ప్రారంభించి పుష్యశుద్ధ పూర్ణిమసంచికతో రెండుసంచికలను నడిపియుంటిమి. తరువాత క్రమముగా నడుపవలెనన్న వేరులేఖకులు లేకుండుటచేతను మేము తరుచు ననివార్యములయిన కార్యాంతరములకొరకు గ్రామాంతరములకు వెళ్ళుచుండుటచేతను సక్రమముగ వెడలింపలేకపోయితిమి. మేమూరకున్నను గాలచక్రమూరకుండక తిరుగుచుండుటచే నాలుగుమాసముల సంచికలు నిలచిపోయినవి. ఇపుడు వానిని గలిపి దీసుకొనివచ్చుట దుర్ఘటమనియెంచి రుధిరోద్గారిసంవత్సర చైత్రాదిగా లెక్కింప నిశ్చయించుకొంటిమి. అందుచే గడచిన రెండుసంచికలను నీసంవత్సర చైత్రవైశాఖ మాస సంచికలనుగా నెంచుకొని యిపుడు జ్యేష్ఠసంచికను సిద్ధముచేసి యంపుకొనుచున్నారము. కావున పత్రికాధిపులకుండు కష్టములను గమనించెడి మాపాఠకులు మాయాలస్యమునకు మన్నింతురుగాత.

# వైశ్వదేవము.

మన లింగధారి బ్రాహ్మణులలో వైశ్వదేవముచేయువారు మిక్కిలి యరుదుగ నున్నవారు. ఇంతకుబూర్వమున బ్ర॥ శ్రీపతిపండితారాధ్యుల మార్కండేయశాస్త్రి గారును మేమును జేసియుంటిమి. గతసంవత్సరమున బ్ర॥ రెంటాల శరభయ్యశాస్త్రి గారొకరు చేసియుండిరి. ఇపు డిరువదియైదు వత్సరముల చిన్నప్రాయముననున్న వాడు విద్యావివేకాదుల విశేషముగ నార్జించియుండగనివాడు సత్కర్మరతుండు పరమేశ్వరానుగ్రహమున దీర్ఘాయువ్మంతుండై యింక శ్రౌతకర్మలనుగూడ జేయవలెనను కుతూహలములోనున్నవాడునగు కొంపల్లి దుర్గయ్యశర్మ యను మన యనుంగు మతసోదరుడు కడచిన వసంతకాలమున నిజామురాజ్యములోని నిర్మలపురవరమున నిర్మలమతిని వైశ్వదేవకర్మను జేసి నిత్యోపాసనాదికమును జరుపుకొనుచున్నాడను సంతోషవార్తను మాపాఠకులకు దెలుపుకొను మహాభాగ్యము మాకులభించినందులకు బరమానందమందుచున్నవారము. ఇంక నెందరో మనలో వైశ్వదేవము చేయవలెనను కుతూహలముకలవారుకలరు. వారందరు త్వరగ నాచరింతురని నమ్మియున్నారము.

—పత్రికాధిపతి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

:(౦):

# కలరా సంజీవి.

కలరాను నిర్మూలముచేయుటలో నిస్సందేహముగ నిది సంజీవియే. అనేక యోగ్యతాపత్రములు, బంగారుపతకములు పొందబడియున్నది

వెల సీసా 1కి రు. 1-0-0. గౌతమ మెడికల్ హాల్, బెజవాడ.

---

జి. యస్. వి. సరస్వతి రంతుచరిత్రాత్మకమగు

—* జాతివిభాగాదర్శము *—

ప్రథమ భాగము— వెల. రు 0-8-0.

బ్రాహ్మణేతర దుస్థితి

3 భాగములు — భాగము 1కి రు 0-2-0.

చండాలాస్పర్శ మండనము ... ... వెల రు 0-4-0

శ్రుతిధర్మసంజీవనీ పక్షపత్రిక, బెజవాడ.

సంవత్సర చందా.

| | | | |
|---|---|---|---|
| ప్రధానపోషకులకు | రు 12-0-0 | చందాదారులకు | రు 3-0-0 |
| అనుపోషకులకు | రు 6-0-0 | ఆరు మాసములకు | రు 2-0-0 |

---

హాల్దీఘట్ యుద్ధము:—ఇది 7 అంకముల చరిత్రాత్మక మగు నాటకము. రసపుత్రవీరుల శౌర్యపరాక్రమము లిందు చక్కగా వర్ణింపబడినవి. శైలీగనోహవునై ప్రదర్శనమున కత్యంతానుకూలముగ నుండును. వెల 0-12-0.

చిరునామా :— ముదిగొండ బసవయ్యశాస్త్రి, ముక్త్యాల, కృష్ణాజిల్లా.

శైవధర్మప్రకాశిక:—ఇది యొక మాసపత్రిక. ఇందు శైవధర్మములు వెల్లడింపబడును. అవి బాలబోధకములగు సవిమర్శక వ్యాసములుగ నుండును. చందా సం॥ 1కి రు౧-౦-౦.

పత్రికాధిపతి—శివపురపు వీరభద్రపాకయాజి.

—* శ్రీనుతి తతి వల్లికా మతల్లిక *—

ఇందు సంఘసంస్కారులయొక్క దుర్బోధలు, కుతర్కములును సప్రమాణముగ ఖండింపబడి వైదికధర్మనిరూపణము చేయబడియున్నది.

వలయువారిట్లు వ్రాయుడు:— బ్ర. ఉ॥ X॥ వేంకటనరసింహశాస్త్రిగారు, విద్యానందసరస్వతీ, సోమకల్లు, చిప్పగిరిపోస్టు (బళ్లారి జిల్లా)


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

REGD. No. M-1738

చందా సం॥ రు 1

శ్రీ బాలాత్రిపురసుందర్యైనమః.

యతో ధర్మ స్తతో జయః : సత్యమేవజయతే నానృతమ్.

# శైవధర్మ ప్రకాశిక.

శ్లో॥ ధర్మఏవ హతో హంతి, ధర్మో రక్షతి రక్షితః



| సంపుటము | రుధిరోద్గారి వత్సర | సంచిక |
|---|---|---|
| 1 | ఆషాఢ మాసము. | 4 |



శివపురపు వీరభద్రసాకయాజి-పత్రికాసంపాదకుడు

---

శ్లో॥ శివోక్తాం జాతిమర్యాదాం యోతీత్య భువివర్తతే
సపాషండ ఇతిజ్ఞేయః సర్వకర్మబహిష్కృతః ॥

శ్లో॥ స్వజాత్యాశ్రమధర్మం యస్త్యక్త్వా వేదోదితం నరః
అన్యజాత్యుచితాచారం చరేత్సపతితో భవేత్ ॥

---

విషయసూచిక



శ్రుతిధర్మసంజీవనీ ముద్రాక్షరశాలయందు
శి. వీ. పాకయాజిచే ముద్రింపఁబడి
ప్రచురింపబడియె—బెజవాడ.

1923

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## ప్రధాన పోషకులు.

శ్రీపతి పండితారాధ్యుల మల్లయ్య అయ్యవార్లంగారు.
శ్రీ ముదిగొండ లింగయ్యశాస్త్రిగారు.
శ్రీ ములుగు వీరభద్రశాస్త్రిగారు.
శ్రీ ముదిగొండ బసవయ్యశాస్త్రిగారు.
శ్రీ మల్లంపల్లి మల్లికార్జునుడుగారు (తెనాలి).
శ్రీ ములుగు రామలింగయ్యగారు.

## అనుపోషకులు.

శ్రీ ముదిగొండ విశ్వనాథావధానులుగారు.
శ్రీ ముదిగొండ భద్రయ్యగారు.
శ్రీ శివపురపు వీరయ్యగారు.
శ్రీ ముదిగొండ వీరభద్రయ్యగారు (వేములపల్లి).
శ్రీ మాదల వీరభద్రయ్యగారు.
శ్రీ కాశీనాధుని వీరభద్రయ్యగారు.
శ్రీ కాశీనాధుని రాజలింగశాస్త్రిగారు.
శ్రీ కొమరవెల్లి మునలయ్యగారు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రీ బాలాత్రిపురసుందర్యైనమః

యతోధర్మ స్తతోజయః సత్యమేవజయతే నానృతమ్.

# శైవధర్మప్రకాశిక.

శ్లో॥ ధర్మఏవ హతో హంతి ధర్మో రక్షతి రక్షితః ॥


సంపుటము 1 | రుధిరోద్గారి వత్సర ఆషాఢ శుద్ధ పూర్ణిమ. | సంచిక 4


## ప్రమాణనిర్ణయము.

ప్రమాణమనఁ జే విషయమునంగాని మనకు సత్యజ్ఞానమును దెలుపు సాధన విశేషము. అట్టి ప్రమాణమును నిర్ణయించునది కాన నీ వ్యాసమునకుఁ బ్రమాణ నిర్ణయమను నన్వర్థనామకరణము గావింపఁబడినది.

### —* ఉపోద్ఘాతము *—

భరతఖండముననే తొలుత నలువ మానవులను సృజించియున్న వాఁడని సకలశాస్త్రములను దెలిపియున్నవి. ఆ మానవులు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులను నాలుగు తెగల వ్యవహరింపఁబడుచున్నవారు. వారిలో నగ్రజన్ములు బ్రాహ్మణులు. వీరు తక్కిన జాతులవారికి మంత్రులు పురోహితులు గురువులునై యున్నవారు. కావుననే మానవోత్తములయి యున్నవారు. ఇందనేక మతశాఖలు కలవు. వానిలో నొకశాఖకుఁ జేరినవారే లింగధారి బ్రాహ్మణులు. వీరు తమ లింగధారణము వైదికమని సాధించుకొనవలసియున్నది. ఇంతియె కాదు. తమ సిద్ధాంత మెటువంటిదో గ్రహించి తత్సత్రయ విచారము గావించుకొని తత్త్వవిదులై తమ శిష్యుల నుద్ధరించుకొనవలసినపని యొాపినంత కలదు. ఇదియెకాక యిహమందు జీవించియున్నంతవరకు సకలసుకృతము ఇది నమ్రృతమునని యెరింగి సుకృతముల నాచరించి తత్ఫలమగు సుఖమనుభవించుటకును, దుష్కృ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తమును విసర్జించి తత్ఫలమగు దుఃఖము ననుభవించకుండుటకును దినకృత్యములనేరంగి యాచరించుటకును శైవులు ప్రమాణాన్వేషణము గావించుకొనుట తప్పని పనియగుచున్నది. లేకున్న ధర్మజిజ్ఞాసకర్హులు కాజాలరు. ధర్మమే యిహపర సుఖదాయకమైనదని మను వీక్రిందివిధమునఁ జెప్పియున్నవాడు.

శ్లో॥ శ్రుతిస్మృత్యుదితం ధర్మ।మనుతిష్ఠన్హి మానవః
ఇహకీర్తిమవాప్నోతి । ప్రేత్యచానుత్తమం సుఖమ్॥

శ్రుతిస్మృత్యుక్త ధర్మమును మానవుడనుష్ఠించి యిహలోకమున ధర్మానుపాలియను కీర్తిని బరలోకమున స్వర్గాపవర్గాదిసుఖమును ననుభవించుచున్నాడని పై శ్లోకార్థము. దీనింబట్టి మనమునిహపర సుఖసంపాదనమునకై ప్రమాణనిర్ణయము తప్పక చేసికొనవలసినవారమని స్పష్టమగుచున్నది. ధర్మజిజ్ఞాస చేయనెంచినవారికి వేదము పరమప్రమాణమని మను వీక్రిందివిధమునఁ జెప్పియున్నవాడు.

శ్లో॥ ధర్మంజిజ్ఞాసమానానాం । ప్రమాణం పరమంశ్రుతిః॥

ఇంతియెకాదు. వేదమే సకలధర్మములకు మూలమైనను మనము మన్వాదిస్మృతులను, (శీలమును, బ్రహ్మణ్యత, వేదపితృభక్తత, సౌమ్యత, అపరోపతాపిత, అనసూయత, . అపారుష్యము, మైత్రత, ప్రియవాదిత్వము, కృతజ్ఞత, శరణ్యత, కారుణ్యము, ప్రశాంతిలోనగు పదమూడు గుణములను) సాధువుల యాచారమును (కంబళవల్కలాద్యాచరణరూపమగు నడతను) ఆత్మతుష్టిని బ్రమాణములనుగా గ్రహింపనగును. ఈ విషయము నీక్రింది మనువచనము చెప్పియున్నది.

శ్లో॥ వేదోఖిలో ధర్మమూలం । స్మృతిశీలేచతద్విదాం,
ఆచారశ్చైవ సాధూనా । మాత్మనస్తుష్టిరేవచ.

వేదములపౌరుషేయములు. కావుననే యవి స్వతఃప్రమాణములగుచున్నవి. మన్వాది స్మృతులట్టుగాక పౌరుషేయములు. కావుననే యవి పరతః (వేదానుకూలములై) ప్రమాణము లగుచు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

న్నవి. ఈ విషయమును మన మీఁద్రింది పరాశరస్మృతి వచనము వలన గ్రహింపనగును.

శ్లో॥ నకశ్చి ద్వేదకర్తాచ । వేదం శ్రుత్వాచతుర్ముఖః
తథైవధర్మాన్ స్మరతి । మనుః కల్పాంతరేంతరే.

వేదమును రచించిన కర్త యొకడును లేడు. వేదమును విని చతుర్ముఖుడు ధర్మముల నట్లె స్మరించెను. మనువును గల్పాంతరములందు ధర్మములను స్మరించుచున్నవాడని పై శ్లోకార్థము. ఈ యర్థమునే వ్యాసభట్టారకుడు మఱియొక విధముగా సూతసంహితాముఖమునఁ జెప్పియున్నవాడు.

శ్లో॥ వేదాఃప్రమాణం ప్రథమం । స్వతఏవతతఃపరం
స్మృతయశ్చపురాణాని । భారతం మునిపుంగవాః
అన్యాన్యపిమునిశ్రేష్ఠా । శ్శాస్త్రాణి సుబహూనిచ
సర్వం వేదావిరోధేన । ప్రమాణం నాన్యథర్మనా.

వేదములు ప్రథమ ప్రమాణములు. అవి స్వతఃప్రమాణములగుచున్నవి. అటుపై స్మృతులును బురాణములును భారతమును తరములెల్లను వేదానుకూలములైయే ప్రమాణములగుచున్నవి. ఈ చెప్పినదానింబట్టి నేదములును వేదానురోధములగు మన్వాది స్మృతులును బరమ ప్రమాణములని స్పష్టమగుచున్నది. ఇట్లనిన వేదశాస్త్రములు పరమ ప్రమాణములనెదరు. శంకరుడు బుద్ధిపూర్వకముగ రచించిన శైవాగమములు లేవా? వానిని వేదాధికములనికాని వేదతుల్యములనికాని ప్రమాణనిర్ణయమునఁ జెప్పఁదగియుండలేదా? ఇట్లుండ వాని ప్రశంసను విడిచి శ్రుతిస్మృత్యాదులను గూర్చి మాత్రమే చెప్పెదరు. ఇది యుపాదేయ మెట్లగునని కొందరు శంకింపవచ్చును. సమాధానము వినుడు.

## ఆగమప్రమాణము.

ఆగమములప్రమాణములని వాదించువారు లేరు. కాని వేదములపౌరుషేయములు. ఆగమములట్లుగాక పౌరుషేయములైయున్నవి. కాన నాగమములు వేదాధికములుకాని వేదతుల్యములు కాని యెన్నటికిని గాజాలవు. ఆగమములును స్మృతులవలెనే స్వతం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్రగ్రంథములు కావు. వేదానురోధములయినపుడే యవి ప్రమాణములయ్యెడిని. వేదవిరుద్ధాగమములు ప్రమాణములు కానేరవు. ఈ విషయమును మన మహర్షులే విమర్శించి నిర్ణయించియున్నవారు. మహర్షులలో వ్యాసభట్టారకుడు సకలమతాచార్యుడై యున్నవాడుకదా? ఆయన రచించిన బ్రహ్మసూత్రములును, బురాణేతిహాసములును స్మృతులును సకలమతములవారిచేఁ బరమప్రమాణములుగా గ్రహింపఁబడి పఠింపఁబడుచున్న విషయ మాబాలగోపాలమెరింగినదేకదా? అట్టి వ్యాసభట్టారకుడు సూతసంహితను శైవవిషయము నిట్లు తెలిపియున్నవాడు.

శ్లో॥ విష్ణ్వాగమాదితాద్ధర్మా । దశేషాదాస్తికోత్తమాః
శైవాగమోదితో ధర్మో । వరిష్ఠో నైవసంశయః
శైవాగమోదితో ధర్మో । ద్వివిధా పూర్వమీరితః
అధస్రోతోద్భవస్త్వేక । ఊర్ధ్వస్రోతోద్భవఃపరః
ఊర్ధ్వస్రోతోద్భవాద్ధర్మా । త్స్మార్తాద్ధర్మా మహత్తరాః
స్మార్తేభ్యః శ్రౌతధర్మాశ్చ । వరిష్ఠా మునిసత్తమాః.

విష్ణ్వాగమములకంటె శైవాగమములు వరిష్ఠములు. సంశయములేదు. శైవాగమము లధస్రోతోద్భవములు, ఊర్ధ్వస్రోతోద్భవములునని రెండువిధములనున్నవి. అందూర్ధ్వస్రోతోద్భవములును వానికంటె స్మృతులును స్మృతులకంటె శ్రుతులును ధర్మనిర్ణయమునఁ బ్రమాణాధిక్యతను గాంచియున్నవని పై శ్లోకములయర్థము. ఈ యర్థమునే యించుమించుగ నాగమములును జెప్పియున్నవని శైవాగ్రగణ్యులగు మాయిదేవాచార్యులవారు శివానుభవసూత్రమునను ప్రమథగణాగ్రగణ్యులగు రేణుకాచార్యులవారు శైవసిద్ధాంతశిఖామణియును నాగమసార గ్రంథరాజమునను జెప్పియున్నవారు. చూడుడు శైవసిద్ధాంత శిఖామణిని ___

శ్లో॥ అద్యతేమునిశార్దూల । సమస్తాగమపారగ
శివజ్ఞానకరంవక్ష్యే । సిద్ధాంతంశృణుసాదరం
[illegible]
భిన్నాచార సమాయుక్తాః । భిన్నార్థప్రతిపాదకాః.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సాంఖ్యంయోగః పాంచరాత్రం । వేదాఃపాశుపతంతథా
ఏతానిమానభూతాని । నోపహాన్యాని యుక్తిభిః
వేదః ప్రధానం సర్వేషాం । ప్రామాణ్య మితినిశ్చితం
పాంచరాత్రస్యసాంఖ్యస్య । యోగస్యచమహామునే
వేదైకదేశవర్తిత్వం । శైవం వేదమయం మతం
వేదైకదేశవర్తిభ్యః । సాంఖ్యాదిభ్యో మహామునే
సర్వవేదానుసారిత్వా । చ్ఛైవతంత్రం విశిష్యతే
శైవతంత్ర మితిప్రోక్తం । సిద్ధాంతాఖ్యంశివోదితం
సర్వవేదార్థరూపత్వా । త్ప్రమాణం వేదవత్సదా
ఆగమాబహుధాప్రోక్తా । శ్శివేనపరమాత్మనా
శైవంపాశుపతం సోమం । లాకులంచేతిభేదతః
తేషుశైవంచతుర్భేదం । తత్రసర్వం వినిశ్చితం
వామంచ దక్షిణంచైవ । మిశ్రం సిద్ధాంతసంజ్ఞికం
శక్తిప్రధానం వామాఖ్యం । దక్షిణం భైరవాత్మకం
సప్తమాతృపరం మిశ్రం । సిద్ధాంతం వేదసమ్మతం
వేదధర్మాభిదాయిత్వా । త్సిద్ధాంతాఖ్యశ్శివాగమః
వేదబాహ్య విరోధిత్వా । ద్వేదసమ్మతముచ్యతే
వేదసిద్ధాంతయోరైక్య । మేకార్థప్రతిపాదనాత్
ప్రామాణ్యమితివిజ్ఞేయం । పండితైరేతయోస్సదా.

మునిశ్రేష్ఠుడవగు నోయగస్త్యమహర్షీ! శివజ్ఞానకరమగు సిద్ధాంతమును గూర్చి చెప్పెదను సాదరముగ వినుము. లోకమున రుచిభేదముండుటచే సిద్ధాంతములును బెక్కు భిన్నాచారములతో, గూడి భిన్నార్థప్రతిపాదకములై విఖ్యాతిఁగాంచియున్నవి. అవి సాంఖ్యము, యోగము, పాంచరాత్రము, వేదము, పాశుపతము లనగునవి. ఇవి యుక్తులచే నిరసింపఁబడని మానభూతములగు ప్రమాణములైయున్నవి. కాని వానిలో మిగిలినవానికన్నిటికిని వేదమే ప్రధానప్రమాణమని నిశ్చయింపఁబడినది. పాంచరాత్రసాంఖ్యయోగములకు వేదైకదేశవర్తిత్వమేకలదు. "శైవ మట్లుగాక వేదమయమైయున్నది. వేదైకదేశవర్తులగు సాంఖ్యాదులకంటె శైవతంత్రము సర్వవేదమును ననుసరించుటచే నధికమగుచున్నది. ఆశైవ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తంత్రమేదన? శివోక్తముగు సిద్ధాంతమని తెలియవలెను. సిద్ధాంతము సర్వవేదార్థరూపమగుటచే వేదమువలెనే ప్రమాణమగుచున్నది. పరమాత్మయగు శివునిచే నాగమము లనేకవిధములుగ జెప్పబడియున్నవి. అవియే శైవము, పాశుపతము, సోమము, లాకులము మున్నగు భేదములు కలిగియున్నవి. వానిలో శైవము నాలుగుభేదములుగ వర్ణింపఁబడియున్నది. అవి వామము, దక్షిణము, మిశ్రము, సిద్ధాంతము ననునవి. అందు సిద్ధాంతము వేదసమ్మతమైనది. వేదధర్మములను జెప్పుటచే సిద్ధాంతనామకమగు శివాగమము ప్రమాణమైనది. ఇంతియెకాక వేదబాహ్యులకు విరోధియగుటచేతనుగూడ వేదసమ్మతమని చెప్పఁబడియున్నది. ఏకార్థబోధకములగుటచేతనే వేదసిద్ధాంతాగమముల కైక్యముకలిగి ప్రామాణ్యమైనదని పండితులచేఁ దెలిసికొనఁదగినది యని పై శ్లోకముల యర్థము. ఈ చెప్పినదానింబట్టి యాగమములు వేదములవలె స్వతఃప్రమాణములు కావనియు, వేదానుకూలముగ నున్నంతవరకే ప్రమాణములగుననియు మనము గ్రహింపఁగలిగితిమి.

ఇంత చెప్పినను వినక యెవ్వడేని తంత్రములను వేదాధికములని చెప్పకపోయినను వేదతుల్యములని తలంచినను గూడ వారిని గూర్చి యేమి తలంచవలసినదని శాస్త్రములు పండితుల కుపదేశించియున్నవో యించుక మన మాలించవలసియున్నది. చూడుడు. క్రియాసారము 129 పుట.

శ్లో॥ యస్యస్యాత్పితరిద్వేషః । సర్వేషాం జగతాంగురౌ
ఉత్పత్తౌ తస్యసాంకర్య । మనుమేయం విపశ్చితా.
శ్లో॥ వేదమార్గసమంమార్గ । మితరం మనుతే తుయః
అధికంవాస్య సాంకర్య । మనుమేయం విపశ్చితా.

ఎవ్వనికిఁ దండ్రియందును, సర్వలోకపితయగు భగవంతుని యందును ద్వేషముకలదో వాని పుట్టుకయందు సాంకర్యమున్నదని పండితునిచే నూహింపదగినది. వేదమార్గముతో నితర మార్గమును సమముగ నెవడు తలంచునో వాని పుట్టుకలో నధికముగా సాం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ర్యమున్నదనికూడ పండితునిచే నూహింపఁదగినది యని పై శ్లోకముల యర్థము. ఈ చెప్పినదానింబట్టి పండితుడగువాడెన్నటికిని వేదతుల్యప్రమాణము మఱియొకటి యున్నదని తలంచరాదనియు వర్ణసంకరులు తలంచినను నది యుపాదేయముకాదనియు స్పష్టమగుచున్నది. ఆగమములు స్వతఃప్రమాణములుకావు. పరతఃప్రమాణములు. పరతఃప్రమాణములన వేదానుకూలములై యున్నంతవఱకే మన్వాదిస్మృతులవలెఁ బ్రమాణములగుచున్నవని మనము గ్రహించవలెను. ఇంతమాత్రముచే నాగమములప్రమాణములనికాని ప్రమాణహీనములనికాని మనమనుకొనవలసిన యవసరములేదు. అవి గ్రహింపనివారికి సప్తకోటి మహామంత్రకాండయును దేవతాప్రతిష్ఠాదికల్పములును దూరములు కావలసివచ్చును. అందులకు సాహసించువారుండరు. ఉండిన వారికో సుజనలోకమునకును బనియుండదు. కాన శైవులు ధర్మజిజ్ఞాస చేసికొనవలసివచ్చినపుడు శ్రుతులను దద్విహితములయిన స్మృతి సూత్రపురాణేతిహాసాగమాదులను బ్రమాణములనుగా గ్రహించియె ధర్మనిర్ణయము గావించుకొనవలయును. శైవసిద్ధాంతమునుగూర్చి చర్చించుకొనఁ దలంపుకలిగినయెడ సిద్ధాంతాగమమును బ్రమాణముగ స్వీకరించి తత్వనిర్ణయము గావించుకొనవలెనని మన మీదానివలన తెలిసికొంటిమి. అది లభింపఁదేని దత్సారమునుగొని ప్రమథాచార్యవర్యులగు రేణుకాచార్యులవారు రచించిన శైవ సిద్ధాంత శిఖామణి యను గ్రంథరాజమునుగొని తత్వనిర్ణయము గావించుకొందుముగాత. "సత్యమేవ జయతే, నానృత"మ్మను ప్రాబలుకు ప్రబలుగాత.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# శ్రీకరభాష్య సంస్కరణము.

ఇట్టిది మహాకార్యము. ఇందులకు మహాపండితులును, వేలకొలంది ధనమును గార్యదీక్షగల స్వమతప్రభువుల కటాక్షమును సహాయపడినంగాని సఫలము కాజాలదు. శివానుగ్రహమున నీయూహను దటస్థించినవి. పండితప్రవరులును, పరమత సహనులును, సత్యాన్వేషణ తత్పరులును, సంస్కరణ సమర్థులనగు బ్ర॥ వేమూరి రామగోవింద శాస్త్రిగారు భాష్యసంస్కరణ రథారూఢులైరి. దచ్చక్రరక్షకత్వమునందు శైవులును, స్వమతాభిమానులును, పండితవరులునునగు బ్ర॥ రెంటాల శరభయ్య శాస్త్రిగారును, శ్రీ-శ్రీ-శ్రీ ఉర్లాము సంస్థానమున నాస్థానవిద్వాంసులైయున్న విశ్వవ్యాపులును శ్రీకరభాష్యపక్షమున దీక్షతో వాదించి జయలక్ష్మిని వరించినవారునునగు బ్ర॥ చాగంటి సీతయ్యశాస్త్రిగారును ప్రవేశించియున్నవారు. శ్రీ-శ్రీ-శ్రీ దేవిడీ సంస్థానాధీశులును శైవులును శైవమతోద్ధరణ దీక్షాబద్ధకంకణులును శైవమహాజన సభాధ్యక్షులునునగు ఇజ్జతాసాక్ శ్రీరాజా కందుకూరు బాలసూర్య ప్రసాదరావుబహదరు జమీందారువారు ముందుకేతెంచి తాము ముప్పదివేలరూప్యములను వారి రాణీగారు పదివేలరూప్యములను భాష్యసంస్కరణమునకు వినియోగింతుమని వాగ్దానముగావించి యంతటితోఁ దనివినందక యాచరణమున నుపక్రమించి భాష్యసంస్కరణకార్యాలయము స్థాపించి కార్యక్రమము సక్రమముగ నడుపుచున్నవారని విని కని శైవలోకమునకు వినుపించు మహాభాగ్యము మాకు లభించినందులకు మహానందమందుచున్నవారము. ఇంతియేకాదు; "శ్రీకరభాష్య సంస్కరణవిషయమై యాలోచించవలసియున్నది. కాన రావలయు"నని తంత్రీముఖమున శ్రీవారు మా కాహ్వానమొసంగిరి. వెనువెంటనే వెళ్ళి దర్శించితిమి. శ్రీవారు భాష్యసంస్కరణ ప్రయత్నమును, సంస్కరణకార్యాలయ సంస్థాపనమును నప్పటికి గావించియున్న కార్యస్థితిని గన్పరచి యింతకు సంస్కరణాంశములను యోజించి తెలుపవలసినదిగ మాకానతి యొసంగిరి. మహాపండితులుచేయు సంస్కరణమునకు వలయు నంశములను సూచింప నధికారులు సర్వజ్ఞులగు పండితులగుదురు కాని నావంటి యల్పజ్ఞులు కారనియెరింగియు శ్రీవారియానతి యలంఘ్యమగుటంజేసి యందులకియ్యకొని యప్పుడు దేహమనారోగ్యముగనుండుటచే మరియొకపరి నియమితకార్యమునందుఁ బ్రవర్తించువాడనని విన్నవించి యేతెంచితిని కాన సంస్కరణాంశములను "శైవసిద్ధాంత" మను శీర్షికక్రింద దిగువ విశదీకరించుచున్నవారము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

—పత్రికాధిపతి.

# శైవసిద్ధాంతము.

శ్లో. జిజ్ఞాస్యం తత్పరం బ్రహ్మ। జగజ్జన్మాదికారణం
కారణం సర్వశాస్త్రాణాం। సర్వశ్రుతి సమన్వయమ్.

శ్లో. వ్యాసంవసిష్ఠనప్తారం। శక్తేః పౌత్రమకల్మషం
పరాశరాత్మజం వందే। శుకతాతంతపోనిధిమ్.

శ్లో. శ్రీశివాద్వైతసిద్ధాంతం। శ్రుతిసిద్ధాంతసమ్మతం
అగస్త్యస్యప్రదాతారం। రేణుకేశ మహం భజే.

ఈవ్యాసము శైవులు పఠించి గ్రహించవలసిన సిద్ధాంతమును దెలుపుచున్నది
న దీనికి శైవసిద్ధాంతమను నామకరణము గావింపఁబడినది.

## —✻ ఉపోద్ఘాతము ✻—

శైవులు ధర్మజిజ్ఞాస చేసికొనుటకును తత్వనిర్ణయము గావించుకొనుటకును
యము ప్రమాణసామగ్రిని నిదివరకు సంపాదించుకొనియుంటిమి. ఇక నిపుడు
నియుపయోగమును నించుక జవిగాంచుదము. ధర్మజిజ్ఞాస చేయనెంచినవారికి
ము పరమప్రమాణమని మనకిదివరకుఁ బ్రమాణనిర్ణయము బోధించియున్నదికదా?
ములు ధర్మవిషయములను సంగ్రహించి చెప్పుచుండును. సిద్ధాంతభేదములకు
ని మతభేదములకుగాని వేదములే జన్మభూములు. ఆ వేదములు కొన్ని మతములను
ర్చియు సిద్ధాంతములనుగూర్చియు మిగుల సూక్ష్మముగ ముచ్చటించెడి యాచాగ
లదు. వాని నెంతటిపండితులైనను గ్రహించుట దుష్కరము. కావుననే త్రికాల
నులును నతీంద్రియజ్ఞానసంపన్నులునునగు మన మహర్షులు తమ సూక్ష్మవిజ్ఞానముచే
హస్యములుగనున్న వేదార్థములను గ్రహించి లోకానుగ్రహబుద్ధితో నధికారిభేదము
సరించి మానవులకుపదేశింపదలంచి యాయుపదేశము వాగ్రూపముగానే యున్న
వెనువెంటనే నశించుననియు నందరు జ్ఞప్తియందుంచుకొనుట కష్టమనియు
కవేళ జ్ఞాపకముంచుకొనినను వానిలో కాలక్రమమున స్ఖాలిత్యములుచేరి యది
ర్వాతివారిచే గ్రహింపరానిస్థితికి రావచ్చునవనియు యోజించి వానిని లిఖితరూప
న గ్రంథముల గావించిరి. అవియే స్మృతిసూత్ర పురాణేతిహాసాగమాదులై
న్నవి. మహర్షులవలెనే బ్రహ్మ విష్ణు మహేశ్వరులుకూడ స్మృత్యాగమములను
చించియున్నవారని ప్రజాపతి, విష్ణుస్మృతులును శివధర్మోత్తరాదులును దెలుపుచు
వి. వానినాధారముగ నిడుకొనియే యుప్పుడెంతటిపండితులైనను దమతమ మత
ంతములను గావించుకొనవలయును. అంతియెకాని స్వతంత్రించి వేదార్థములు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇప్పటిపండితులు మహర్షులవలె సకలవేదముల నధ్యయనముచేసినవారు కారు అతీంద్రియజ్ఞానసంపన్నులును గారు. త్రికాలవేదులును గారు. రాగద్వేషపూరితులై యుందురు. కాన వీరికి వేదార్థమును స్వతంత్రించిచేయుట కధికారము లేకపోయినది. దాని మాచే రచింపబడిన పురాణాదుల ననుసరించియే మీరు మీమీ యభీష్టమతములను బోషించుకొనవలసినదే కాని యథేచ్ఛముగ వేదార్థములను జేయుటకు యత్నింపవలదనికూడ మన మహర్షులు ముందే క్రిందివిధమున శాసించియున్నవారు. చూడుడు— సూతసంహితను ౬ వ పుటను.

శ్లో. యశ్చేతు ర్వేదవిద్విప్రః । పురాణంవేత్తినార్థతః
తం దృష్ట్వా భయమాప్నోతి । వేదో మాం ప్రతరిష్యతి
ఇతిహాసపురాణాభ్యాం । వేదం సముపబృంహయేత్
బిభేత్యల్పశ్రుతా ద్వేదో । మామయం ప్రతరిష్యతి.

అని వ్యాసభట్టారకుడు చెప్పియున్నాడు. నాలుగు వేదములను జదివిన విప్రుడైనను నర్థవత్తుగఁ బురాణములను దెలియనిచో వానింజూచి వేదము వీడునన్ను బాధించునని భయపడును. ఇతిహాసపురాణాదులచే వేదార్థమును నిర్ణయించుకొనవలెను. అట్లుచేయని యల్పజ్ఞునిజూచి వీడునన్ను బాధించునని వేదము భయము గాంచునని పై శ్లోకముల కర్థము. ఈచెప్పినదానింబట్టి యిపుడెంతటి పండితుడైనను నితిహాస పురాణాదుల సహాయముచేతనే వేదార్థము గావించుటకు దొరకొనవలెనని స్పష్టపడినది. కావుననే యపరశంకరులని మతిగన్న శంకరభగవత్పాదులంతటి వారుకూడ సూతసంహితను బదునెనిమిదిసారులు పఠించి పిదప నద్వైత సిద్ధాంతమును బోధించు శారీరకమీమాంసాభాష్యమును రచించెనని యీక్రింది విద్యారణ్యయతీంద్రవచనములు చెప్పియున్నవి.

శ్లో. తామష్టాదశధాలోక్య । శంకరస్సూతసంహితాం
చక్రే శారీరకంభాష్యం । సర్వవేదాంతనిర్ణయం
అతస్సదాభ్యసేద్ధీమాన్ । సంహితాం వేదసంమితాం
కబలీకృత్యచాత్మాన । మాలోకయతిచిద్ఘనమ్.

'సూతసంహితనుఁ బదునెనిమిదిపర్యాయము లవలోకించి శంకరభగవత్పాదులు సర్వవేదాంత నిర్ణయమగు శారీరక భాష్యము రచించియున్నవారు. ఆకారణముచే ధీమంతుడగువాడు వేదవిహితమగు సూతసంహితను నెల్లప్పుడును నభ్యసించుచుండవలెను. అట్లు పఠించినయెడ వాడొక్కసారే తనను దాను గబళించికొని చిద్ఘనమగు నాత్మను జూచుచున్నాడు' అని విద్యారణ్యయతీంద్రులు చెప్పియున్నవారు. వ్యాసభట్టారకుడట్లుపదేశించుటచేతనే కదా శ్రీరామానుజ మధ్వాచార్య పూజ్యపాదులు కూడ నితిహాసపురాణములను బఠించియే స్వస్వమతభాష్యములను రచించికొనియున్నవారు. తక్కినపండితులు [illegible]చుచున్నవారు. ఈ చెప్పినదానింబట్టి స్వమత

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సిద్ధాంతమును దెలియఁగోరువారు వేదములను దదుపబృంహణములగు స్మృతిసూత్ర పురాణేతిహాసాగమాదులను బ్రమాణములుగాఁగొని చర్చించుకొనవలెనని స్పష్టమైనది. ఇక సిద్ధాంతవిషయము నుపక్రమించుకొందము.

## — ఉపక్రమము —

వేదములు పూర్వోత్తరభాగవిభాగము ననుసరించి కర్మజ్ఞానకాండలను రెండు భాగములైనవి. పూర్వభాగమునకుఁ బూర్వమీమాంసయను పేరుతో జైమినిమహర్షి యొకసూత్రగ్రంథమును రచించెను. ఉత్తరభాగమునకు నుత్తరమీమాంసయను పేరుతో వ్యాసభట్టారకుడు బ్రహ్మసూత్ర గ్రంథమును రచించియున్నవాడు. పూర్వమీమాంస మతభేదముల కవకాశమిచ్చినదికాదు. దానంజేసియే సకలమతములవారును బూర్వమీమాంసయెడ భేదభావములనుబొందక దానికి దాసానుదాసులై వర్తించుచున్నవారు. ఉత్తరమీమాంసయెడ నట్లుగాక మతభేదములనుబాటించి భిన్నభాష్యములను రచించుకొనసాగిరి. బ్రహ్మసూత్రముల కద్వైతు లద్వైతభాష్యమును రచించుకొన ద్వైతులు ద్వైతభాష్యమును విశిష్టాద్వైతులు విశిష్టాద్వైతభాష్యమును వ్రాసికొనిరి. అట్లే శైవులును శివాద్వైత (ద్వైతాద్వైత) భాష్యమును గావించుకొని వచ్చుచున్నవారు. ఇట్లుండ నీనడుమ శైవులలోఁ గొందరికి విశిష్టాద్వైతమును దెలుపు శ్రీకంఠభాష్యమును నష్టభాగద్రవ్య మొకటి కనుపడెను. అది కనుపడఁగనే నష్టభాగములకు నిరంతరము నెమకుచుండెడి యా శైవులా భాష్యమును దమదని యొకవాదముచేసి దానిని గబళింప నెంచిరి. కాని యది స్వధనముగాక పరధనమని యెరింగిన పెద్దలు మనదికాని పరధనమగు శ్రీకంఠభాష్యమును నాక్రమించుట తగనికార్యమని తగువిధముల మందలించిరి. అందుతో నావివాద మడుగంటినది. "సత్యమేవజయతేనానృత" మ్మను ప్రాబల్యము వ్యర్థముకాదుకదా?

శైవులిపుడు తమ శివాద్వైత (ద్వైతాద్వైత) భాష్యమునఁ గాలానుసరణముగ వచ్చి చేరినవియు మధ్యకాలమునఁ జొప్పింపబడినవియునగు స్ఖాలిత్యములను బోద్రోసికొనియు, లుప్తభాగములను బూరించుకొనియు స్వమతభాష్యమును సంస్కరించుకొని, ముద్రింపించి స్వమతస్థులలో దానికి వ్యాప్తికలిగించి పఠనపాఠనములచే స్వమతాభివృద్ధి గావించుట కర్తవ్యము. కర్తవ్యమునకుఁ దొరకొనినవారికి సంస్కరణాంశములను సూచించుట ప్రకృతకార్యము కాన బ్రకృతమునకు వచ్చుచున్నారము.

## — సంస్కరణాంశములు —

శైవసిద్ధాంతము సర్వశ్రుతిసమన్వయము కలిగియుండవలెనని యిపుడు గ్రహించితిమి. శ్రుతులు పూర్వోత్తరభాగములచే విరాజిల్లుచున్నవి. పూర్వభాగమునకు కర్మకాండయని పేరుకలదు. ఇది ప్రకృతముకాదు. ఇపుడు విమర్శించుకొనవలసినది యుత్తరభాగము. దీనికే యుపనిషత్తులనియు, వేదాంతములనియు, వేదశిఖలనియు బెక్కునామములు కలవు. ఈ యుత్తరభాగమునకే యుత్తరమీమాంస యను పేరుతో వ్యాసభట్టారకుడు సూత్రగ్రంథమును రచించియున్నవాడని చెప్పియుంటి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మి. ఈ సూత్రములనే బ్రహ్మసూత్రములని పండితులు వ్యవహరించియున్నవారు. బ్రహ్మసూత్రములకు బండితులనేకులనేక భాష్యములను రచించుకొనియున్నవారు అవి భిన్నార్థ ప్రతిపాదకములైన సిద్ధాంతములను బ్రకటించుచున్నవి. అందు మన శివాద్వైత సిద్ధాంతమొక్కటియైయున్నది. సిద్ధాంతములు భేదించినవికాని వానికి మూలమగు సూత్రగ్రంథముమాత్ర మొక్కటియై భేదించలేదు కదా? ఆ గ్రంథకర్త సకలలోకపూజ్యుడగు వ్యాసభట్టారకుడే సుడీ! మరియొకడుకాడు. ఆ మహనీయుడు తన యీయభిప్రాయమును గ్రహించలేక భాష్యకర్తలు ప్రమాదములపాలయి యపసిద్ధాంతముల గావించుకొందురేమోయను సంశయమున దానుగ్రహించిన వేదరహస్యార్థములనెల్ల సంగ్రహరూపమున దొలుత బ్రహ్మసూత్రగ్రంథముగ రచించి పిదప దాని వివరణరూపమున బురాణేతిహాసముల రచించియున్నవాడు. ఈ విషయము నొకవేళ మనము గ్రహింపలేక చెడుమార్గముల బోవుదుమేమోయను భయము నంగాబోలు! 'ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్' తను సూతసంహితావచన ముఖమున దన యీ యభిప్రాయమును దెలిపియున్నవాడు. కాన మనమిప్పుడు శ్రుతిస్మృతి పురాణేతిహాసాగమాదులను ముందిడుకొని శ్రుతివిహితమైన శైవసిద్ధాంతమును గనుగొందము. మన శైవసిద్ధాంతమును బోధించు గ్రంథమునకే శ్రీకరభాష్యమని పేరు. నీలకంఠ శివాచార్యులను శైవమతాచార్యులొకరు తనపేర నీలకంఠభాష్యమును రచించియున్నవారని యితర గ్రంథములవలనం దెలియవచ్చెడిని కాని యది శివాద్వైతమును బోధించినదో లేక ద్వైతమును బ్రతిపాదించినదో కాక విశిష్టాద్వైతమును జెప్పెనదో యావిషయము చెప్పినవారు లేరు. ఆగ్రంథము కానరాదు. కావ మనకిపుడు శ్రీకరభాష్యమే శరణ్యమెయున్నది. ఇంక నది తెలిపిన సిద్ధాంతమేదియో తెలిసికొందము.

## —* శ్రీకర భాష్యము *—

### (శివాద్వైతము)

శ్రీకరభాష్యము ద్వైతాద్వైతమను నామాంతరముగల శివాద్వైత సిద్ధాంతమును బ్రతిపాదించియున్నది. ఈవిషయమును మనకీక్రింది శ్రీకరభాష్యపీఠికలోని వచనములు దెలుపుచున్నవి. ఇది చదువుడు.

శ్లో. యత్సం వీక్షణమాత్ర జర్ఝరిత భక్తానీక పుర్యష్టకం ।
ద్వైతాద్వైత విశిష్టబౌద్ధమత మత్తేభేంద్ర కంఠీరవం ।
శైవాద్వైత వివేకసార విలసత్సిద్ధాంత పక్షప్రదం ।
శంభోర్వ్యాచ్చరణం భవాబ్ధి తరణం మన్యే జగత్పోషణం ॥

ఇయ్యది గ్రంథాదిని నిష్టదేవతాభివందనము దెలుపుటకై భాష్యకర్త వ్రాసిన పద్యము. ఇందు CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri వు సిద్ధాంతమును శైవాద్వైతమని వర్ణించి యున్నవాడు. ఇంతియె కాదు. తగువాత,

శ్లో॥ అశేషోపనిషత్సార । విశేషాద్వైతమండనం
శివజ్ఞానప్రదంసూత్రం । భాష్యంజయతుసర్వదా॥

అని చెప్పియున్నవాఁడు. ఇందు గ్రంథకర్త తన సిద్ధాంతమును విశేషాద్వైతమని పేర్కొనియున్నవాఁడు. ఇందుచే శ్రీ శంకర భగవత్పాదులు చెప్పిన యద్వైతము సామాన్యాద్వైతమనియు దన శివాద్వైతమట్లుగాక విశేషాద్వైతమైయున్నదనియు నీ శ్లోకముఖమునఁ జెప్పియున్నాఁడని తోఁచుచున్నది.

శ్లో॥ శ్రుత్యైకదేశప్రామాణ్యం । ద్వైతాద్వైతమతాదిషు
ద్వైతాద్వైతమతేశుద్ధే । విశేషాద్వైతసాక్షికే
వీరశైవైకసిద్ధాంతే । సర్వశ్రుతిసమన్వయః॥

ద్వైతము, విశిష్టాద్వైతము, అద్వైతము లోనగు సిద్ధాంతములు శ్రుత్యైకదేశప్రామాణ్యముచేఁ బ్రతిపాదింపఁబడియున్నవి. కాని తన (ద్వైతాద్వైత) శివాద్వైతభాష్యముమాత్ర మట్లుగాక సర్వశ్రుతిసమన్వయము కలిగియున్నదని మన శ్రీకరభాష్యకర్తలగు శ్రీపతిపండితయతీంద్రపూజ్యపాదులు చెప్పియున్నవారు. దీనింబట్టి శ్రీకరభాష్యము ద్వైతాద్వైత మను నామాంతరముగల శివాద్వైతసిద్ధాంతమును బ్రతిపాదించుచున్నదని మనమనుకొన్న విషయము భాష్యకర్తయే చెప్పియున్నాఁడని స్పష్టమైనదికదా? ఇట్లనిన శివాద్వైత ద్వైతాద్వైత శబ్దములు భిన్నరూపములతోఁ గన్పడుచుండ నేకార్థబోధకములని చెప్పెదరు; అది యెట్లుపొసగునందురా? వినుఁడు. జీవుడు బద్ధదశయందుఁ బరమాత్మకు భిన్నుఁడై యుండును గాన ద్వైతమును ముక్తదశయందు నభిన్నుఁడగునుగాన నపు డద్వైతము సిద్ధించుననియు నిర్ణయించి భాష్యకర్త తన శివాద్వైత సిద్ధాంతమునకు ద్వైతాద్వైత మను ద్వితీయనామకరణము గావించియున్నవాఁడు. కాన ద్వైతాద్వైత మన శివాద్వైతమే. అన్యముకాదు. కావున మనము భాష్యమును సంస్కరించుకొనునపు డద్వైతభాష్యమును సహాయముగాఁ గొనుట యవసరమని తలంచుచున్నవారము. అద్వైతభాష్యమే మనము సహాయముగాఁ గైకొనఁదగినది కాని ద్వైతభా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

[illegible] విశిష్టాద్వైతభాష్యములుగాని యెన్నటికిని సహాయము

గ గైకొనరాదు. ఆరెండును ద్వైతములే. ఏలయన? ద్వైతమును మన శైవశాస్త్రమెట్లు దూషించియున్నదో కనుగొనుడు. (శివానుభవసూత్రమును)—

శ్లో॥ ద్వైతభక్తిః ప్రపంచాఖ్యా । కేనచిత్కల్పితామృషా॥

(అనిచెప్పి పిదప) శ్లో॥ నచద్వైతాత్మికాంభక్తిం । క్లేశహేతుప్రదాయినీమ్॥

అని నిందించియున్నది. అనఁగఁ బ్రపంచ మనుపేరుగల ద్వైతభక్తి యెవనిచేతనో కల్పింపఁబడినది. అది యసత్యము. కానఁ నట్టి క్లేశహేతుప్రదమగు ద్వైతభక్తిని వివేకముకల శైవుఁడాశ్రయించరాదని పైశ్లోకముల యర్థము. ఇట్లు ద్వైతభక్తిని నిందించి మనమాశ్రయించవలసిన భక్తినిగూర్చి యీక్రిందివిధమున నుపదేశించియున్నది.

శ్లో॥ అభిన్నరూపతోద్వైత । భక్త్యాసంసారనాశనం॥

(అనిచెప్పి పిదప) శ్లో॥ తస్మాదద్వైతగాంభక్తి । మాశ్రయేత్సర్వసిద్ధిదామ్॥

అని చెప్పియున్నది. అనఁగ జీవేశ్వరుల కభిన్నరూపమయిన యద్వైతభక్తి సంసారనాశకమగునుగాన సర్వసిద్ధికరమైన యద్వైతభక్తినే శైవుఁడాశ్రయించవలయునని పైశ్లోకములయర్థము. దీనింబట్టి శైవులు ద్వైతమాశ్రయింపదగినది కాదనియు శివాద్వైతమాశ్రయింపదగినదనియు స్పష్టపడినది. ఇట్లనిన పైశ్లోకములలో నద్వైతమని కలదుకాని శివాద్వైతమని లేదే- మీరు శివాద్వైతమనుట కాధారమేమని కొందరడుఁగవచ్చును. సమాధానమువినుడు. పైసంశయమును శివానుభవసూత్రములోని యీక్రిందివచనములు తీర్చుచున్నవి. కనుడు—శైవపంచకము ౨౩ పుటను శివానుభవ సూత్రకర్తయగు మాయిదేవాచార్యులు తనునుగూర్చి యిట్లు చెప్పుకొనుచున్నాడు.

శ్లో॥ అయంశివాద్వైత పరోమహాత్మా । పరంపరాపావన సంప్రదాయః

శివేనదేవ్యై కథితం రహస్యం । తదానయత్షట్స్థల నిర్ణయంతత్।

ఇందు మాయిదేవాచార్యులు తాను శివాద్వైతపరుఁడనని చెప్పుకొని యున్నాడు. ఇంతేగాక తనమతమగు శివాద్వైతమును బోధించు ప్రమాణగ్రంథములో శివాద్వైతమునే చెప్పుచున్నదని యీక్రింది వచనముఖమునఁ జెప్పియున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ శివాగమైశ్శివాద్వైత । రహస్యైః పారమార్థికైః
కథ్యతేశివసిద్ధాంత । తంత్రంషట్స్థలనిర్ణయమ్॥

ఈ చెప్పినదానింబట్టియు మనమిదివరకుఁ దలంచినట్లు లింగ ధారిశైవుల సిద్ధాంతము శివాద్వైతనామకమైనదేయని ధృవపడినది. ఇట్లనిన శైవసిద్ధాంతమును శివాద్వైతమని చెప్పితిరి. సరే. అద్వైత మందు జీవేశ్వరుల కభేదము సిద్ధించునుగదా? అపుడు మీశివాద్వై తసిద్ధాంత మద్వైతమువలెఁ బ్రపంచమిథ్యాత్వమును బ్రతిపాదించ వలెఁగదా? అట్లు ప్రతిపాదింపక శ్రీకరభాష్యము ప్రపంచసత్య త్వమును జెప్పుచు నధ్యాసఖండను ఖండించుట కుపక్రమించియు న్నది. ఇదియెట్లు సరిపడునని కొందరు ప్రశ్నింపవచ్చును. సమా ధానము వినుడు.

—॰ అ ధ్యా స మం డ న ము ॰—

శివాద్వైతమును బోధించు శైవమతగ్రంథములన్నియు నేక గ్రీవముగఁ బ్రపంచాధ్యాస నంగీకరించియే యున్నవి. ఇట్లుండ శివాద్వైతమును బోధింపవచ్చిన శ్రీకరభాష్యము ప్రపంచాధ్యాసను ఖండించుటజూడ నిది మధ్యకాలమునఁ జొప్పింపబడినదని కాని లేదా యీపట్ల శ్రీకరభాష్యము శైవశాస్త్రములనుమీరినదని కాని మనము చెప్పుకొనక తప్పదు. ప్రపంచాధ్యాసనుగురించి శివపురాణములలో నగ్రగణ్యమైనదియు బ్రహ్మసూత్రకర్తయగు వ్యాసభట్టారకునిచే బ్రహ్మసూత్రవివరణగా రచింపఁబడినదియు నగు స్కాందపురాణాం తర్గత సూతసంహితను శతాధిక స్థలములందు వర్ణింపఁబడియున్నది. ఇట్లనిన సూతసంహిత శైవమతగ్రంథమగు గాక; యందు లింగధా రణము చెప్పఁబడ లేదుకదా? అదిమేమెట్లు ప్రమాణముగ గ్రహిం పనగునని కొందరు శైవులు శంకింపవచ్చును. అట్లనరాదు. అయి నను నది యట్లుంచి వ్యాసవిరచితమైన లింగపురాణమున లింగధా రణమును జెప్పిన యుత్తరభాగములోని యిరువదియొక్క యధ్యా యమును జూడుడు. అదియు లింగధారిశైవులకుఁ గ్రొత్తవిధమున బ్రపంచాధ్యాసను బోధించియున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## — లింగపురాణము —

శ్లో॥ తావత్సత్యంజగద్భాతి । శుక్తికారజతంయథా
యావన్నజ్ఞాయతేలింగం । సర్వాధిష్ఠానమద్వయం॥

శుక్తియందు భ్రాంతి జన్యమైన రజతజ్ఞాన మెట్లు శుక్తియందు శుక్తిజ్ఞానము కలుగువరకు నశించదో యట్లు సర్వాధిష్ఠానమును నద్వైతమును నగు లింగమందు లింగజ్ఞానమెంతవరకుఁ గలుగదో యంతవరకు లింగమునం దధ్యస్తమైన జగత్తు సత్యమైనదిగఁ బ్రకాశించుచుండును. అని పైశ్లోకములు చెప్పియున్నవి. అనగ శుక్తి యందు శుక్తిజ్ఞానము కలుగగనే భ్రాంతిజన్యమైన రజతజ్ఞాన మెట్లునశించునో యట్లు సర్వాధిష్ఠానమైన నద్వైతమగు లింగము నందు లింగజ్ఞానము కలుగగనే భ్రాంతిజన్యమైన జగత్సత్యత్వజ్ఞానము నశించునని తాత్పర్యము. ఈ చెప్పినదానింబట్టి శివాద్వైతబోధకమగు శైవశాస్త్రముకూడ శ్రుతిసూత్రములవలెనే ప్రపంచము యొక్క మిథ్యాత్వమునే బోధించియున్నదని తెలియవచ్చినది. ఇంతియెకాదు. శివోక్తమగు సిద్ధాంతాగమములుకూడఁ బైవిషయమునే చెప్పియున్నదని ప్రమథాచార్యవర్యుఁడగు రేణుకాచార్యులుకూడ శైవసిద్ధాంత శిఖామణియం దిట్లు చెప్పియున్నాడు —

శ్లో॥ శివేనైక్యం సమాపన్న । చిదానంద స్వరూపిణా
నపశ్యతిజగజ్జాలం । మాయాకల్పితవైభవం
మాయాశక్తితిరోధానా । చ్ఛివేభేదవికల్పనా
ఆత్మనస్తద్వినాశేతు । నాద్వైతాత్కించిదవ్యతే॥

శివునితో నైక్యమును జెందిన చిదానందస్వరూపునిచే మాయాకల్పితమైన జగజ్జాలము చూడబడదు. మాయాశక్తి యడ్డుపడుటవలన శివునియందు భేదము కల్పింపఁబడుచున్నది. జీవాత్మకది నశించఁగనే యద్వైతమునకంటె గొంచమైనను మిగులునదిలేదు. ఇది శైవశాస్త్ర మిథ్యాసను జెప్పునదియని చెప్పుటకాదా?

ఇంతియెకాక ... శివసిద్ధాంతము ... ప్రపంచ మిథ్యాసను గూర్చి యిట్లు చెప్పఁబడియున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో తదభిన్నతయాభాతి । సర్పత్వమివరజ్జుతః
రజ్జౌసర్పత్వవద్భాతి । శుక్తౌచరజతత్వవత్
చోరత్వవదధిష్ఠానౌ । మరీచ్యాదౌజలత్వవత్
గంధర్వపురవద్వ్యోమ్ని । సచ్చిదానందలక్షణే
నిరస్తభేదసద్భావే । శివేవిశ్వంవిరాజతే॥

రజ్జువునందు సర్పత్వమువలెను, శుక్తియందు రజతత్వము
కరణి, స్థాణువునందుఁ జోరత్వముపగిది, ఆకసమునందు గంధర్వపు
రముభాతి విశ్వము భేదరహితమైన సచ్చిదానంద లక్షణసంపన్నమ
గు శివతత్వమునందు భాసించుచున్నది. అని పై శ్లోకముల యర్థ
ము. ఇంతియేకాదు. ఈ విషయమై చరాచర లయస్థలమందిట్లు
ముచ్చటింపఁబడియున్నది. ఇది యధ్యాస చెప్పుటకాదా?

శ్లో॥ నాన్యత్పశ్యతియోగీంద్రో । నాన్యజ్జానాతికించన
నాన్యచ్ఛృణోతిసందృష్టే । చిదానందమయేశివే
అసదేవజగత్సర్వం । సదివప్రతిభాసతే
జ్ఞాతేశివేతథాజ్ఞానీ । స్వరూపముపపద్యతే
అనాద్యవిద్యామూలాహి । ప్రతీతిర్జగతామియమ్
స్వాత్మైకబోధాత్తన్నాశే । కుతోవిశ్వప్రభా శివమ్.

ఎవనిచేఁ జిదానందమయుఁడైన శివుడు చూడఁబడునో వాని
చే నితరము చూడఁబడదు. తెలియఁబడదు. వినఁబడదు. లేనిజగత్తే
యున్నదానివలె భాసించెడిని. శివుడు తెలియఁబడినయెడ నాజ్ఞాని
స్వస్వరూపమును బొందుచున్నాఁడు. జగత్తులకున్న యీ ప్రతీతి
యనాద్యవిద్యామూలమైనది. ఆజగత్ప్రతీతి యాత్మబోధచే నశించి
నయెడ విశ్వప్రకాశ మెక్కడనుండును? అని పై శ్లోకముల యర్థము.
ఇంతకంటె నధ్యాసనుగూర్చి యేమి చెప్పవలయును. ఈ చెప్పిన
దానివలన సర్వాధిష్ఠానమైన పరశివునియందు జగత్తధ్యస్థమైనదే కాని
దానికి ప్రత్యేక ప్రతీతిలేదని తేలినది. కాన శ్రీకరభాష్యమున న
ధ్యాసనిరాసభాగము శ్రుతిస్మృత్యాదులకువలెనే శైవశాస్త్రముల
కుఁగూడ విరుద్ధమైయున్నది. ఆయుభాగము నెత్తివేసి యాస్థాన
మున నధ్యాసఖండనను జేర్చుట కార్యమని తలంచుచున్నవారము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇట్లు చెప్పఁగనే శైవసిద్ధాంతము శివాద్వైతమని చక్కఁగ సాధించితిరి సరే; అద్వైతమతస్థుడగువాడు బ్రహ్మజిజ్ఞాస చేయ నెంచినయెడ నత డుపనీతుడై బ్రహ్మచర్యమున వేదాధ్యయనము చేసి యా వెనుక సాధనచతుష్టయసంపత్తి కలుగఁగనే తీవ్రవైరాగ్యము కలిగినయెడ నా బ్రహ్మచర్యాశ్రమమునుండి కాని లేదా గృహస్థాశ్రమమునుండి కాని వానప్రస్థాశ్రమమునుండి కాని సన్యాసాశ్రమమును స్వీకరించి యుపసదనవిధిప్రకారము సద్గురువు నాశ్రయించి యా గురుని కడ బ్రహ్మవిద్యాశ్రవణముగావించి ముక్తిని గాంచవలెనని శాస్త్రాచారములు చాటుచున్నవి. మీ శ్రీకరభాష్య మట్లుగాక లింగధారణానంతరమున బ్రహ్మజిజ్ఞాస చేయవలెనని యుపదేశించియున్నదే. ఇది యెట్లుపపన్నమగునందురా? వినుఁడు.

—♦ జిజ్ఞాసాధికారి నిర్ణయము ♦—

శైవశాస్త్రములు శ్రుతిస్మృత్యాది శాస్త్రముల కనురోధములుగనున్నవే కాని విరోధములుగ లేవు. అవి ధర్మక్రమమును మీరి యుండలేవు. కాన శ్రీకరభాష్యమునందు లింగధారణానంతరము బ్రహ్మజిజ్ఞాసను జెప్పుట శైవశాస్త్ర దూష్యము కాదు. కాని యంతకుముందు సాధనచతుష్టయ సంపత్తికలవాడుగను దానికిఁ బూర్వమున ధర్మానుష్ఠానము చేసినను జేయకపోయినను వేదాధ్యయనము మాత్రము తప్పక చేసినవాడుగను నుండవలెనని మాత్రము శ్రీకరభాష్యము బోధించియుండవలెను. అది బోధింపకుండుట లోపమని చెప్పుకొనక తప్పదు. ఆ లోపము తీర్చుకొనఁదగినదే. లేకున్న భాష్యము పరిహాసాస్పదము కాకమానదు. అదేమన? శైవశాస్త్రజ్ఞాన మణుమాత్రమేనిలేని శైవులు కొందరు పుత్రుడు పుట్టఁగనే పురుడు వెళ్ళిననాడా కన్నులు తెరువని పసికూన గొంతు కొక లింగము నంటకట్టుచున్నవారు. ఇంతకంటె శాస్త్రదూషితకార్య మేమున్నది? లింగధారణమును జేసికొనఁదలంచినవాడు తనకై తాను సద్గురువు నాశ్రయించి యా గురువుకడ లింగధారణమును బొందవలెనని శైవశాస్త్రము చెప్పియున్నది. చూడుఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రపంచకమున రవ పుటను.

శ్లో॥ నిత్యానిత్యవిచారవానిహపరత్రాపేక్షితాధారతిః
శాంత్యాద్యంగ సమన్వితస్సుచరితో మోక్షార్థి తాత్సుక్యవాన్
సత్యానందపరప్రకాశ పరిపూర్ణాత్మ ప్రబోధాన్వితమ్
కృత్యాకృత్యవివేకినం గురువరం శ్రేయాన్నరో భక్తిమాన్॥

శ్లో॥ నత్వా భక్తిపురస్సరం గురువరం విజ్ఞాపయేత్పార్శ్వతః
స్థిత్వా జన్మశతాగతాద్భవభయాద్భీతోస్మి మాం శాధిభో
యేనాహం భవపాదప స్సుఖఫలశ్శోషం సమూలం ప్రయా
త్యారాత్కర్మబలేన తత్కథయ మే మోక్షప్రదం సద్గురో!

ఇవి లింగధారణమునకు ముందుఁ జెప్పిన వచనములు. వీని
ర్థమేమన? నిత్యానిత్య వస్తువిచారవంతుడును, నిహపరత్రాపేక్షి
ధారతియు శాంత్యాద్యంగ సమన్వితుఁడును సుచరితుడును మో
ర్థియు నౌత్సుక్యవంతుడును భక్తుడును నగు నరుడు సత్యానంద
ప్రకాశ పరిపూర్ణాత్మ ప్రబోధాన్వితుడును, కృత్యాకృత్యవివేకి
నగు గురువరుని జేరి వందనముచేసి ప్రక్కను గూర్చుండి భక్తి
స్సరముగ నమస్కరించి యో గురువరా! అనేకజన్మలనుండి వ
చున్న జన్మభయముచే భీతుడనై యున్నాడను. ప్రాపంచిక సు
ఫలముగాగల భవపాదప మేకర్మమూలమున సమూల
శోషించునో యట్టి మోక్షప్రదమగు మార్గము నుపదేశించు
వేడుకొనవలసినదిగాఁ బైశ్లోకములు చెప్పుచున్నవి. ఈ కోరిక
పదునొకండు రోజులనాడుపుట్టి కన్నులు తెరువని పసిబాలుఁడు
నవియా? అట్లని వివేకముకల శైవుడు తలంచునా? లింగధారణ
వైదికమనికదా శైవులు చెప్పుదురు? అది యనుపనీతుడగు బా
నర్చుకొనుట కధికార మెక్కడిది? లేదు. కాన ననుపనీతులగు
లురకు లింగధారి ద్విజులు లింగధారణము చేయుట పరమనిషిద్ధ
ర్యమని చెప్పుకొనక తప్పదు. ఇట్లు సకలశాస్త్ర విరుద్ధమైన య
కానుపనీత లింగధారణమును గూర్చి శైవులు వేదమతమున
తకును గళంక మాపాదించుటకంటె దానిని మానుట మంచిదని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చెప్పి ప్రకృతమునకు వచ్చుచున్నవారము. పోనిండు అనుపనీతునకు లింగధారణము చేయకున్నమానె యుపనయనమైన వెంటనే సాధన చతుష్టయసంపత్తి కలుగకపూర్వము లింగధారణము కావించుకొన వచ్చునాయని కొందరడుగవచ్చును. ఇందులకు సమాధానము శివ భక్తాగ్రగణ్యుడును, ప్రమథనాయకుడును నగు రేణుకాచార్యుడు చెప్పియున్నవాడు. చూడుడు. శైవసిద్ధాంత శిఖామణి యుపక్రమ మును. అందు పిండస్థలమున స్వకర్మ పరిపాకవశమున నరుడు ప్ర క్షీణమలవాసనుడై శుద్ధమానసములతో పుట్టుననియు వానికి శుద్ధకర్మవిపాకముచేఁ బ్రస్ఫుటమైన యీశ్వరభక్తి కలుగుననియు నప్పుడతఁడు పిండ శబ్దాభిధేయుడగుననియుఁ జెప్పి పిదపఁ బిండ విజ్ఞానస్థలమందును సంసారహేయతాస్థలమందును సాధన చతుష్ట యసంపత్తినిగూర్చి యీ క్రింది విధమున నుపదేశించి యనంతరమున లింగధారణము చేసికొనవలసినదని క్రమముగ బోధించియున్నవాడు.

శ్లో॥ శరీరాత్మవివేకేన । పిండజ్ఞానీతికథ్యతే (అని ప్రారంభించి)
శరీరేంద్రియబుద్ధిభ్యో । వ్యతిరిక్తస్సనాతనః
ఆత్మాస్తీతివివేకీయః । పిండజ్ఞానీసకథ్యతె
నిరస్తప్రత్యక్షశంకస్య । నిత్యానిత్యవివేకినః
సంసారహేయతాబుద్ధిః । జాయతేవాసనాబలాత్॥

శ్లో॥ ఐహికేక్షణికేసౌఖ్యే । పుత్రదారాదిసంభవే
క్షయిత్వాదియుతేస్వర్గే । కస్యవాంఛావివేకినః॥

శ్లో॥ నిత్యానిత్యవివేకినస్సుకృతినశ్శుద్ధాశయస్యాత్మనో ।
బ్రహ్మోపేంద్రమహేంద్రముఖ్యవిభవే వ్యస్థాయితాంపశ్యతః ।
నిత్యానందపదే నిరాకృతజగత్సంసార దుఃఖోదయే ।
సాంబేచంద్రశిఖామణౌసముదయేద్భక్తిర్భవధ్వంసినీ ॥

ఈ చెప్పిన వచనములనుబట్టి లింగధారణానంతరము బ్రహ్మ జిజ్ఞాస చేయనెంచినవాడు ముందు సాధన చతుష్టయసంపత్తినార్జించు కొనవలెనని తేలినది. సాధన చతుష్టయసంపత్తి యవిద్యాధికునికిఁ గలుగునది కాదుకదా? కావున [illegible] సాధన చతుష్ట యసంపత్తి కలిగినమీద లింగధారణము చేసికొని లింగ (బ్రహ్మ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విచారము నావించవలసినదని స్పష్టమగుచున్నది. ఇట్లు చెప్పఁగనే బ్రహ్మసూత్రములలో మొదటిదగు సూత్రము "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అనఁగ బ్రహ్మజిజ్ఞాస చేయవలసినదని యుపదేశించియుండ వారు లింగవిచారమును జేయవలెనని చెప్పెదరు. ఇది యెట్లు సరిపడునందురా? వినుడు.

—॥ లింగ బ్రహ్మ శబ్ద సమానార్థకత ॥—

బ్రహ్మలింగశబ్దములు సమానార్థకములని యనేక శాస్త్రములు చెప్పియున్నవి. ఇటుకనుకు. పంచాక్షరీ ధ్యానశ్లోకమును,

శ్లో॥ చైతన్యం పరిపూర్ణమేకమచలం జ్యోతిర్మయం వ్యాపకం ।
తత్పంచాక్షర మంత్రమాద్యమమలం సాక్షాత్ సూక్ష్మంపరం ।
లింగం బ్రహ్మసనాతనం సుమనసా ధ్యాతవ్యరూపంసదా ।
బాహ్యేభ్యంతరసంస్థితం పరశివం ప్రాణేశ్వరం భావయే॥

ఇందుఁ బరశివతత్వము లింగబ్రహ్మశబ్దములచేఁ బరామర్శింపఁబడియున్నది. కాన లింగబ్రహ్మశబ్దములు రెండును నేకార్థబోధములని మనము చెప్పకొనవచ్చునుగదా? ఇంతియకాదు. ఈ యర్థమునే సూతసంహితాముఖమున వ్యాసభట్టారకుం డిట్లు చెప్పియున్నాడు. చూడుడు. ౨౨౨ పుట.

శ్లో॥ లీయమానమిదంసర్వం । బ్రహ్మణ్యేవహిలీయతే
నలీయతేపరబ్రహ్మ । సదాసత్యస్వభావతః
శుక్తికారజతాదీనా । మసత్యానాం ద్విజర్షభాః
లయోదృష్టో నసత్యస్య । శుక్తికాశకలస్యచ
లీయతేహిశివాదన్య । దశేషంచశివంశివే
అతోలింగం ద్విజశ్రేష్ఠా । అవినాశి పరస్స్వయమ్॥

ఈ శ్లోకములకు శ్రీ విద్యారణ్య యతీంద్రు లిట్లు వ్యాఖ్యానము గావించియున్నారు.

"యత్రప్రయం త్యభిసంవిశంతీతి శ్రుతేః । యథాన్యద్బ్రహ్మణిలీయత ఇతి బ్రహ్మ । లింగమేవబ్రహ్మ । యత్రయత్రలీయతే తదపి కుతోనలింగమితి భ్రమం వారయతి । నలీయతే ఇతి । శుక్తికాశకలేషు ... దృష్టేర్యోష్యపి తర్హి । బ్రహ్మపదపరం లింగమిత్యతఆహ । లీయతేహీతి । వ్యవహారదశాయాం కల్పితంరజితం య

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధాజ్ఞానేన శుక్తికాశకలే లీయతే । నైవం శుక్తికాశకల మన్యత్ర । తత్వదృష్ట్యాతు శుక్త్యాదిసకలం బ్రహ్మణ్యేవ లీయతే నబ్రహ్మాన్యత్రేతి । బ్రహ్మైవ లింగమిత్యర్థః॥

"యత్ప్రయం త్యభిసంవిశంతి" యని శ్రుతి చెప్పుచున్నది. కావుననే బ్రహ్మయం దన్యమంతయు లీయమగుచున్నది. కాన నది బ్రహ్మయయ్యెను. లింగమే బ్రహ్మము. ఇట్లనిన నెచ్చటెచ్చట లీయమగుచుండునో యదెల్ల లింగమగునా యను సంశయము కలుగక దాని నిట్లు నిరసించుచున్నది. వ్యవహారదశయందుఁ గల్పింపఁబడిన రజతజ్ఞానము శుక్తికాశకలమందు లీనమగుచున్నది. కాని శుక్తికాశకలముఁ రజతమందు లీనమగుటలేదు. అట్లే శుక్త్యాది సకలప్రపంచము బ్రహ్మయందు లీనమగుచున్నదికాని బ్రహ్మ ప్రపంచమందు లీనమగుటలేదు కాన బ్రహ్మమే లింగమని యర్థము - అని చెప్పుటచే లింగబ్రహ్మశబ్దము లేకార్థప్రతిపాదకములని మన మిదివరకుఁ దలంచినది శాస్త్రసమ్మతమైనట్లు స్పష్టమైనది.

ఇంతియె కాదు. ఈ యర్థము నే యించుమించుగ లింగధారణస్థలమునందు శైవసిద్ధాంత శిఖామణిముఖమున రేణుకాచార్యులిట్లుపదేశించియున్నాడు. అదెట్లన?

శ్లో॥ లయంగచ్ఛతియత్రైవ । జగదేతచ్చరాచరం
పునఃపునస్సముత్పన్నం । తల్లింగం బ్రహ్మశాశ్వతమ్॥

అనునది. ఈ చరాచరాత్మకమైన జగత్తంతయు నెచట లయమును బొందుచున్నదో యెందు తిరిగితిరిగి పుట్టుచున్నదో యాలింగమే శాశ్వతమగు బ్రహ్మమని పై శ్లోకార్థము. ఇందు నాలింగమే బ్రహ్మమని చెప్పుటచే లింగబ్రహ్మశబ్దములు సమానార్థద్యోతకములని ధృవపడినదికదా? కాన లింగధారణము చేసికొనుటయన బాహ్యలింగధారణము మాత్రముతో నే తనివినందక, యంతర్లింగానుసంధానము(బ్రహ్మజిజ్ఞాస)కూడ చేయవలెనని తేలినది. ఈవిషయము సత్యమని క్రింది శైవసిద్ధాంతశిఖామణి వాక్యములు తెలుపుచున్నవి.

శ్లో॥ ఆధారే హృదయేవాపి । భ్రూమధ్యేవా నిరంతరం
జ్యోతిర్లింగానుసంధాన । మాంతరంలింగధారణం॥

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ నిరుపాధిక మాఖ్యాతం । లింగ స్యాంతరధారణం
విశిష్టకోటిగణితం । బాహ్యలింగస్యధారణాత్

యేధారయంతిహృదయే । లింగంతద్రూపమైశ్వరం
న తేషాం పునరావృత్తి । ర్ఘోరసంసారమండలే॥

ఆధారమునఁగాని హృదయమునఁగాని భ్రూమధ్యమునఁగాని ్యోతిర్లింగానుసంథానము చేయుటేదికలదో యది యాంతర లింగ ారణ మనిపించుకొనును. అంతర్లింగధారణము నిరుపాధికమని ెప్పఁబడును. బాహ్యలింగధారణముకంటె నంతర్లింగధారణము ోటిగుణితముగాఁగూడి యధికమైనదగును. ఎవరు హృదయమున శ్వరసంబంధమయిన లింగమును ధరించుచున్నారో వారికీ ఘోర ంసారమండలమునఁ బునరావృత్తి కలుగనేరదు. ఇందువలన నం ర్లింగానుసంథానము మనకు గమ్యమని గ్రహించుటయే యవసర ు. అంతియేకాని బాహ్యలింగధారణము మానుమనికాదు. ఈ షయమై యావెంటనే యిట్లు చెప్పఁబడియున్నది.

శ్లో॥ అంతర్ధారయితుం లింగ । మశక్తశ్శక్త ఏవవా
బాహ్యేచ ధారయేల్లింగం । తద్రూపమితి నిశ్చయాత్॥

అంతర్ధారణము చేసికొన శక్తికలవాడుకాని లేనివాడుకాని తద్రూపమను శ్చయముతో బాహ్యలింగధారణము కావించుకొనవలయును. ఇంతవరకు జెప్పిన ానింబట్టి బ్రహ్మవిచారము చేయనెంచిన శైవు డుపనయనము కాగానే బ్రహ్మచ ర్యవ్రతమూని వేదాధ్యయన మొనర్చి పిదప ధర్మానుష్ఠానము నుగించియో ముగించక ో బాహ్యలింగధారణము చేసికొని యాంతర లింగధారణ(బ్రహ్మవిచార)మున ుపక్రమించవలెనని తేలినదికాన శ్రీకరభాష్యమున బ్రహ్మజిజ్ఞాసాధికరణమున 'అథ' శబ్దార్థబోధనమందు లింగధారణానంతరము బ్రహ్మవిచారముచేయవలెనని చేసిన బో ధకుముందు సాధనచతుష్టయ సంపత్తి నార్జించుకొనుటను దానికిముందు ధర్మజిజ్ఞా సను, దానికివెనుక వేదాధ్యయనమును జేర్చు టవసరమని తలంచుచున్నారము.

ఇది యుక్తముగనేయున్నది కాని సకలభాష్యకర్తలచేతను జ్యోతిశ్చరణాధి కరణమునందు జ్యోతిశ్శబ్దవాచ్యమగు వస్తువు జ్యోతిస్స్వరూపమగు చతుష్పాద్బ్రహ్మ ప్రతిపాదింపబడియుండ శ్రీకరభాష్యకర్త యంతటిలో దనివినందక యాప్రకరణ మునకు సంబంధములేనిదియు నితర భాష్యకర్తలచే గ్రహింపఁబడనిదియు నగు గాయత్రీ విచార ముపక్రమించి భర్గశబ్దము శివుని బోధించుచుండగా గొందరు దా నికి దేజస్సనథము చెప్పెదరు. కాని యది శాస్త్రవిరుద్ధమనుచు నేమేమో వ్రాసినా రు కదా - అది ప్రకృతమా? యని కొందరు శంకింపవచ్చును. ఇందులకీయవలసిన యాభి ప్రాయము భర్గశబ్దార్థనిర్ణయమును గురించి చెప్పుచున్న వారము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

— పత్రికాధిపతి.

# శైవ ధర్మ ప్రకాశిక.

(భాగధేయము)

హేలాపుర వాస్తవ్యులును, వదాన్యజన శేఖరులును, లింగధారి బ్రాహ్మణ కులావతంసులును, గొప్ప భూస్వాములును నగు మహారాజరాజశ్రీ చాగంటి కైలాసరావు పంతులవారు మా శైవధర్మ ప్రకాశికా పత్రికా పుత్రికను గని పరమానందభరితులై 'మా వలన మీ కేమి సహాయమును గోరదలంచితిరో కోరుడు. దానిని జేయుటకు సంసిద్ధముగ నున్నా'మని మహోత్సాహముతోఁ బ్రశ్నించిరి. అందులకుఁ బరమానందభరితులమై మా పత్రికాపుత్రిక చక్కఁగ నడుచుటకు సంవత్సరమున కిరువదియైదు రీముల కాగితము కావలెను. ఆ భారమును దాము వహింపవలెనని మా యభిలాషయని విన్నవించితిమి. రీమున కెంత వెల యగునని యడిగిరి. మూడు రూప్యము లుండునంటిమి. అటులేని డెబ్బదియైదు రూప్యముల నిచ్చెదము. తాము కాగితము తెప్పించుకొండని యతి గంభీరస్వనముతో నాజ్ఞ యొసంగిరి. ఇది మా శైవధర్మ ప్రకాశికా భాగధేయమనుటకు సంశయమేమి? పరమేశ్వరుడు సర్వకాలములందు శ్రీ కైలాసరావు పంతులవారికిఁ బురోవర్తియై సర్వశుభములఁ బ్రసాదించుచుండుగాక. మా శైవధర్మప్రకాశిక శాస్త్రవిహిత శైవధర్మములను బ్రకాశింపఁజేసి పేరుకుఁ దగిన ప్రఖ్యాతి గడించి శైవమతాభివృద్ధికై ప్రయత్నించుచుండునటులఁ బ్రోత్సహించుఁగాత.

—పత్రికాధిపతి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రీ శైవధర్మప్రకాశిక కీసెలలో చందాలొసగినవారు.

శ్రీ భాగవతుల సీతారామయ్యగారు.
శ్రీ కొమరవెల్లి ముసలయ్యగారు.
శ్రీ ఇవటూరి అఘోరపతిగారు.
శ్రీ చాగంటి శరభలింగంపంతులుగారు.
శ్రీ యెల్లంకి లింగయ్యగారు.
శ్రీ ఇవటూరి వీరభద్రరావుగారు.
శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు.
శ్రీ కందుకూరి బసవరాజేశ్వరరావుగారు.
శ్రీ చాగంటి పేరయ్యలింగముగారు.
శ్రీ దొంతుకుర్తి గంగాధరంగారు.
శ్రీ కాజా నరసింహంగారు.
శ్రీ భండారు వీరభద్రరావుగారు.
శ్రీ కామరాజుగడ్డ మృత్యుంజయశర్మగారు.
శ్రీ చామర్తి మహాబలేశ్వరరావుగారు.
శ్రీ పండితారాధ్యుల నాగభూషణంగారు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# కలరా సంజీవి.

కలరాను నిర్మూలముచేయుటలో నిస్సందేహముగ నిది సంజీవియే. అనేక యోగ్యతాపత్రములు, బంగారుపతకములు పొందబడియున్నది

వెల సీసా 1కి రు. 1-0-0. గౌతమ మెడికల్ హాల్, బెజవాడ.

---

జి. యస్. బి. సరస్వతి రంకుచరిత్రాత్మకమగు

—* జాతివిభాగాదర్శము *—

ప్రథమభాగము— వెల. రు 0-8-0.

బ్రాహ్మణేతర దుస్థితి

3 భాగములు — భాగము 1కి రు 0-2-0.

చండాలాస్పృశ్య మండనము ... ... వెల రు 0-4-0

శ్రుతిధర్మసంజీవనీ పక్షపత్రిక, బెజవాడ.

సంవత్సర చందా.

| | | | |
|---|---|---|---|
| ప్రధానపోషకులకు | రు 12-0-0 | చందాదారులకు | రు 3-0-0 |
| అనుపోషకులకు | రు 6-0-0 | ఆరుమాసములకు | రు 2-0-0 |

---


SRI JAGADGURU VISHWARADHYA JNANA SIMHASAN JNANAMANDIR LIBRARY Jangamawadi Math, Varanasi Acc. No. 7663


...—ఇది 7 అంకముల చరిత్రాత్మక మగు నాటకము. ...క్రమము లిందు చక్కగా వర్ణింపబడినవి. శైలియునోహ...నై ప్రదర్శ...నుకూలముగ నుండును. వెల 0-12-0.

...— ముదిగొండ బసవయ్యశాస్త్రి, నూక్త్యాల, కృష్ణాజిల్లా.

శైవధర్మప్రకాశిక:—ఇది యొక మాసపత్రిక. ఇందు శైవధర్మములు వెల్లడింపబడును. అవి బాలబోధకములగు సవిమర్శక వ్యాసములుగ నుండును. చందా సం॥ 1కి రు౧-౦-౦.

పత్రికాధిపతి.—శివపురపు వీరభద్రపాకయాజి.

—* శ్రీమతి తతి వల్లికా మతల్లిక *—

ఇందు సంఘసంస్కర్తలయొక్క దుర్బోధలు, కుతర్కములును సప్రమాణముగ ఖండింపబడి వైదికధర్మనిరూపణము చేయబడియున్నది.

వలయువారిట్లు వ్రాయుడు:— బ్ర. శ్రీ॥ గా॥ వేంకటనరసింహశాస్త్రిగారు, విద్యానందసరస్వతీ, నేమకల్లు, విప్పగిరిపోస్టు (బళ్లారిజిల్లా)


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

